

మార్చి 8

అంతర్జాతీయ మహిళా దినోత్సవం

సాహిత్య

# ప్రస్థానం



మార్చి 2018

వెల రూ. 20

ఎక్కడమ్మా నువ్వు లేనిదీ
ఏమిటీ నువ్వు చేయలేనిదీ....

సాహితీస్రవంతి










5వ విడత, 2–11 జనవరి.

# జన్మభూమి మా ఊరు 2018

# ఆనంద లహరి

**మీకు భరోసాగా నిలుస్తాను, మీ భవితకు బావుటానవుతాను!**

సోదరీ, సోదరులారా...

గత తొమ్మిది రోజులుగా ఎంతో ఉత్సాహంతో జన్మభూమి–మా ఊరు కార్యక్రమంలో పాల్గొని విజయవంతం చేసిన ప్రతి ఒక్కరికి పేరు పేరునా ధన్యవాదాలు. జన్మభూమి కార్యక్రమంలో భాగంగా 11 జిల్లాలు పర్యటించి మీ సమస్యలను తెలుసుకొని నేరుగా మీతో మాట్లాడే అవకాశం నాకు లభించింది. ఈ పదిరోజుల్లో పది అభివృద్ధి అంశాలు చేపట్టి, ప్రతీ అభివృద్ధి ప్రయోజనాన్ని చిట్ట చివరి గడప వరకు అందించేలా చర్యలు తీసుకున్నాం.

- ఉత్సాహంగా అర కోటి మందికి పైగా ప్రజల భాగస్వామ్యం
- 10 లక్షలకు పైగా ప్రజా వినతుల స్వీకరణ
- 75 వేలకు పైగా గ్రామ సభలు నిర్వహించి గ్రామాభివృద్ధికి తోడ్పాటు
- సుమారు 15 వేల వైద్య శిబిరాల ద్వారా 10 లక్షల మందికి పైగా ప్రయోజనం
- లక్షా 50 వేలకు పైగా కొత్త రేషన్ కార్డుల పంపిణీ, లక్షకు పైగా కొత్త పింఛన్లు.

మొత్తం ప్రభుత్వ యంత్రాంగాన్ని మీ చెంతకు తెచ్చి 10 లక్షలకు పైగా అర్జీలను స్వీకరించి తగు చర్యలు తీసుకుంటోన్న ప్రభుత్వ అధికారులు, ఉద్యోగులు అభినందనీయులు. ఇదే ఉత్సాహం, దీక్ష, పట్టుదల, నిరంతర కృషితో నవ్యాంధ్రప్రదేశ్ సాధనకు వడి వడిగా ముందుకు పోదాం! నా ప్రతిక్షణం జన్మభూమి శ్రేయస్సుకే అంకితం. జన్మభూమిని జగద్విఖ్యాతం చేద్దాం. ఊరూరా వాడ వాడా సంక్రాంతి సంబరాలు ఆనందంగా జరుపుకోవాలని ఆశిస్తూ మీకు శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

***జై జన్మభూమి జై ఆంధ్రప్రదేశ్!***

ఇట్లు
మీ ముఖ్యమంత్రి
నారా చంద్రబాబు నాయుడు.





సంక్షేమం సంతృప్తి



ఆరోగ్యం ఆనందం



స్వచ్ఛాంధ్రప్రదేశ్




విద్య - వికాసం



మౌలిక సదుపాయాలు



సహజ వనరులు అభివృద్ధి



వ్యవసాయ, అనుబంధరంగాల అభివృద్ధి



సుపరిపాలన టెక్నాలజీ వినియోగం



విజన్ స్వర్ణాంధ్రప్రదేశ్ పేదరికంపై గెలుపు



ఆనంద లహరి

సాహిత్య
ప్రస్థానం
మార్చి 2018

సంపుటి : 17 సంపాదకీయం సంచిక : 3

# మహిళా చైతన్యం

"స్త్రీకి కూడా శరీరం ఉంది. దానికి వ్యాయామం ఇవ్వాలి. ఆమెకి మెదడు ఉంది. దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకు హృదయం ఉంది. దానికి అనుభవం ఇవ్వాలి– అనే సంగతిని గుర్తించని ఈ దేశానికి నేను చెప్పే సంగతులు అర్థమవుతాయా? పాశ్చాత్య నాగరికత వ్యామోహంలో పడి వొళ్ళు తెలీక నోటికి వచ్చినట్లు కూసే కూతలనుకుంటారని తెలుసు" పురుషాధిక్యతతో కళ్ళు మూసుకుపోయేవారికి చలం రాసిన ఈ వాక్యాలు చెళ్ళున తగులుతాయి. సుమారు వందేళ్ళ క్రితం చలం రాసిన ఈ మాటల సారాంశం ఇప్పటికీ తలకెక్కని పరిస్థితి విషాదకరమైన వాస్తవంగా మనల్నీ వెంటాడుతుంది. పురుషాధిక్య సమాజమూ, మత ఛాందసమూ మార్కెట్ ప్రేరిత ప్రభుత్వ విధానాలు మహిళల మనుగడకే కొత్త సవాళ్లు సృష్టిస్తున్నాయి.. అంతర్జాతీయ మహిళా దినోత్సవం ఒక ఉత్సవంగా మార్చారు గాని ప్రతీ ఇంటి నుండి వెళ్ళే ఆడపిల్లకు ఎన్నో జాగ్రత్తలు చెప్పి తిరిగి వచ్చేదాకా బిక్కుబిక్కు మని చూసే పరిస్థితి నెలకొంది. మానవ సంస్కారాన్ని పెంపొందించాల్సిన నవీన నాగరికత ఇంకా పురుషుల మస్తిష్కంలోంచి, పాలకుల విధానాల్లోంచి మహిళలను కించపరిచే భావజాలాన్ని నిర్మూలించలేకపోగా కొత్త వికృతాలు సృష్టిస్తున్నది.

దేశంలో ఇంకా భూస్వామ్య భావజాలం రాజ్యమేలుతుంది. ఇక్కడి స్త్రీల పరిస్థితులు మరీ దారుణం. ఇటీవల కాలంలో ఛాందస భావాలను ఉద్దేశపూర్వకంగా వ్యాప్తిచేయడం చూస్తున్నాం. వీటి తాకిడి ముందు స్త్రీలనే బలితీసుకుంటున్నది. ఈ దేశంలో మత, కుల వ్యవస్థ . మరీ ముఖ్యంగా స్త్రీల చుట్టూ అతిదారుణంగా దురాచారాల సంకెళ్ళను బిగించింది. వాటిని ఛేదించడానికి ఆధునిక కాలంలో కూడా మహిళలు పెనుగులాడుతూనే ఉన్నారు. మానవ వికాసానికి, సామాజిక అభివృద్ధికి ఆటంకంగా నిలిచే అన్ని రకాల ఛాందసాలు కాలం పరుగులో పతనం కాక తప్పదు. అత్యాచార సంఘటనలు, లైంగిక అమానుషాలు సామాజిక దుర్మార్గాలు ఆందోళనకరంగా మారాయి. మరోవంక గర్భవతులతో సహా తల్లులూ పిల్లలకు పౌష్టికాహారం లేదు. సరళీకరణ యుగంలో మత మార్కెట్ చాందసాలు మహిళలకు భద్రతా బతుకూ కూడా దుర్భరం చేస్తున్నాయి. స్త్రీల శరీరాలతో వ్యాపారం చేసుకోవాలనుకునే క్షుద్ర దర్శకులు తయారవుతున్నారు. అధికార పీఠాలపై వున్నవారే స్త్రీలను కించపర్చేలా మాట్లాడుతున్నారు. వీటన్నిటికీ విరుగుడు బాధితులంతా కలసి పోరాడటమే. మిగిలిన అన్ని సామాజిక ఆర్థిక పోరాటాలతో పాటు స్త్రీల విముక్తి కోసం ప్రత్యేకంగా ఉద్యమించడమే వీటన్నిటికీ జవాబు. మహిళాలోకం సహనం పూర్తిగా నశించకముందే ఏలిన వారు ఆ దిశలో అడుగులేయడం మెరుగు. ◆



రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com

సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి! తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 240/- ◆ 5 సంవత్సరాల చందా రూ.1000 /
◆ 10 సంవత్సరాల చందా రూ. 2000/-
Bank Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBIN0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.



3

## కవిత

# చెట్టుకో ఇల్లు

- డా.సి.భవానీదేవి
9866847000

ఆ చెట్టు మళ్ళీ మా ఇంటికొచ్చింది
నిన్ననే మొదలంటా నరికేశాం
అయినా సిగ్గులేకుండా మళ్ళీ వచ్చింది
నాలుగు రోజులయిందేమో
ఇల్లంతా వేళ్ళని చనువుగా పరుచుకుంది
పొద్దున్నే నిద్ర లేస్తూ ఉలిక్కి పడ్డాను
కిటికీ అంచుమీద లేతవేళ్ళ చిరునవ్వు
స్నానం చేస్తున్నప్పుడు కూడా
నీళ్ళ బకెట్‌లో దాని నీడలే!
పూజామందిరమంతా అల్లి బిల్లిగా
అల్లుకున్న ముగ్గులు ఆ చెట్టువేళ్ళే!



టి.వి. చూస్తుంటే పొడుచుకొచ్చింది
దానిలోంచి ఆప్యాయంగా చిన్నకొమ్మ
ఇల్లంతా టైల్స్ మధ్యలోంచి
గుబురు గుబురుగా అన్నీ దాని వేళ్ళే
ఇల్లు దానికే వదిలేసి వెళ్ళిపోదామనుకుంటే
నా పాదాల్లోంచి చిట్టిచిట్టి వేళ్ళు
నన్ను నిలువునా బంధిస్తూ..
ఆ వేళ్లలోంచి చిన్న లేత చిగుళ్ళు
ఆ చెట్టుకు నన్నొక ఇల్లుగా మారుస్తూ ♦

కథ

# ధన త్రయోదశి

భండారు అచ్చమాంబ



1874 - 1905

ధన త్రయోదశి నాటి సాయంత్ర మేడుగంటల వేళ నెటు చూచినను నానందోత్సవములతో బొంబాయి పట్టణము నిండియుండెను. నాడు దీపావళి దినమున నగునంత దీపోత్సము లేకుండినను బ్రతిగృహము నందును ఆ గృహము యొక్క యాకారమును సౌందర్యమును నితరులకు జూపఁగలిగిన దీపమాలికలు వెలుగుచునే యుండెను. ఎటు విన్నను టపాక్కాయల ఫటఫట ధ్వనులు వినవచ్చుచుండెను. ఇంటింటను పళ్లెరములలో స్వర్ణాలంకారముల నుంచి లక్ష్మిపూజలను జేయుచుండిరి. కాని, యొక యింటమాత్ర మిట్టియుత్సవ చిహ్నము లేవియుఁ గానవచ్చుట లేదు. దీనిని ఇల్లనుట కంటెఁ గుటీరమనిన బాగుండును. ఈ కుటీరము గొప్ప సాహుకార్ల రెండు మేడల నడుమ నుండి చెల్లెలగు లక్ష్మీదేవి యుత్సవముఁజూడ వచ్చిన జ్యేష్ఠాదేవియే యనునటుల నుండెను. ఈ యింటి వలన ఆ బజారునకుఁగల శృంగార మొక్కింత తగ్గినను దీనియందలి పరిశుభ్రతను వ్యవస్థను గనిన వారి మనములకు నుల్లాసము గలుగుచుండెనని మాత్రము చెప్పవచ్చును. ఇట్టి గొప్ప పట్టణమునందీ యుత్సవసమయమునందే ధనికుని వృత్తాంతమును జెప్పక మాకొక దరిద్ర కుటుంబవార్తను జెప్ప మొదలు పెట్టినదని నా ప్రియ సోదరీమణులు నాపైఁ గోపగించెదరేమో ? అక్కలారా మీరట్లు విసువక నేను జెప్పఁబోవు కథను సావధానులరై వినినచో మీకీ గృహవార్తయే విశేషయుత్తమమయినదని తోఁచకపోదు.

నేనుఁజెప్పిన కుటీరము యొక్క రెండు ప్రక్కలను గొప్పగొప్ప మేడ లుండినటుల నేనిదివరకే చెప్పితిని. వానియందనేక దీపములు వెలిగింపబడి యుండెను. అయితే మధ్యగల కుటీరమునందొక్క దీపమే వెలుగుచుండెను. దాని సమీపము నందు విజయలక్ష్మమ్మ కూలికిఁ గుట్టఁదెచ్చిన పరుల రెవికను గుట్టుచుఁ గూరుచుండెను. ఆమె సమీపమున నాఱుసంవత్సరముల బాలికయు' మూడు సంవత్సరముల ముద్దు బాలుఁడును గూర్చుండి తమ బాలికలు జూపుచుఁ దెలిసియు దెలియని ప్రశ్నలచెఁ దమ తల్లి మనమున కానందము కలుగుజేయుచుండిరి. విజయలక్ష్మమ్మ సాయంత్రపు వంటచేసి పెనిమిటి రాక కెదురుచూచుచుండెను. ఆమె భర్త వెంకట సెట్టియను నొక గొప్ప సాహుకారు నింట గుమాస్తాగా నుండెను. నేఁడు ధనత్రయోదశిగాన, సెట్టిగారి యింట లక్ష్మీపూజ కానిదే భర్తరాఁడని యెఱిఁగిన దగుటవలన నామె పిల్లలకు భోజనములు పెట్టి మైలబడి రెవిక కుట్టుకొనుచు భర్త యాగమనమున కెదురుచూచుచుండెను. ఆహా! గ్రామమునందుఁ జరుగుచుండిన యుత్సవము

వైపెంతమాత్రమును జిత్తము లేక తదేకాయత్తచిత్తయై పెనిమిటి రాకను గోరుచున్న యా వనిత మొగమెంత మనోహరముగానుండెనో? అట్టి స్త్రీలను గన్నులారఁగనుఁ గొన్నవారలకేకాని యితరులకు దెలియనేరదు. ఇట్లామె తన బాహ్యచక్షువులను మాత్రము కుట్టుచున్న రెవిక పైనుంచి యంతశ్చక్షువులతోపె బెనిమిటి రాకను జూచుచుం గూర్చుండెను. ఇంతలో ముద్దుల బాలుఁడగు నామె కొమారుఁడామెను సమీపించి మెడను గట్టిగాఁ గౌగిలించుకొని నందువలన నామె తన మనసును వానివైపునకుఁ ద్రిప్పవలసినదయ్యెను. ఇంతవఱకామె వాఁడడిగిన ప్రశ్నలకెల్ల హూ యనుచు నేదో యొక జవాబు చెప్పుచుఁదన పనినిఁ జేసికొనుచుండెను. గాని, బాలుఁడు తన ముద్దుహస్తములతో మెడకు బంధము వేయఁగా నామె వెంటనే కుట్టుపనిని నవతల నుంచి పిల్లవానినిఁ దగ్గిర నుంచుకుని బుజగరించి ముద్దు పెట్టుకుని 'నన్నుగన్న నాయనా! నీకేమి కావలెను? నీవక్కతో నింత వఱకాడుకొనుచుంటివే అట్లే యింక కొంచె మాడుకొనుము. నేను పరుల రెవికను గుట్టుచున్నాను. ఇది త్వరగాఁ గుట్టవలెను' అనెను. తల్లి నోటి నుండి మాట వచ్చిన వెంటనే యా సుగుణవంతుండగు బాలుఁడు లేచి యావలి కరిగెను. ఇంతలోఁ బొరుగింటఁ గాల్చిన చిచ్చుబుడ్డి వెలుగు వాని కగుపడినందున వాఁడు మిక్కిలి సంతోషముతోఁ జేతులతో వెలుతురుఁ జూపుచు, గంతులు వేయుచు అమ్మా!. అత్తల తమాసాగా యున్నది అక్కడతో జూలపోతానని తన ముద్దుమాటలతోఁ దల్లినడిగెను. వాఁడు పోదునన్న స్థలము సమీపమైనందున విజయలక్ష్మమ్మ వెంటనే బిడ్డను బిలిచి రుక్మిణీ! నీవీ రామునినిఁ దీసికొని పొరుగింట నగుచుండిన వేడుక చూసి తీసికొనిరా, భద్రము సుమా దీపము నొద్దకు దీసికొనిపోకు. అచట నెవరితోనేని తగువులాడకు అని చెప్పి పంపెను. వెంటనే యా బాలకులు పొరిగింటి వాకిటికిఁ బోయిరి. ఇట్లు పిల్లలు పోవుచుండుగా వారి తల్లి కమిత దుఃఖము కలిగి యామె యశ్రుపూర్ణ నేత్రముల వారినిఁ జూచుచుండెను. పాపమామెకు దొలిదినము సంగతి జ్ఞాపకము వచ్చినది కాఁబోలు, తొలి దినము వారు టపాక్కాయల పండుగుగా నెటులనో యామె వారిని సమాధానపఱచెను. అప్పటినుండి యా పిల్లలును మరల తల్లిని నడుగనేలేదు. తుదకు పొరుగింట టపాక్కాయలు పిల్లలు కాల్చుచున్నను నడుగక యూరక చూచివచ్చెదమాయని యడిగినవారి సద్గుణమునుగని యిట్టి మంచి బాలుర కోర్కెలు తీర్చుటకుఁ దగినంత యైశ్వర్యము మనకు లేకపోయెనుగదా యని తల్లికి మరింత దుఃఖము హెచ్చెను. ఉండుటకిల్లు మంచిదిలేదనిగాని, కట్టుటకుఁ గొప్పవస్త్రము లేదనిగాని పండుగనాఁడు పిండివంటలు చేసికొనుటకు వీలులేదనిగాని యెన్నడును నామెకుఁ జింత కలుగలేదు. ప్రతిదినము నష్టకష్టములతో గడుచుచున్నను నామె సద్గుణవంతుఁడగు భర్త సహవాసము వలన సంతోషముగానే కాలము గడుపుచుండెను. గాని, కడుపున గన్న బిడ్డల కష్టములను దలచుకొనినంత మాత్రమున నామె కపరిమిత దుఃఖము కలుగుచుండెను. ఆమె తాను విశేషవైభవము ననుభవించిన దగుటవలన దన సంతానమున కిట్టి కష్టములు వచ్చెనని పొక్కుచుండెను. నిజముగా విజయ లక్ష్మమ్మయు వెంకటరత్నమును జిన్నితనమునందు చాలా యౌశ్వర్యమనుభవించిరి. కలకలూరు మల్లయ్యయను నొక యగ్రహారీకునకు వెంకటరత్నమొక్కడే కొడుకు. అందువలన నాతని వివాహము పదవయేటనే విశేష యుత్సవముతో జరిగెను. తనకొక్కడే పుత్రుడైనందునను, తాను గ్రామమునందఱికంటె నధిక ధనవంతుఁడని పేరొందినందునను మల్లయ్య గారీ వివాహమునకు విశేషధనము వ్యయపఱిచిరి. ఆ వివాహమునకు బదునేను వేల రూపాయలు ఖర్చయ్యెను. అయ్యెయ్యో వివాహమునకు బదునేనువేల రూపాయిలు ఖర్చయిన దంపతులకిప్పుడు పదునేనువేల రూపాయలు కండ్లకగుపడుట బంగారమైనది. అయితే యీ కాలములోఁ గొందఱి యగ్రహారీకుల యగ్రహారములు పాడగుటఁ జూచిన వారికిది యొక విచిత్రముగానుండదు. మల్లయ్యగారి యగ్రహార మదివఱకే కొంత తాకట్టు పెట్టఁబడియుండెను. అయినను వారి యింట జరుగు కార్యములు పూర్వము వలెనే జరుగుచుండినందున దినదినమునకు నప్పులు హెచ్చుచుండెను. ఇట్టి సమయమున నొక్కగాని యొక్క కొమారుని వివాహము చేయవలసిన సమయము మించిపోవునని తలచి యతఁడింకను గొంత ఋణము చేసి వివాహము చేసెను.

ఈ ఋణము వలననే వెంకటరత్నముగారికిప్పు దన్నము దొరుకుట సహితము దుస్తరమై చిన్న పిల్లల కష్టములకు వారు విచారపడవలసినంత దుర్దినము వచ్చినది. మల్లయ్యగారి జీవితము నందు మాత్రము ఋణస్తులెవ్వరును విశేష తొందర చేయలేదు. కాని ఆయన ప్రాణము పోయిన వెంటనే యందరు నొక్కసారిగా వచ్చి కలదానిలో రూపాయికి నర్ధరూపాయి చొప్పున

దమతమ బాకీలను దీర్చికొనిరి. పాపము, యుక్తవయస్సు రాకమునుపే వెంకటరత్నముగారికి దమ పెద్దల చాతుర్యము వలననో తెలివితక్కువవలననో గలిగిన ఫలము ననుభవింపవలసి వచ్చెను. వెంకటరత్నము మిక్కిలి సద్గుణుండు. ఆయన పసితనము నందగ్రహారీకుల వైభవము ననుభవించినను వారి యందుండు దురభిమానము, ఉన్మాదము, సోమరితనము మొదలైనవాయన్నంటినవికావు. ఆయనకుఁ దగినటుల భార్యయు సద్గుణవతియే దొరికిందునఁ దరిద్రతకై యొకప్పుడాయనకుఁ జింత గలిగిన భార్య యనుకూలతను జూచి దుఃఖము నాచుచుండెను. తండ్రి చచ్చువఱకాయన ప్రవేశపరీక్ష యందు మాత్రము కృతార్థుఁడయ్యెను. ఇంకను జదువుకుని విద్యాభివృద్ధి చేసికొనుటకు వయసున్నను ధనము లేనందున నాఁతఁడు వెంటనే యుద్యోగములోఁ బ్రవేశించెను. ఉద్యోగములీ కాలములోఁ దొరుకుటయే మిగుల దుర్ఘటము. ఇట్టి స్థితిలో నెటులనో వెంకటసెట్టియను నొక గొప్ప సాహుకారు దగ్గిర పదిరూపాయిలు వేతనముగల గుమాస్తాగిరి దొరికెను. ఆ పదిరూపాయిలాతో వారెటులనో దినములు గడుపుచుండిరి. ఇట్టి స్థితిలో వారికిఁ దమ బిడ్డలను గూర్చి విచారము కలుగుట సహజమే.

విజయలక్ష్మమ్మకుఁ దన బిడ్డల స్థితినిఁ గూర్చి విశేష దుఃఖము కలిగినదని పైనఁ జెప్పితిని. అప్పుడామె కన్నుల యెదుట పూర్వపు వైభవము, అది నాశనమైన విధమును బ్రస్తుతస్థితి వల్లఁ బిల్లలనుభవింపుచున్న కష్టములును గానుపించెను. ఈ సంగతులన్నియుఁ దలఁపునకు వచ్చినందున నామె దుఃఖము పొరలి పొరలి యాపుకొన శక్యముగాక వచ్చుచుండెను. ఇంతలో రాముని యేడు పామెకు వినఁబడినందున నామె దిగ్గున లేచి పొరుగింటి వద్దకిఁ బోయెను. ఆచటికీమె పోవునంత కచటనొక స్త్రీ రామునిఁ గొట్టుచుండెను. ఆ చిన్నవాని తప్పిదము విచారింపగా నచట నొత్తిలేని టపాకాయ నొకదానిని వాఁడెత్తికొని విరిచి యటనున్న నొక దీపము దగ్గిర పెట్టెను. అందువలన నా దీపమారిపోఁగా నా యింటి పిల్లవాఁడు రామునిఁగొట్టి వాని యేడుపు వినఁబడినఁ దల్లి తనను గొట్టునను భయముచే వాఁడే తనను గొట్టెనని పెద్ద పెట్టున నేడువసాగెను. వాని యేడుపు విని వాని తల్లి పరుగెత్తివచ్చి తన పిల్లవానిని రాముఁడే కొట్టెనని తలఁచి వాని సుకుమారతనైనను జూడక గొడ్డును బాదినట్టుల బాదసాగెను. తమ పిల్లలను తామధికముగా గొట్టు తల్లులయినను వారి నితరులు కొట్టుచుండఁగాఁ జూచి సహింపఁజాలరు. ఇఁక తానెన్నఁడును బిల్లల నొక దెబ్బయినను వెయ్యని విజయలక్ష్మమ్మ వంటి మాతకుఁదన పిల్లని నితరుల గొట్టుచుండఁగా జూచుట యెంత కష్టముగా నుండునో యట్టి తల్లులకే తప్ప యితరులకుఁ దెలియుట కష్టము. ఆ సమయమునందామెకుఁ బట్టరాని కోపము వచ్చెను. గాని వివేకవతి యగుటచే నాస్వాధ్వి కోపమునంతను దిగమ్రింగి రుక్మిణి, రామునినిఁ దీసుకొని యింటికి వచ్చెను. ఆమె గృహమునకు వచ్చి పిల్లలను బుజ్జగించి సముదాయించెను. గాని యామె తన దుఃఖము నాపుకొన నశక్తురాలు కాదయ్యెను. నోరెఱుఁగని తన పాపని నితరులు నిష్కారణముగా దండించుటకుఁ దమ దారిద్ర దేవతయే కారణముగదా యని తోఁచి యామె కధిక దుఃఖము కలిగెను. ఆమె తన ముద్దుపాపని శరీరము నందలి దద్దులను దడవి చూచి కన్నుల నుండి బాష్పధారలు గార్పఁజొచ్చెను. అప్పుడామెకు సమాధానము చెప్పు వారచటనెవ్వరును లేకయుండిరి. వెంకటరత్నము గారచట నుండినచో నామెకు సమాధానము చెప్పియుందురు. చూడుడు ప్రస్తుతము సహితము నామె దుఃఖము నాయనయే తగ్గించుటకుఁ గారకుఁడయ్యెను. ఆమె భర్త యలకిడిని వినిన వెంటనే తన దుఃఖమునంతను నణచుకొని సంతోషము ముఖమునం దోపఁజేసెను. ఆహా! విజయలక్ష్మి ! నీ సుగుణములిన్నియని వర్ణింప నా తరమా? పనిచేసి యలసి వచ్చిన పతికి నీ దుఃఖము తెలిసినచో విశేషవ్యసనము కలుగునను తలంపు చేతఁగదా నీవు నీ దుఃఖమును మ్రింగి సంతోషమును ముఖమునందుఁ దెచ్చుకొని ముద్దుపాపని నెత్తుకొని భర్తనెదురు కొంటివి ! ఇట్టి సత్ప్రవర్తనమును స్త్రీలందఱు నవలంభించినచో మా దేశమునకెంత మేలు కలుగును. వెంకటరత్నము గృహమునకు వచ్చెనుగాని నిత్యమువలె నేఁడాయాన ముఖము సంతోషముగా లేక మిగులు చిన్నబోయి యుండెను. ఆయన శరీరము నిండను చెమ్మటపట్టి యుండెను నిత్యము నాతఁడు తనకెదురుగా వచ్చిన భార్యను నవ్వుచుఁ బలకరించిగాని, కొమారుని ముద్ది డుకొనిగాని లోపలికిఁ బోవుచుండును. నేఁడా గృహస్థుఁడెదురైన సతిసుతుల సూరకఁ జూచుచు మౌనముగా లోపలికి వచ్చెను. భర్తను గాంచిన వెంటనే విజయలక్ష్మి నేఁడధికముగా పనియుండి నందున నలసెనని తలఁచి యా వేళ నిత్యము కంటెను శ్రమ

విశేషనమైనది గాబోలు, ఏమీ యీ చెమటయని తన పవిట చుఱుఁగుతో నాతని చెమటను దుడిచెను. ఇంతలోఁజంకనున్న పిల్లదానికి నిదుర వచ్చినందున వానింబరుండఁబెట్టి వచ్చి యామె భర్తకు దుస్తులు విడుచుటలోఁ దోడుపడెను. దుస్తులు విడిచి పత్ని చేతికినిచ్చి యాయన మిక్కిలి చింతాక్రాంతుఁడై యచటనున్న పక్కచుట్ట నానుకొని కూర్చుండెను. విజయలక్ష్మియు నా దుస్తులను నియమిత స్థలముల నుంచి వచ్చి పతిచెంతఁ గూర్చుండెను. కొంత సేపటి వఱకు భర్త మాటలాడనందున వింతపడి విజయలక్ష్మి యాయనకుఁ దల నొచ్చుచున్నదని తలఁచి యిదేమి? నేడు మాటలాడరు? తలనొప్పిగా నున్నదా? యని సమీపమున్న కరిగి తలపట్టి చూచెను. తలనొప్పి లేదని వెంకటరత్నమనెను. గానియంతతో నా సాధ్వికి సమాధానము కానందున, తలనొప్పి లేనిచో నేఁడిట్లుదాసీనముగా నుండుటకుఁ గారణమేమి, ఈ ముఖమింత చిన్నబోయి యుండుటకు హేతువేమి యని భర్త నడిగెను. పత్ని నోటి నుండి వచ్చు మాట వినిన తోడనే వెంకట రత్నముగారికి మిగుల విచారము కలిగి, నీకు మన యీ దుస్థితినిఁ దలఁచుకొనిన విచారముగా నుండదా? యని యడిగెను. భర్త వాక్యము చెవినబడిన వెంటనే విజయలక్ష్మికి గడియ క్రిందటి దుఃఖము జ్ఞాపకము వచ్చి విశేష విచారము కలిగి భర్తకునట్టి దుఃఖమే యేదయినంఁగలిగి యుండునను యూహించి తన దుఃఖము నంతను మహా ప్రయత్నమున నాపుకొని, ముఖము నందు సంతోషమంకురింపఁజేసికొని ఇదేకద? ఇంత మాత్రమునకు విచారమేల? నాకిందున గూర్చి విచారమే మాత్రమును లేదు, ఆహా! నీవిట్టిదానవే, కాని మునుపటి మన వైభవమును బ్రస్తుతపు స్థితియుఁ దలఁచుకొనినచో నాకు ఁ జాల విచారముగా నుండును. దివ్యమందిరము నందష్టైశ్వర్యము లనుభవించిన వారికి గుడిసెలో నష్టదరిద్రముల ననుభవింపవలసి వచ్చెనుగదా! నేఁడు లోకులందఱునేక యమూల్యములగు నలంకారముల నొకచోట నుంచి పూజింపుచుండఁగా రత్నాభరణములనేకములు దాల్చిన నీ శరీరమున నొక్క బంగారపు గుండయినను బూజించుటకు లేకుండుట చూచి నీకెంత మాత్రము విచారముగా నుండదా?

విజ – నాకెంత మాత్రమును విచారముగా నుండదు. మనకు సంపద లేదనిగదా మీరు విచారపడుట. సంపన్నులగు కొందఱికిఁగల గర్వమును, విచారశూన్యతయుఁ జూచినపుడెల్ల మన స్థితియే నాకు నుత్తమమైనదిగాఁ గానుపించుచుండును. ఇట్టి స్థితిలో మనకు సత్యమార్గమును విడువక నడుచుచుండుట వలన మనకగు నమితానందము ధనవంతులమైనచోఁ గలుగనేరదు. నేనన్ననో తమ ప్రేమ యొక్కటి కలిగిన నితర సంపదలేమియు నొక లెక్కగాఁ గొనను.

పత్ని పలుకు లాలకించి వేంకటరత్నము యులికిపడెను. ఆయన చిత్తము బెదరినట్లు ముఖచర్య కానుపించెను. సత్యప్రవర్తకుఁడగు నాతని ముఖమునందొక విధమైన భయము కానుపించెను. అప్పుడాతఁడు తీవ్రపడి భార్యకేమి సమాధానము చెప్పవలయునో తోఁచక యుండి తుదకెటులనో ధైర్య మవలంభించి ప్రియే పొడిప్రీతినిఁదీసికొని నీవేమి చేసెదవు? విజయలక్ష్మి కాయన ముఖమునందుఁ గలిగిన ఖేదమేమియుఁ దెలియలేదుగాని పతి మాటవలన నామెకు దుఃఖము మాత్రము కలిగెను. అప్పుడామె మీరిట్టి మాటల వలన నా మనసునకు దుఃఖమే గలుగఁజేయుచున్నారు అనెను.

వేంక – అట్లయిన నేను మాటలాడనులే. నీకు మనపిల్లల దుస్థితిని గూర్చియైనను విచారముగా నుండదా? పరుల పిల్లలీ దీపావళి పండుగకు మంచి దుస్తులను ధరియించుకొని మృష్టాన్నములను దిని సాయంకాల మానందముగా టపాక్కాయలను గాల్చుచుండఁగా వారినిఁజూచి మన బిడ్డలు దీనముఖులై యుండఁగా జూచియైనను నీకు దుఃఖముగా నుండదా?

విజ–ఇందుకు దుఃఖమేమి? నాకెంత మాత్రము విచారములేదు. సరేగాని నేఁడీ లేనిపోని ప్రసంగములు చేసి విచారించుచు లేని దుఃఖము నేల కల్పించుకొన మొదలుపెట్టితిరి. మనపిల్లలేమయిన మననా వస్తువాహనములు తెమ్మని యడిగిరా?

వేంక – ఇందువలననే కద నా దుఃఖము విస్తరిల్లుట. ఈ మాటయని యతఁడొకింత యూరకుండి గద్గద ధ్వనితో నేను నీకొకమాట చెప్పినట్లైన నీవు... ఏమిలేదు, అని యాయన నాలుక గరచుకొని యేదో భయంకరమగు సంగతినిఁజెప్పబోయి శంకించువానివలె ముఖచర్యను జేసెను. విజయలక్ష్మి పాపమాయన చేష్టలనుగని చేష్టలు దక్కియుండెను. కొంతవడికావె తెలివి తెచ్చుకొని మీరు నాకేమి చెప్పవచ్చితిరియని యడిగెను.

వేంకటరత్నము చర్యను స్థిరపఱచుకొని ఏమియులేదు. పోనివ్వు. నీవన్నదే సత్యము. లేనిపోని సంగతులు ముందిడుకొని వ్యసనమేల పడవలెను. అనెను. గాని యీ వాక్యముల

నుచ్చరించునపుడాయన చెప్పఁబోవు నొక గుప్తమైన సంగతిని దాచుచుండినట్లాయన ముఖచర్య వలనఁ దేలియుచుండెను. గాని, కపటమేమియుఁ దెలియని విజయలక్ష్మి కాతని కపటమేమయిఁ దెలియలేదు. ఆమె తన భర్త వాక్యములనే నమ్మెను. ఇంతలో నాయన సరె నాకాకలియైనది. నేఁడు విశేష శ్రమచేయుట వలన విసుకుగా నున్నది. త్వరగా భోజనము చేసి పరుండుదము! భర్త నోటి నుండి యీ వాక్యములు బయలువెడలిన తోడనే విజయలక్ష్మి మడి కట్టుకొని భర్తకు వడ్డించి యాతఁడు తినిన పిమ్మట తాను భోజనము చేసి యింటిపని దీరిన వెనుక పరుండఁబోయెను. అంతకుమునుపే వేంకటరత్నము నిదురుపోవుచుండెను. విజయలక్ష్మియు ప్రొద్దుపోయినందున కుట్టుపనిని చేయుచుంగూరుచుండక తాను పరుండెను.

విజయలక్ష్మి కపటహీనయగుట వలన పక్కకి జేరిన వెంటనే నిదురపట్టెను. గాని విచారగ్రస్థుఁడగు వేంకటరత్నము పైకి నిదురపట్టిన వానివలె నభినయించినను నిజముగానాఁటి రాత్రి యాతనికి నిదురపట్టనే లేదు. నాఁటి సాయంకాలమున వేంకట సెట్టిగారింటఁ జరిగిన సంగతియే రాత్రి యాతనికి సుఖనిద్రకు భంగము కలిగించెను.

నాఁటి సాయంకాలము సెట్టిగారింట లక్ష్మీపూజగుట వలన వేంకటరత్న మచటనే యుండి యందుకు గావలసిన వస్తువులన్నియు జతపర్చుచుండెను. ఇంతలో నచటి పెద్ద గుమాస్తా వేంకటరత్నము నేకాంతముగా నొక చోటికిఁదీసికొనిపోయి రహస్యముగా వేంకటరత్నమూ నీవధిక బుద్ధివంతుఁడవని నేను నిన్ను నాకు సహాయకునిగా గోరెద. నేను నీకుఁ జెప్పు సంగతిని నీవితరులతోఁ జెప్పనని ప్రతిన చేయుము? ఆ ముసలి గుమాస్తా మిక్కిలి మంచివాఁడును. నమ్మఁదగినవాఁడును అని యదివఱకెఱిఁగినవాఁడు గాన, నీవు చెప్పునది యొరుల కెఱిఁగింపనని వేంకటరత్నము నమ్మఁబలికెను. అప్పుడా ముసలి గుమాస్తా వేంకటరత్నమా! నేఁడు లక్ష్మీపూజనమునకై తీసిన యనేకములైన యముల్యాభరణములను జూచితివా? ఇవియొక లెక్కలోనివి కావు. వీనికంటె వెయిరెట్లెక్కువ విలువ గలవి వీరి దుకాణమునందున్నవి. ఇది నీవెఱుఁగనే యెఱుఁగవుగదా? ఈ మాటల ధోరణి యేమియుఁ దెలియక వేంకటరత్నము అవును. నాకుఁ దెలియుననియెను.

పెద్దగుమాస్తా – ఇది తెలిసినటులనే యీ ధనమంతయు నా నమ్మకముననే యున్నదనియును నీకుఁ దెలిసియె యుండును.

వేంకటరత్నము – అవును. సెట్టిగారికి మీయందధికముగా నమ్మకముండినందున వారు తమ పెట్టెల తాళపు చేతులన్నియు మీకే యిచ్చిరి.

పెద్ద గుమాస్తా – ఇట్టి విశ్వాసము నాయందుండుట వలననేకదా నేను తలచిన కార్యము నిర్విఘ్నముగా నెరవేరునని నేను బూనినది.

గుమస్తా మాటలను విని వేంకటరత్నమునకు కొంచెమనుమానము కలిగెను. గాని యాతఁడింకను నేమిచెప్పునో యని తలచి వినుటకు నుండుకుండెను.

పెద్దగుమస్తా – ఇంత సంపత్తిలోనిది మనమొక కొంత తీసికొనిన నదియొక తప్పిదముకాదు. అందువల్ల సెట్టిగారికిని నష్టమురాదు. మనకన్ననో దానివలన మన దరిద్రదేవత తొలఁగిపోవును. ఇంత పెద్ద గుమాస్తాను నాకేబది రూపాయిలు గద జీతము నీకన్ననో పదియే. ఇంత స్వల్పజీతములో మన కుటుంబములను భరించుట మనకు దుస్తరము గదా? ఈ సంగతి వెలికివచ్చునన్న భయము నీకక్కరలేదు. ఆ పూచీ నాది. నేను జెప్పిన యీ సంగతి సంవత్సరాంతము లెక్కలకులోగా కావలెను. సాలాకరింకను రెండే దినములనున్నది. నీవేమనియెదవు? పెద్ద గుమాస్తా యీ మాటలు చెప్పునప్పుడు వేంకటరత్నమునకుఁ గోపము వలనఁ గన్ను లెఱ్ఱనగుచుండెను. అందువలన నాతఁడు మాటల మధ్యనే గుమస్తా నోరుమూయింపవలెనని చూచెను. గాని యాయన తన యధికారియు, వృద్ధుఁడును నగుటవలన కోపమును మ్రింగి యూరకుండెను. ఆ వృద్ధుని మాటలయిన వెంటనే వేంకటరత్నము నిర్మోగమాటముగా అయ్యా! కృష్ణమూర్తిగారూ? మీరు నన్నిట్లు వేళాకోళముల కడిగినఁ జింత లేదు. కాని యిది వాస్తవమేయైనచో తమ నిశ్చయము నాకెంతమాత్రము సమ్మతము కానేరదు. మీకు మాట యిచ్చినందునఁగావలసిన నేనీ సంగతి నితరులకెఱింగింపను, అనెను. ఈ దృఢ వాక్యములను విని కృష్ణమూర్తిగారికిఁ గల యుత్సాహమంతయుఁ దగ్గినటులాతని చర్య వలనఁ దెలియుచుండెను. అయినను ధైర్యము విడువక ముసలి గుమస్తా తియ్యని మాటల వలన వేంకటరత్నమును వశపఱచుకొనఁజూచెను. సెట్టిగారికిఁగల యమిత ధనమును

జూపినను వేంకటరత్నము తన నిశ్చయమును విడువకుండెను. అంత నా గుమాస్తా తన చాతుర్యము వలన వేంకటరత్నముగారి దరిద్రమును నాతనికిఁగానుపించునటుల వర్ణించి యాతని భార్య పిల్లల కందువలనఁ గలుగుచున్న కష్టములను వక్కాణించెను. సదా వాణిజ్యములో మెలఁగి నిపుణుఁడైన వృద్ధుఁడు తన దరిద్రస్థితిని హృదయ ద్రావకముగా నుడువునప్పుడు వేంకటరత్నము కన్నుల నుండి నీరు కారఁజొచ్చెను. ఆ కన్నీటిఁగని గుమాస్తా ఏమి? వేంకటరత్నమా? నేనన్నటులనే నీ కుటుంబస్థితి యున్నదా లేదా?

వేంకటరత్నము - కన్నులు దుడుచుకొనుచు అవును అటులనే యున్నది.

పెద్దగుమాస్తా - అయితే నీ యిష్టము. నేనన్న మాటకు సమ్మతించవు?

వేంకటరత్నము - ఛీ కృష్ణమూర్తిగారూ ! నాతో మీరిఁక మాటలాడకుఁడు. మీ మాటల వలన నా మనసేమయినఁజెడునేమో.

ఆ వృద్ధునకు మనుష్య స్వభావ లక్షణములు చక్కఁగా దెలిసి యుండినందున మనుష్యుల మనసొకసారి యించుక దుర్మార్గము వైపునకుఁ దిరిగినచో మరల సన్మార్గమునకుఁ దిరుగుట దుస్తరము. గాన నీతనికీ సంగతినిఁ గూర్చి కొంత విచారణ చేయుటకు వ్యవస్థ కలిగించినచో మన కార్యము సఫలీకృతమగునని తలఁచి యాతఁడు మంచిది అటులనే కానిమ్ము. నేనిప్పుడు నీతో మాటలాడను. నీవే యీ రాత్రి యంతయు నాలోచించుకొని రేపు ప్రొద్దున నా యింటికి వచ్చి నీ నిశ్చయమును దెలుపుము. ఈ దినములు దీపావళి దినములు. మీ యింట పండుగ కేమియు లేకుండును. గాన నీ నూఱురూపాయిల నోటు నీకిచ్చెదను. వీనిని నక్కఱ లేదనక తీసికొనుము. యని యాతఁడొక నోటును వేంకటరత్నము జేబులో నుంచెను.

దుకాణము నుండి యింటికి వచ్చుత్రోవలో నా గృహస్థుని మనము నందనేక విధముల విచార తరంగములుద్భవింపుచుండెను. వృద్ధుఁడగు నా గుమాస్తా చెప్పిన చొప్పునఁ జేయవలెనన్న నా చేయఁగూడదా? యన్న ప్రశ్న యాతని మనమును తొందరపెట్టసాగెను. అట్లు చేయుట వలనఁ దనవంశము యొక్క కీర్తికి భంగము కలుగునని యా మానవుని యంతరాత్మ తెలుపుచుండెను. ఇంతలోఁ జతురుఁడగు కృష్ణమూర్తి బోధ జ్ఞప్తికి వచ్చి యాతఁడని నటులఁ జేయుటకుఁ బురికొల్పుచుండెను. ఇట్టి స్థితిలో వేంకటరత్నమింటికి వచ్చెను. గాన పై నుదహరించినటుల నాతని స్థితి యుండెను. ఈ సంగతినే భార్యకుఁజెప్పఁబోయి యతఁడు తడబడి చెప్పకుండెనని బుద్ధిమంతులగు చదువరులిది వఱకే గ్రహించి యుండెదరు.

ప్రస్తుతమాయన పరుండి కన్నుల మూసికొని నిదురఁబోయినవాని వలె నభినయించినను నిదురపట్టక వెనుక నుదహరించి నటులాతని మనస్సునం దనేక విధముల యాలోచనలు వచ్చుచుఁబోవుచు నుండెను. గానియేమి చేయుటకును నింకను దృఢనిశ్చయము కానందున నిదురరాకుండెను. తుదకు వేంకటరత్నము భార్యకు నిదురపట్టినదని తెలిసికొని యీ గదిలో నిటునటు తిరుగుచుండెను. ఆ సమయమునం దదాటున నాతనికి గుమాస్తా యిచ్చిన నోటు సంగతి తలఁపునకు రాఁగా వెంటనే దానినిఁ దీసి దీపము వెలుతురున నొక జాము చూచి యాలోచింపుచుండెను. అంత నాతని చిత్తమునందేదో యొక దృఢనిశ్చయమయినటుల ముఖమునం దగుపడెను. వెంటనే యాయన 'అవును ఇటులనే చేయవలెను. కృష్ణమూర్తిగారన్నది మన లాభమునకే కద?' ఇంతలో నాతని దృష్టి నిదురించియున్న భార్య ముఖము వైపునకుఁబాఱును. గాన గడియ క్రింద నా సాధ్వి పలికిన పలుకులాతనికిఁ దలఁపునకు వచ్చిన తోడనే యదివఱకైన నిశ్చయమంతయు మఱచి యీ పురుషుఁడు 'నేనట్టి చెడుకార్యము జేసినచో సద్గుణరాశియగు నీమెకు మొగమెట్లు చూపఁగలను? ఛీ, ఇట్టి కార్యమే చెయ్యను.' వెంటనే యాతని కావె వెనుకముందఱ పరుండి నిదురించుచున్న బిడ్డలగుపడి యదివఱకు వచ్చిన వివేకరమును బాఱఁదోలఁగా నతఁడు, ఈ చిన్నపాపల కష్టములను జూడనోప నిదియునుగాక నేను జేయఁదలఁచిన కార్యమితరులకుఁ దెలియుట సంభవింపదు? అని మరల నాతఁడు నోటును జూచుచుఁ గూర్చుండెను. ఈ సమయమునందే కారణమువలననో విజయలక్ష్మికి మెలకువ వచ్చి లేచినందున నామెనుగని వేంకటరత్నము నిశ్చేష్టితుఁడై గోడకొరిగెను. ఆయన చేతిలో నున్న నోటు క్రిందపడెను.

విజయలక్ష్మి నిదుర నుండి లేచు వఱకామెకీ సంగతులగుపడుట వలన నా సాధ్వి మిగుల నాశ్చర్యమును, విచారమును గలదియై పతిని సమీపించి 'ఇదేమిటి? అర్ధరాత్రి

లేచి నేఁడేమి చేయుచున్నారు, సాయంకాలము నుండి యేమిటో నాకుఁ జెప్పఁగూడదా?' అనునంతలో నామె కచటఁబడి యున్ననోటు కానుపించెను. దానింగనిన వెంటనే యామెహృదయము ఝల్లున రోదన స్వరముతో 'అయ్యో! ఈ నోటెచటిది? దీని నెచట నుండి తాము తెచ్చితిరో నాకుఁ జెప్పగూడదా? నేఁడన్నియు దుశ్శకునములగానే యున్నవి. మీకు నమస్కరించెదను నాకీ సంగతి నించుక వినిపింపుడు'.

వేంకటరత్నము ముదుసలి గుమాస్తా మాటల వలనఁ గొంత తెలివి కలవాఁడయినందున నాతఁడు తన భార్య మనసును ద్రిప్ప యత్నించెనుగాని, యాతని ప్రయత్నము వలన లేశమైనను లాభము కలుగులేదు. మీదుమిక్కిలి యాతని మాటలను వినినప్పటి నుండియు విజయలక్ష్మి మనసున దిగులొందనందున నామె శరీరము వణఁకసాగెను. కోపాతిశయమువలనఁ గన్ను లెఱ్ఱబాఱి వానిలో నుండి జలము రాఁదొడఁగెను. అట్టి కోపావేశమునందును నామె యితఁడు నాపతి యితనిని దండించుట యుక్తముకాదను సంగతి మఱిచినదికాదు. కాని, యిట్టి సమయమున మనముపేక్ష చేసినచో నీతఁడు దుర్నడవడిలోఁ బ్రవేశించి చెడిపోవునుగాన, నట్లుకాకుండఁ జేయుట కర్తవ్యమని తెలిసినది గాన నామె యూరకుండక కొంచెమావేశము తెచ్చుకొని, 'ఈ నోటు తమరు న్యాయముగా సంపాదించి యుండరని నేనిదివఱకే యానుమానపడితిని. మీరిట్లు చేయుటకు హేతువేమి? నేనెన్నఁడైన నగలకనిగాని బట్టలకనిగాని మిమ్ముల నిబ్బంది పెట్టితినా? పిల్లలయిన దబానేదేని తెచ్చుటకై కచ్చ చేసిరా ? అందువలననే మీకీ దుర్బుద్ధి పుట్టెనా? అందువలననే మీకీ బుద్ధి పుట్టి యుండిన నేను మీ పాదాల సాక్షిగాఁ జెప్పెదను. నేనెన్నడిక యడుగను. పిల్లలనేకమయిన నడుగనివ్వను. మాయందను గ్రహించి మీరిట్లు చేయవలదు. ఈ సంగతి యొరులెఱుఁగ జాలరని మీరనెదరు. గాని సర్వ సాక్షియగు పరమేశ్వరుని మోసపుచ్చి మీరీ కార్యము చేయఁగలరా? ఇట్లు చేసిన పిదప మీ మనసైనను బూర్వమువలె స్వస్థముగా నుండునా? కష్టపడి సంపాదించుకొనిన పదిరూపాయిలను సుఖముగాఁ దినినటుల నీ దొంగసొమ్మును దినఁగలమా' దానిని మనము ముట్టినపుడెల్లనిది మీరు విశ్వాస ద్రోహము వలన సంపాదించితిమని మనమనోదేవో మనను దెప్పుచుండదా? ఓ పరమేశ్వరా! తండ్రీ! ఈ కార్యమును మానుపుటకు నేను శక్తురాలనుగాకున్నాను. నాకీ దరిద్రములోఁ గలుగుచున్న పరమానందమిక దొరుకఁజాలదుగదా!' యని యామె దుఃఖము నాపుకొనలేక యేడవసాగెను. దానింగని తెలివి తెచ్చుకొని వేంకటరత్నము దుఃఖింపుచున్న తన సతిని దగ్గఱకుఁ దీసికొని యక్కునఁజేర్చుకొని 'సతీతిలకమా! నీ సద్బోధవలన నా మనమునందలి యజ్ఞానాంధకారము తొలఁగెను. నేనిఁక దుష్కార్య మెన్నటికినిఁజేయను. మనము దరిద్రములో నుండియు సద్గుణముచేత గలుగునానందము ననుభవించెదము. ఆహా! నా కిట్టి సచ్చరితయగు కాంత లభించినందుననేకదా నేనొక గొప్ప పాపము నుండి విడుదలఁగంటిని. మత్ప్రాణసమానమా! నీకు విజయలక్ష్మి యనిన నామమెంతయుఁ దగియున్నది. నీవు నిజముగా నేఁడు విజయము బొందితివి. లోకులందఱు లక్ష్మీపూజ చేయుచుండఁగా నా దగ్గిర పూజించుటకు లక్ష్మిలేదని గడియ క్రింద నేను జింతింపుచుంటిని. నా దగ్గిర నీ రూపముతోఁ బ్రత్యక్ష లక్ష్మియే యుండఁగా నాకా లోహమయలక్ష్మితోఁ బ్రయోజనమేమి? నేఁడు నేనీ లక్ష్మినే పూజించెదను' అని వేంకటరత్న మా స్వర్ణాలంకారహీనయైన సద్గుణాలంకారయగు విజయలక్ష్మినిఁదనయాలింగనము చేతం బూజించెను ఆ సమయమునందు విజయలక్ష్మి కత్యానందము కలిగినందున నామె దేహము తెలియక భర్త భుజము పై నొరిగెను.తాను తన పతిని నిష్కారణముగా తూలనాడితినని యామెకధిక దుఃఖము కలిగెను. కొంతవడి కా సాధ్వీమణి తెలివి తెచ్చుకొని మీరట్లు చెయ్యరుగదా? ఇది నిజమేనా? యని యడిగెను. వేంకటరత్నము వెంటనే నిజముగాఁ జెయ్యనని మరల యామెను కౌగలించుకొని నమ్మఁబలికెను. అప్పుడామె లేఁచి యాతని పాదములను గట్టిగాఁ బట్టుకొనియెను. తన భర్త యేదో యొక గొప్ప సంకటము నుండి విడువఁబడి తనకు లభించినట్లామెకుఁ దోఁచెను. వేంకటరత్నమామెను లేవనెత్తఁగా శుద్ధాంతఃకరణులగు నా దంపతులు మిగతా రాత్రిని సుఖనిద్రలోఁ గడిపిరి.

రెండవ దినము నరక శతుర్దశి యగుటవలన నా కుటుంబీకులు తెల్లవారుజాముననే లేవవలసినవారలైరి. అప్పుడు విజయలక్ష్మి రుక్మిణి చేత భర్తకును గుమారునకును మంగళహారతులిప్పించి మంగళస్నానములు చేయించెను. ఇంతలోఁ దెల్లవారినందున వేంకటరత్నము భార్య ప్రేమతో తనచేత నుంచిన బెల్లపుముక్కను దిని దుస్తులను ధరించుకొని మొదట కృష్ణమూర్తిగారింటి కరిగెను. అచటికిఁబోయిన వెంటనే వేంకటరత్నము నోటు నాతని ముందరవేసి మీయాలోచనకు నేను సమ్మతింపను దయచేయుఁడని తన పనికిఁబోవుచుండెను.

# ఇష్...మాట్లాడకు !

- నూనెల శ్రీనివాస రావు
9492970231



ఏమౌతుంది ?
ఏమౌతుందో తెలియదు
ఏవో భావోద్వేగాల మంటలు
దేశం అట్టుడికిపోతోంది
స్వేచ్ఛా స్వరం విస్తుబోతోంది -

ఎవడో అరిచాడు
అసలు భావోద్వేగాలంటె ?
సమాధానం చెప్పాలనుకున్న
ఉత్సాహవంతుడెవడో లేచాడు
అంతలోనే వాడి ముందర
దేశద్రోహం బోర్డు వేలాడింది
వాడు కూలబడ్డాడు
మీసం మెలేసింది అరాచకత్వం
కుబుసం విడిచింది రాజకీయం -

ఇప్పుడంతా స్పష్టం
తెరలోపల రహస్యం
తెరబయట రహస్యం
నడుమ ప్రజాస్వామ్యం
రేపటి భారతానికి చీకటికోణం -

ఐనా మూర్ఖత్వమా
నీకు తెలియదు ?
ఘనీభవించే భావోద్వేగాలల్లోంచే
వెలుగురేఖలు పొడుచుకొస్తాయని
అవే.. అవే..
రేపటి భారతాన్ని
తిరిగి వెలిగిస్తాయని !

ఇష్.........
మాట్లాడకు
ఇక మాట్లాడేది మేమే
ప్రశ్నగా..
పిడికిలిగా ...! ♦

---

గాని కృష్ణమూర్తి యాతనినిఁ బోవనియ్యక కూర్చుండఁబెట్టి నేను లోపలి నుండి వచ్చువఱకిచటనే యుండుమని చెప్పియతఁడు లోపలికిఁబోయెను. ఆయన యట్లు చేయుటకు హేతువేమో తెలియక వేంకటరత్నము విచారించుచుండెను. ఇదియునుగాక తొలిదినము వేంకటరత్న మిందులోఁ బ్రవేశించనని చెప్పునప్పటివలె కృష్ణమూర్తి నిరుత్సాహుఁడుగాక ప్రస్తుతమధిక హర్షమును బొందినటులఁ గానుపించెను. దీనినన్నటినిఁగూర్చి విచారింపుచు వేంకటరత్న మా గుమాస్తా రాఁకకెదురు చూచుచుండు నంతలోఁ దన యజమానుఁడగు వేంకటసెట్టియుఁ కృష్ణమూర్తియుఁ దన దగ్గిరకు వచ్చుచున్నటులాతనికిఁ గనుపించెను. వెంటనే యజమానునకు నెదురుపోవుట కాతఁడు లేవంగా నింతలో సెట్టిగారే యాయనను సమీపించి వేంకట రత్నమాఁ శాబాసని వీపుతట్టెను. అందుపై సెట్టి వేంకటరత్నమును గని నీవు మిక్కిలి తెలివి కలవాఁడవు. పాటుపడు స్వభావము గలవాఁడవని తెలిసికొని యట్లే నీవు సత్యప్రవర్తకుఁడవవో కావో పరీక్షింపనెంచి నేనీ కృష్ణమూర్తిగారికిఁజెప్పి యిటులఁజేయించితిని. నీవు నా కఠినపరీక్షలో నుండియు దుర్ఘటమగు దరిద్రము నుండియుఁ దేరితివి. నిన్ననీ మనసొకింత మెత్తవయినటులఁగానుపించెను. గాని యది నీ దోషము కాదు. నీ దరిద్రదేవత దోషమేయగును. చెడుకార్యమెన్నఁడును జేయనివానికంటెను జెడు కార్యము వైపుల కొకింత మనసు తరిగి వివేకియైనవాఁడే యుత్తముఁడు. మొదటివానిచేత తప్పిదము జరుగును. గాని రెండవవానిచేత బొత్తిగా తప్పిద మగుటయే సంభవింపదు. నిన్న నీకిచ్చిన నూఱురూపాయిలును నీవే. వానిని నీవు నీ యుదాత్త గుణముల వలనఁ బడిసితివి. రెండవది నిన్ను నేఁటి నుండియు నిరువది రూపాయల వేతనమునిచ్చి కృష్ణమూర్తిగారికి సహాయునిగా నుంచెదను. ఇది యంతయు విని వేంకటరత్న మూరకుండఁజాలఁడయ్యెను. ఆయనకుఁ దన స్తుతి వినుటకు నిష్టము లేక తొలిరాత్రి జరిగిన దంతయు నచట సవిస్తరముగా వినిపించెను. దానిని విని వేంకటసెట్టి పరమానంద భరితుఁడయ్యెను. ఆయన వెంటనే తన భార్యకుఁజెప్పి విజయలక్ష్మినిఁబిలిపించి అమ్మా! నీవు నిజముగా విజయలక్ష్మివే. ఇట్టి నీవు నా ధర్మకన్యకవని మన్నించెను.

నాఁటి నుండి నిజముగా వేంకటసెట్టి విజయలక్ష్మిని స్వకన్యకగా భావింపుచుండెను. వేంకటరత్న మామె నొక దేవతనుగా నెంచి ప్రేమించుచుండెను. ఆ దంపతులట్లు తమ ధైర్యము చేత వడసిన సంపద నధికానందముగా ననుభవింపుచున్నవారు. ♦

# చావు పాదు




వెన్నెల ఆకాశ నక్షత్రాల మిణుగురు నాట్యాలు...
రంగురంగుల సీతాకోకల బాసలూ... సెలయేటి గాలుల
పాటలూ....
గులాబీ మొగ్గల పరిమళాలూ... పక్షుల కేరింతలూ...
చిరుజల్లుల ఉత్సాహాలు...
ఇంద్ర ధనుస్సుల ఆనందోత్సాహాలు...
ఏమైపోయాయి? ఎటెళ్లి పోయాయి?
కలలు కాలుతున్న స్మశానం వాసన..!?

కార్పొరేట్ వెన్నెల వల
బాల్యం మెడకో ఉరితాడై బిగుసుకుంటున్నది...
వెలుగు దివ్వెలు చీకటి దిబ్బలై మిగులుతున్నవి
పూలు నేలరాలినంత సహజంగా
పిల్లల బతుకులు నేలరాలడం సహజాతి
సహజమైపోయింది...
ఏదీ ప్రశ్న కావడం లేదు
సమాధానాలసలే దొరకడం లేదు
శిక్షలు దోషులకు కాక
పసి మనసులకు అమలవుతున్నవి
బడిగంట మరణమృదంగమై మోగుతున్నది.!

మార్కులు... ర్యాంకులు...
గొప్ప జీతాలు.. గొప్ప గొప్ప హోదాల ముందు
జీవితమేమంత విలువైనది కాదని రూఢీ అవుతున్నది
కార్పొరేట్ రాజ్యం
కలల బాల్యాన్ని బలికోరుతున్నది
చావునొక విలువగా నిర్ణయిస్తున్నది
మరణమొక ప్రేమ లేఖై పోతున్నది

తల్లిదండ్రులారా...
మీ పిల్లలకు గొప్ప చదువులను
ఇవ్వకపోయినా పర్వాలేదు
కార్పొరేట్ పాడెను మాత్రం
భవితకు బహుమానంగా ఇవ్వకండి...
అయ్యలారా..! అమ్మలారా.!
మీ కలలకు వారి చావులు పరిష్కారమవడమేమిటీ?
చదువొక మాఫియా అయిపోయాక
రాజ్యం బాల్యానికి ఒక డెత్‌సెల్‌ను నిర్మిస్తున్నది
ఉద్యోగస్తులారా..!

మీ పిల్లల బతుకులు హాస్టల్లో
అనాధ బతుకులై పోతున్నవి
చదువు అత్యంత ఖరీదైన చోట
చావు కారుచౌకై పోతున్నది
చదువంటే వేటై పోతున్నది
ఆత్మహత్యల తోటై పోతున్నది
పోటీ... ఒత్తిడి... వేగం... మోహం..
అంతా కార్పొరేట్ వ్యవహారమే...
కార్పొరేట్ వ్యామోహమే...
ఎటు నుంచి ఎటు చూసినా...
అ వ్యవస్థను ఆత్మహత్యల రుతువేదో పట్టిపీడిస్తున్నది
"నారాయణా.! నారాయణా.!"
చావు ఒక "చైతన్య"మై విజృంభిస్తున్నది...

రాజ్యమా..!
ప్రతి గడప ముందూ
ఒకానొక కార్పొరేట్ హత్యగా
నిలబడి వున్నందుకు జోహార్లు..!
తలిదండ్రులారా..! వేకువ సూరీళ్లైన విద్యార్థులారా..!
ప్రజలారా..!
ఒక్కో కాసా పేనుకుంటూ...
రాజ్యం మెడన ఉరితాడేద్దాం వస్తారా?
మన కలలను ఛిద్రం చేసున్న
బతుకును ప్రశ్నార్థకం చేస్తున్న
చావు పాదైన కార్పొరేట్ వెన్నెలకు
చావు పాతరేద్దాం వస్తారా?

- శిఖా - ఆకాష్
7095874172

# తెలుగు వెలుగులు ⌘చరిత్ర అడుగులు




- తెలకపల్లి రవి

***'సోర్సెస్ ఆఫ్ హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ తెలుగు స్పీకింగ్ పీపుల్, బిసి 5000- ఎడి 2016' (తెలుగు భాషా ప్రజల చరిత్ర, సంస్కృతి ఆకరాలు) అనే ఈ పుస్తకం ఒక దారి దీపం లాంటిది. ఇందులోని 16 అధ్యాయాలు ఒక్కో యుగం లేదా రంగం పరిణామాన్ని పట్టుకునే పద్ధతులేంటో, పుస్తకాలు పత్రాలు శాసనాలు ఏవేవివున్నాయో సూటిగా సుసంపన్నంగా వివరిస్తాయి. చరిత్ర దశలతోపాటు కళా సాహిత్యాలు, జానపద కళలు, నిర్మాణ కౌశలం వంటివి విడివిడిగా రాయడం సముచితంగా వుంది.***

పట్టువట్టరాదు పట్టి విడవరాదు పట్టెనేని బిగియపట్టవలయు అన్నాడు వేమన్న అచ్చ తెలుగులో. అంతకు ముందే భర్తృహరి ఆరంభించరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై.. అంటూ రాశాడు. ఏ పనైనా మొదలెట్టాక మధ్యలో ఆపేయడం ధీర లక్షణం కాదు. ఈ సూక్తినీ స్ఫూర్తినీ మనసారా నమ్మిన ఆంధ్ర ప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్ (ఇప్పటికీ ఒకటిగానే కొనసాగుతున్నది) నిష్ణాతులు పెద్దలు ఆచార్య వకుళాభరణం రామకృష్ణ సారథ్యంలో- ఏడువేల ఏళ్ల తెలుగు భాషా ప్రజల సమగ్ర చరిత్ర – క్రీపూ.5000 నుంచి క్రీశ 1990ల వరకూ- వెలువరించేందుకు గత ఇరవయ్యేళ్లుగా నిర్విరామంగా కృషి చేస్తూనే వచ్చారు. ఆంధ్ర ప్రదేశ్ రెండుగా విడిపోయినా చరిత్ర కారులూ ఇతర నిపుణులూ అనుకున్న ప్రకారమే ఒక్కతాటిపై నిలబడి సంకల్పం పూర్తి చేశారు. 2016లో ఎనిమిదవ సంపుటం వెలువడటంతో ఆ ఘట్టం ముగిసింది. అయితే ఈ సంపుటాలలోని చరిత్ర రచనకు ఆకరాలుగా నిలిచిన పుస్తకాలు పత్రాలు ఆధారాలు కూడా అందజేస్తే తెలుగు జాతికి మహోపకారం జరుగుతుందని జిజ్ఞాసులే గాక పరిశోధకులూ అభ్యర్థించారు. అప్పటికే ఈ ప్రణాళిక అమలులో అలసి సొలసి వున్న ఆచార్య రామకృష్ణ తన జీవితంలోనూ చరిత్ర రచనలోనూ సహధర్మచారిణి లలితగారిని కోల్పోయిన స్థితి. అయినా అంతటి బాధను దిగమింగి ఆచార్యులుగా అనుసంధానకుడుగా తన కర్తవ్యం నిర్వహించారు. వేల ఏళ్ల తెలుగు చరిత్ర ఆధారాల గురించిన నికరమైన నిగ్గుతేలిన ఆధారాల జాబితాలతో వివరాలతో వేయి పుటల మరో పెన్నిధికి సంపాదకత్వం వహించారు. ఇంత విస్తృత స్థాయిలో ఇలాటి పుస్తక రూపకల్పన ప్రచురణ దేశంలోనే ఇదే ప్రథమం కావడం తెలుగు వారికి గర్వకారణం. 200 మందికి పైగా చరిత్ర కారులు నిపుణులు కలసికట్టుగా పనిచేసి తీసుకొచ్చిన ఈ బృహత్ సంపుటం చరిత్ర కాంగ్రెస్ ఇరవయ్యేళ్ల కృషికి పతాక సన్నివేశం. భావి పరిశోధకులకూ పండితులూ పరితలకు చరిత్ర విజ్ఞాన సులభ సందర్శిని.

నిన్నటి ఆ చరిత్రలేనిదే నేడూ లేదు. రేపూ సరిగ్గా వుండదు. గత చరిత్ర మరిస్తే భవిష్యత్తు వుండదని అందుకే హెచ్చరిస్తుంటారు. అయితే చరిత్ర రచన వీక్షణ ఎప్పుడూ

కత్తిమీద సామే. తెలుగు రాష్ట్ర విభజనకు ముందూ వెనక జరిగిన వాదోపవాదాలు, పద్మావతి చిత్రంపై పగలూ పంతాలూ ఇంకా కళ్ల ముందు చూస్తున్న అనేక వాద ప్రతివాదాలు చూస్తే చరిత్ర రచన ఎంత కష్టమో తెలుస్తుంది. అందుకే ఏ దేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం అని ఈసడించిన మహాకవి ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసమూహములు అంటూ రుద్రమాంబ భద్రకాళి రోజనోజ్వజల రోజులేవీ? అని ప్రశ్నించారు. చారిత్రిక విభాత సంధ్యల మానవ కథ వికాసమెట్టిదని అడిగారు. ఇందుకు సమాధానం ఒక్క ముక్కలోనో ఒక్క బుక్కులోనో చెప్పడం కుదిరేపని కాదు గనకే ఇన్ని సంపుటాలు అవసరమైనాయి. పరస్పర సంబంధం చూపిస్తూ ప్రామాణిక సమాచారంతో కాల క్రమాణికను పాటిస్తూ ఏకసూత్ర కథనం తయారు కావాలి. పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర ఎలా పుట్టిందో చెప్పగలగాలి. అ రాజకీయార్థిక విషయాలే గాక సామాజిక సాహిత్య కళాంశాల పరిణామం పట్టిచూపాలి. చాలా విషయాలకు సరైన సంతృప్తికరమైన సమాధానాలు అందించే ఆధారాలుండవు. మరికొన్ని సందర్భాల్లో అపారమైన సమాచార వనరులుంటాయి గాని వాటిలోని సమాచారం మధ్య పొంతన కూడా వుండదు.

ఉదాహరణకు రాతియుగం గురించి స్వల్పంగా ఆధారాలుంటే రాయలవారి యుగంలో మహాకవుల రచనలతో సహా అధికారిక పత్రాలూ వున్నాయి. కాని వాటిలోని సమాచారం సమన్వయం చేయడం కష్టంతో కూడుకున్న పని. విజయనగర స్థాపన ఏ పరిస్థితిలో జరిగింది, దాన్ని స్థాపించిన హరిహర బుక్కరాయలు ఎవరి ఆస్థానం నుంచి వచ్చారు? .కొన్ని ఆధారాలు వారు కాకతీయుల దగ్గర వుండేవారంటే మరికొన్ని ఆకరాలు వారి మూలాలు హొయసల రాజ్యంలో చూపిస్తాయి. కర్నూలు జిల్లాలోని వెలుగోటి ప్రభువులు తెలంగాణలోని రాచకొండ దేవర కొండల్లో కాకతీయుల సామంతులుగా వుండి వారి పతనానంతరం స్వతంత్రం ప్రకటించుకున్నారు. కొద్ది కాలంలోనే మొదటి బహుమనీలకు తర్వాత విజయనగర రాజులకూ లోబడిపోయారు. పానగల్ యుద్ధంలో వారు విజయనగర రాజులను బలపర్చడంతో బహుమనీలు క్రమంగా దెబ్బతీశాక వెలుగోడుకు చేరుకున్నారు. ఇదంతా అనేక ముందు వెనకల పరిణామ క్రమం. ఆ రాణి ప్రేమపురాణం ఈ ముట్టడికైన ఖర్చులూ మతలబులూ కైఫీయతులూ ఇదే చరిత్ర సారం కారాదు గనక సామాజిక చరిత్ర కూడా రూపొందిస్తుండాలి. శాసనాలూ అప్పటి పరికరాల అవశేషాలు, చిత్రాలు శిల్పాలూ, కళా సాహిత్యాలూ జానపదాలు ఇంకా మిగిలివున్న గిరిజన తెగల ఆచారాలు, ఒక దశ తర్వాత నాణేలు అధికార పత్రాలు, విదేశీ పర్యాటకుల కథనాలు, ఇలాటివన్నీ కలిపి విమర్శనాత్మకంగా బేరీజు వేసి చూడాలి. ఏ ఒక్క నిష్ణాతుడూ అన్ని సమస్యలు అర్థం చేసుకోవడం సాధ్యం కాదనే దృష్టితోనే సంపాదకులు అనేక రకాల బాధ్యతల నిర్వహణ కోసం చరిత్ర బోధకులతో పాటు వివిధ రంగాల నిపుణులను కూడా కలుపుకుని పనిచేశారు. అందుకే ఈ చరిత్ర ప్రణాళిక గతంలో తెలుగులో గాని మరే చోట గాని జరగనంత విస్తృతంగా విభిన్నంగా నడిచింది. ఆంధ్ర ప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్ తలపెట్టిన ఈ పథకానికి భారత చరిత్ర పరిశోధనా మండలి(ఐసిహెచ్ఆర్), తెలుగు విశ్వ విద్యాలయం సహకారం లభించింది. కొంతకాలం స్వంతంగానూ తర్వాత ప్రముఖ ప్రచురణ సంస్థలతో కలసి సంపుటాలను వెలువరించారు. ఇందులో పెద్దపాత్ర పోషించిన ఎమెస్కో సంస్థ ఇప్పుడు ఈ ఆకరాల కూర్పునూ ప్రచురించి అభినందన పాత్రమైంది.

సోర్సెస్ ఆఫ్ హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ తెలుగు స్పీకింగ్ పీపుల్, బిసి5000- ఎడి2016 (తెలుగు భాషా ప్రజల చరిత్ర సంస్కృతి ఆకరాలు) అనే ఈ పుస్తకం ఒక దారిదీపం లాటిది. ఇందులోని 16 అధ్యాయాలు ఒకో యుగం లేదా రంగం పరిణామాన్ని పట్టుకునే పద్ధతులేమిటో పుస్తకాలు పత్రాలు శాసనాలు ఏవేవి వున్నాయో సూటిగా సుసంపన్నంగా వివరిస్తాయి. చరిత్ర దశలతోపాటు కళా సాహిత్యాలు జానపద కళలు, నిర్మాణ కౌశలం వంటివి విడివిడిగా రాయడం సముచితంగా వుంది. రాసిన వారందరి పేర్లు ఏకరువు పెట్టనవసరం లేదు గాని అందరూ ఆరితేరిన వారే. ఆధారాలు ఇవ్వడమే గాక వాటిని ఎలా అర్థం చేసుకోవాలో కూడా వివరణ లభిస్తుంది. అలా అని ప్రతిదానికి పాదపీఠికలిచ్చి గజిబిజి చేయకుండా వివరణ, వివరాలు విడివిడిగా చూస్తాం. ఒకో అధ్యాయానికి చివర ఒకో పేజీకి 15 నుంచి 20 వరకూ వుండే సూచికలో వందల గ్రంథాలు పరిశోధనపత్రాలు శాసనాలు, శిల్ప చిత్ర సంకేతాలు తెలుసుకుంటాం.

ఈ సమయంలో గుర్తు చేసుకోవలసిన మహోన్నత

దాదాపు వెయ్యి పుటలున్న ఈ పుస్తకం ఎడిటర్ వకుళాభరణం రామకృష్ణ. కె.ఎస్. కామేశ్వరరావు వర్కింగ్ ఎడిటర్. ఎ ఆర్ రామచంద్రారెడ్డి కో ఆర్డినేటింగ్ ఎగ్జిక్యూటివ్ ఎడిటర్. జి.వెంకట్రామయ్య అకడమిక్ కో ఆర్డినేటర్ కాగా లక్ష్మీనారాయణ కడేకర్ అకడమిక్ అడ్వయిజర్గా బాధ్యతలు నిర్వహించారు. ఇందులోని మొత్తం 13 అధ్యాయాలు వాటి రచయితల వివరాలు:

1. చరిత్ర పూర్వదశ క్రీపూ 5000-500
   - ఎన్ చంద్రమౌళి
2. తొలి చరిత్ర క్రీపూ 500-624
   - సి.సోమసుందర రావు, డి.భాస్కర మూర్తి
3. తొలి మధ్య యుగాల చరిత్ర క్రీ.శ.624-1324
   - కొల్లూరు సత్యనారాయణ
4. ముసునూరు నాయకులు 1325-1448
   - ఎన్.ఎస్.రామచంద్రమూర్తి
5. రెడ్డిరాజులు 1325-1448
   - ఎన్.ఎస్.రామచంద్రమూర్తి
6. విజయనగర చరిత్ర 1336-1660
   - సి.సోమసుందర రావు, కె.ఎస్. కామేశ్వరరావు, డి.కిరణ్క్రాంత్ చౌదరి, ఎం.రాధికా మాధురి
7. దక్కన్ సుల్తానులు బహుమనుల చరిత్ర 1347-1538
   - అబ్దుల్ మజీద్
8. దక్కన్ సుల్తానులు కుతుబ్ షాహిల చరిత్ర 1510-1687
   - సల్మా అహ్మద్ ఫరూఖి
9. తొలి మధ్య యుగాల ఆంధ్ర 1660-1857
   - ఎ. ఆర్ రామచంద్రారెడ్డి
10. అసఫ్జాహిల చరిత్ర 1724-1956
   - ఎ.సుభాష్
11. ఆధునిక ఆంధ్ర హైదరాబాద్ రాష్ట్రాలు 1858-1956
   ఎ. కోస్తా ఆంధ్ర, రాయలసీమ- బి.కేశవనారాయణ
   బి. హైదరాబాద్ రాష్ట్రం(తెలంగాణ) వి.రామకృష్ణారెడ్డి
12. సమకాలీన ఆంధ్రప్రదేశ్ 1956-2000
   - వి.రామకృష్ణారెడ్డి
13. సాహిత్య వనరులు - వకుళాభరణం రామకృష్ణ
14. కళలు నిర్మాణ శిల్పం
   - డి.కిరణ్క్రాంత్చౌదరి, ఎన్.ఎస్.రామచంద్రమూర్తి
15. లలితకళలు- కళలు నాటకరంగం సంగీతం నృత్యం
   - మొదలి నాగభూషణ శర్మ

చరిత్ర కారులు ఎందరో. చరిత్ర పూర్వపు దశ అయిన క్రీపూ 5000- కాలంపై వెలుగు ప్రసరించి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ను భారత దేశపు చరిత్రపూర్వ రాజధాని అని వర్ణించిన హెచ్.డి సంకాలియా ఈ జాబితాలో ప్రథములుగా వుంటారు. నిత్య స్మరణీయులుగా వెలుగొందుతున్న చిలకూరి నారాయణ రావు, చిలుకూరివీరభద్రరావు, కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరి వెంకట రమణయ్య, సురవరం ప్రతాపరెడ్డి వంటివారి అడుగుజాడల్లో ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్ కృషి కొనసాగిస్తున్నదంటూ ప్రవర చెప్పుకుని ప్రారంభించారందుకే. ఆ ధీటైన వారసత్వంతో సాధక బాధకాలు కష్టాలు కడగండ్లు ఖాతరుచేయకుండా పదండి ముందుకు అంటూ నడిపించిన వకుళాభరణం, ఆయనతో అడుగులు వేసిన అధ్యయన తత్పరులూ, అండనిచ్చిన విజ్ఞానాభిలాషులూ చరిత్ర విద్యార్థులూ ప్రశంసా పాత్రులవుతున్నారు. తెలుగు రాష్ట్రాలు బహువచనమైనా తెలుగు భాషా ప్రజల చరిత్ర కలివిడిగానే వుంటుంది. దాని సారాంశాన్ని సందేశాన్ని తెలుసుకోవడం ఉభయ రాష్ట్రాలకూ ఉపయుక్తమే గాక ఉత్తేజకారణమూ అవుతుంది. ♦

# ఐదు దశాబ్దాల నా కవితా యాత్ర



- నిఖిలేశ్వర్
9177881201

గత ఐదు దశాబ్దాలుగా కొనసాగుతున్న ఎన్నోదశలు, మరెన్నో మజిలీలు.

కాలంతోపాటు జీవిస్తూ, అయితే కాలాన్ని అధిగమించే ప్రయత్నంలో నా కవిత్వ అన్వేషణంతా!

నాతో -నా బాహ్యప్రపంచంతో కొనసాగిన నిరంతర - సంబాషణగా, నా కవితాభివ్యక్తి నన్ను సంజీవంగా నిలిపింది.

హైస్కూలు స్థాయిలో వుండగానే ఎంకిపాటలు పాడుకుంటూ, కరుణశ్రీ పద్యాలకు మురిసిపోతూ, క్రమంగా హిందీ ఉర్దూ కవులను చదువుతూ శ్రీశ్రీ దగ్గరికి చేరేసరికి కొంతకాలం గడిచింది. భావకవిత్వం - భక్తిసాహిత్యం ఊపుల పద్యాలు పాటలు రాయడం ప్రారంభించాను.

ఆర్యసమాజ్ ప్రభావంతో నాలుగు వేదాల పరిచయం. కొన్ని శ్లోకాలను చదివి, హిందీ ద్వారా అర్థం చేసుకుని, నా మిడిమిడి జ్ఞానంతో ఆ రోజుల్లోనే వాటిని తెలుగులో వ్యాఖ్యానించాను. సికింద్రాబాద్‌లోని ఆర్యసమాజ్ నిర్వహించిన ఒక చిన్న మాసత్రికలో వాటిని ప్రచురించారు.

కె. యాదవరెడ్డిగా 1956 లోనే గోలకోండ పత్రిక లో నా తొలిరచన అచ్చుకాగా, ఆ తర్వాత అనువాదాలతో స్వీయరచనలతో 1960 నుండి 1965 దాకా ప్రారంభదశలో ప్రేమకవిత్వం, వచనకవితల్లో అనాటి అనుభవాల సామాజిక సమస్యల అభివ్యక్తి. ఆ తర్వాత నిఖిలేశ్వర్‌గా దిగంబరకవులం మూడు సంపుటాలతో 1965 నుంచి 1970 దాకా. దిగంబర కవిత నా సాహిత్య జీవితానికొక కీలకమైన మలుపు.

1969-70 మొదలు విప్లవకవితోద్యమంలో భాగస్వామిగా, విప్లవస్ఫూర్తితో ప్రజా ఉద్యమాల స్పందనగా కవిత్వం రచిస్తున్న కాలం. ముఖ్యంగా విప్లవ రచయితల సంఘం (విరసం) క్రియాశీలక సాహిత్య- రాజకీమ ఆటుపోటుల మధ్య, 1972 నుంచి 1984 నడుమ విడిగా నా కవితా సంపుటి వెలుపడలేదు. 1980 తర్వాత రెండు సంవత్సరాల పాటు "ప్రజాసాహితి" మాసపత్రిక సంపాదక బాధ్యతలు..!

దిగంబర కవితాప్రస్థానంలో ఆనాటి మూడుసంపుటాల "ముందుమాటలు" మేము ఏమిటో మా సామాజిక రాజకీయ చింతన ఏమిటో స్పష్టం చేశాయి. వ్యక్తిగతంగా దిగంబర కవిత తర్వాతిదశలో 1972 లో వెలువడిన నా మొదటి కవితాసంపుటి మండుతున్న తరం. ఈ సంపుటికి రాసిన

నా ముందుమాటలోని కొంతభాగం...

'స్వీయ మానక ధోరణిని దాటి సామాజిక సమిష్ఠి తత్వంతో సాగిపోతున్న నేను, నా కవిత్వం ఎందుకు అనే ప్రశ్న వేసుకొని మీ ముందు నిలుచున్నాను.

జాతీయ అంతర్జాతీయ వ్యక్తిగత మార్పులకు ఈ కవితలు ధ్వనులు. రాబోయే మహత్తరమైన శ్రామిక విప్లవాల కోసం నిస్వార్థంగా ప్రాణాలు అర్పించి చిరస్థాయిగా జనం గుండెల్లో నిలిచిపోయిన త్యాగధనులు ప్రేరణ ఈ కవితకు ఊపిరి. అజ్ఞాతంగా అసువులు అర్పించిన విప్లవవీరుల అనామక చిరునామాలకు ఇది అంకితం.

ముఖ్యంగా "మండుతున్న తరం" అనే కవిత గురించి ఒక స్పష్టీకరణ అవసరం. ప్రత్యేక తెలంగాణా ఉద్యమం (1969) చెలరేగి స్వార్థపర ముఠానాయకుల నాయకత్వంలో దారితప్పి ఈనాటి తరంలో ఒక భాగాన్ని నిష్ప్రయోజమైన ఆశయంకోసం బలిచేసింది. అనాటి ఆ ఉద్యమ తీవ్రత నాకు మిట్టమధ్నాహ్నం మండిపోతున్న తరంగా దారి తప్పి సంకుచితమైనా ప్రాతీయ పరిధిలో కొట్టుకుంటున్నట్టు భావించాను..

ఆ పరిణామం ముఠానాయకుల జేబులు నింపి గద్దెలను ఎక్కిస్తున్నదని అంచనా వేసుకున్నాను. ఇదంతా తాత్కాలికమైనదే. శాశ్వత పోరాటాలే అన్నింటికి సమాధానమని గాఢంగా నమ్ముతూ వచ్చాను. సమూలమైన మార్పుకోసం ఎన్నితరాల మండినా రేపటి తరతరాల ఉజ్వల భవిష్యత్తుకోసం మాత్రమేననే ప్రగాఢ విశ్వాసం ఈ కవిత్వాన్ని వ్రాయించింది.

వచన కవితోద్యమం నుంచి దిగంబర కవులదాకా ఎంతో జీవితానుభవం కుదిరింది. దిగంబర కవితోద్యమం నా ఇతర ఐదుగురు మిత్రుల సహచర్యంలో ఎంతో అవగాహనను పెంచింది. ఈ దేశం శ్రామిక జనం మధ్య ఎన్నో గుణపాఠాలు నేర్చుకున్నాను సమాజంలోంచి ప్రతిధ్వనించి తిరిగి సమాజంలోకి వెళ్లడానికి ఆ అవగాహన దోహదపడింది. శాస్త్రీయమైన మార్క్సిస్టు అవగాహన దిక్కును చూపింది. అనాడు మండిన నక్సల్బరీ - శ్రీకాకుళాలు ఒక ఊపునిచ్చి ముందుకు తోశాయి.'

పన్నెండేళ్ల తర్వాత - 'ఈనాటికి (1984)"సంపుటి లోని ముందుమాటలో కొంతభాగం-

ఆనాడు 1972 సెప్టెంబర్‌లో "మండుతున్నతరం" కవితా సంపుటితో మీ ముందుకువచ్చి 'ఈ కవిత్వం ఎందుకు?" అని ప్రశ్నించుకున్నాను. అంతకుముందు వచన కవిత, దిగంబర కవితోద్యమం ఆ తర్వాత విప్లవ కవిత ప్రజాసాహిత్యోద్యమం ఆ ప్రశ్నకు సమాధానాలు.

తరచుగా వివిధ పత్రికల్లో నా కవితలు వెలువడినా పుస్తకరూపంలో ఇలా రావడం పన్నెండేళ్ల తర్వాతనే. 1979-82 మధ్య రాసిన కవితలన్ని ఇందులో పున్నాయి.

"వోట్ల విత్తనాలు చల్లిన మహజనులారా !" కవితను 1980 చివరనే రాసినా. ఇప్పుడీ రాబోయే మధ్యంతర ఎన్నికలకే కాకుండా ఈ దేశంలో డబ్బు కుల రాజకీయాల పెత్తనం కింద ఈ పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం కొనసాగేంతకాలం ఇది వర్తిస్తుంది. అందువల్లే ఆ కవిత చివర రచనా కాలాన్ని తొలగించాను. ఇక "ఈనాటికీ" చివరికవిత ఇందులో ... నడుమ చోటు చేసుకున్న మిగతా 54 కవితలకు ఒక్కొక్క దానికి చరిత్ర- అంతరార్థం వుంది.

నా వ్యక్తి గత అనుభవం - అనుభూతి - ఆలోచనతో సమిష్టిలోకి - లోకానుభూతిలోకి మమేకం చేసుకొన్న ప్రయత్న ఫలితాలే ఈ కవితలన్నీ... కదిలించి, ప్రతిస్పందింపచేసి , అంతరార్థాన్ని పట్టి ఇచ్చేది మంచి కవిత్వం .

కొత్త నుడికారాన్ని, పదసమన్వయాన్ని శిల్పాన్ని వెలికితెచ్చి శాస్త్రీయ అవగాహనతో నిత్యనూతనంగా నిలిచేది ఆధునిక కవిత్వం.

ప్రజాపోరాటాలలో పెనవేసుకుని. వర్గచైతన్యాన్ని పెంచి శ్రామిక విముక్తి విప్లవాలతో నడిచేది విప్లవకవిత- అదే ప్రజాకవిత.

అనాదినుంచి శ్రమ జీవుల జీవన సంగీతమే జనంపాట. ఆ పాట పల్లెపదమైనా, జానపద గీతమైనా ఈనాటి జనం పాటలను విప్లవగీతమైనా అంతస్సూత్రంగా జీవనయథార్థం, గుండెలను కదిపే కవిత్వం - సంగీతం మేళవించున్నప్పుడే మిగులుతున్నాయి. పాటలవుతున్నాయి. పాటశిల్పం, భిన్నమైంది. లయ ప్రధానం కాబట్టి అందరి దగ్గరికి సులభంగా చేరిపోతుంది.

కాని వచనకవిత కవితా శిల్పంతో కవిత్వం రాయడం సాహిత్య-సామాజిక స్పృహ గల కవికి నిరంతరం ఒక పరీక్ష లాంటిదే! అందులో అందరినీ మెప్పించగలగడం అంత సులభమైన పనేమికాదు.

అనేక ప్రయోగాలకు ఆలవాలమైన ఈనాటి కవిత్వం

ప్రధానంగా వచనా కవితా శిల్పంతోనే కొనసాగుతున్నది. మరో వైపు ప్రజా పోరాటాలలో భాగంగా పసవుండే "పాట" కలిసిపోతున్నది. పోరాట స్వభావం గల కవిత్వం వచన కవితారూపంలో ఉన్న తన పరిమితుల్లో ఉద్యమాల్లో భాగం పంచుకుంటున్నది, చేరవలసిన వారిదగ్గరికీ చేరుకుంటూనే ఉంది. ఏడు సంవత్సరాల తరువాత...

**"నాలుగు దశబ్దాల సాక్షిగా నా మహానగరం" (1991)**

**హైదరాబాద్‌కో శ్రద్ధాంజలి-**

ఎక్కడైనా నగరాల విస్తరణ-పురోగమనం అక్కడి అసంఖ్యాక శ్రామికులు చెల్లించే జీవన మూల్యాల ఫలితమే! ఈ నగరాలే మానవ నాగరికత వికాసాన్ని కాలగమనంలో ఆయా దశల్లో ప్రతిఫలించాయి. కొన్ని కాలగర్భంలో కలిసిపోతే మరికొన్ని కాలానికి సాక్షిగా నిలిచాయి.

అలాంటి నగరమే హైదరాబాద్-అదే ఒకనాటి భాగ్యనగరం!

ఈ భాగ్యనగరానికి దాదాపు 70కి.మీ దూరంలో ఉన్న వీరేల్లి (లేదా వీరవల్లి) (బోనగిరి తాలూకా, నల్లగొండ జిల్లా) గ్రామంలో నేను ఊపిరి పోసుకున్నాను. అయినా నా బాల్యం, జీవితం అంతా హైదరాబాద్ నగరంతోనే పెనవేసుకుంది.

కవిగా, ఉపాధ్యాయుడుగా ఒక వ్యక్తిగా నేను మహానగరానికి రుణపడి ఉన్నాను. ఇప్పుడు ఈ నగరానికి 400 నిండిన సందర్భంలో ఈ కవితల ద్వారా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను. 1962-1999 వరకు మధ్య అప్పుడప్పుడు ప్రతి స్పందించిన కవితలే ఇవి! వీటిలో ఒకటి మాత్రం (వాయుగుండంలో మహానగరం) మద్రాసు నగరంలో ఉండగా రాసాను. కొన్ని ప్రతీకలను మినహాయిస్తే ఈ కవితా మనదేశంలోనే ఏ నగరానికైనా వర్తిస్తుంది. మరొకటి ఉర్దూలోనే నేను రాసిన కవిత. "బంద్ నామ్ బస్తి కే మేరా దోస్త్".

ఈ కవితలతో పాటే నేను హిందీ, ఉర్దూ, ఇంగ్లీషులో అనువదించిన కవితలనే అనుబంధంగా చేర్చాను.

**ఎవరీ ప్రజాశత్రువులు (1997)**

**వర్తమాన రాజకీయాలు-కవిత్వం-**

మనదేశంలో అవినీతి రాజనీతిగా మారిపోయి చివరికది డెమోక్రసి మేడ్ ఇన్ ఇండియా అనే ఇండియన్ మార్క్ ప్రజాస్వామ్యంగా ప్రజలను ఆడిస్తుంది. ప్రస్తుతం "అవినీతి" జీవనంగా పరిణమించిన దశలో అనే రకాల కవిత్వం ఉన్నట్లే వస్తుపరంగా "రాజకీయ కవిత" అనేది ఒక వాస్తవం-ఇప్పటికే ఈ దేశ వర్తమాన రాజకీయాలతో సమాంతరంగా తెలుగు కవిత్వంలో రాజకీయాలు-రాజకీయాల్లోని కవిత్వం అనే అవినాభావ సంబంధం స్థిరపడిపోయింది.

ఏ దేశంలోనైన వ్యవస్థపరంగా వచ్చే రాజకీయ పరిణామాలపై స్పష్టమైన వర్గపోరాటం అవగాహనతో పీడిత ప్రజల (దళితులు, స్త్రీలు, మైనారిటీలు) కనుకూలంగా ప్రతిస్పందించి కవి ధర్మ గ్రహాన్ని వ్యక్తం చేసినప్పుడు అవినీతి-అసమానతలపై అక్షరాయుధాలను స్పందించగలిగినప్పుడే ఆ కవితాల సామాజిక రుణాన్ని తీర్చుకోగలడు. అప్పుడే ఒక సార్థకమైన కవిగా ఎక్కడైనా ఒక సమాంతర ప్రభుత్వంగా జనం అంతర్‌ఘోషగా నినదించగలడు.

రాజకీయ కవిత్వం ఎలా ఉండాలో దాని స్వభావం ఏమిటో చిలీయన్ ప్రజాకవి పాబ్లోనెరుడా ఎంతో సూటిగా స్పష్టంగా వివరించాడు. (ఆయన మాటలను ఇంగ్లీషుతో పాటు తెలుగు అనువాదంతో దీని వెంటే ప్రచురిస్తున్నాము) ఇక ఆయన ఆశించిన ప్రమాణాలను ఈ రాజకీయ కవిత్వం ఏ మేరకు కలిగించిందో సహృదయాలే నిర్ణయించాలి.

నా రాజకీయ కవితల్ని ఇలా ఒక సంపుటిగా తీసుకురావాలని చాలాకాలం నుంచి ఒక కోరిక 30సం॥ల క్రితమే ఇంగ్లీష్‌లో పెంగ్విన్ సంస్థ ప్రచురించిన సోషలిస్టు వెర్స్ అనే అంతర్జాతీయ కవితా సంకలనం అంతర్లీనంగా ఒక ప్రేరణ:

**జ్ఞాపకాలకొండ (2004)**

**జ్ఞాపకాల కొండనెక్కుతూ...**

నాలుగు దశాబ్దాలు దాటిన నా కవితా యాత్రలో ఈ సంపుటిద్వారా జ్ఞాపకాల కొండ నెక్కుతూ వర్తమానంలోంచి గతంలోకి వెడుతున్నాను...

1997 లో ప్రచురించిన ఎవరీ ప్రజాశత్రులు ? రాజకీయ కవితా సంపుటి తర్వాత ఏడేళ్లకు తిరిగి ఇలా మరో కవితా స్రవంతిలోకి....

ఆయా దశల్లో ఆయా మజిలీల దగ్గర ముఖ్యంగా తొలినాటి కవిత్వాన్ని ఆనాడు సంపుటీకరించి వుంటే సాహిత్యరీత్యా నా స్థానమేమిటో మరింత స్పష్టంగా వుండేది. ప్రచురణలను నిర్లక్ష్యం చేసినందువల్ల వ్యక్తిగంతగా ఎంతో కోల్పోవలసి వచ్చింది.

ఆ లోటును పూడ్చుకోవడానికి ఈ జ్ఞాపకాల నీడలో ఈ కవితల్ని ఇలా పుస్తకరూపంలో వెలువరించాను. కొత్త పాతల

కవితల కలయికతో నా కవితా దశలను చూపుతున్నాను. తొలి దశలో 1960 నుంచి 1965లోగా నేను కె.యాదవరెడ్డిగానే నా రచనలన్నిటినీ ఆయా పత్రికల్లో ప్రచురించాను. ఎక్కువ భాగం ఆనాటి గోలకొండ పత్రికలో వెలుగు చూశాయి. ఆనాటి ప్రతిస్పందనలలో సహజంగానే అనేక వైరుధ్యాలు నావి

నా యవ్వన దశలో రాసిన కొన్ని ప్రేమ కవితలు కూడా ఇందులో వున్నాయి

వస్తురీత్యా థీమాటిక్‌గా ఈ సంపుటిలోని అత్యధిక కవితలు నా ప్రత్యక్ష అనుభవంలోంచి వుబికి వచ్చినవే! కొన్ని పరోక్ష స్పందనలు జతచేశాను.

వ్యక్తిగత స్థాయినుంచి సమిష్టిలోకి పరిణతి చెందే క్రమంలో వైరుధ్యాలు సహజం. వాటి పారదర్శకతే ఇందులోని కవితలు.

అనుభవ సాంద్రతలోంచి జన్మించే కవితల ప్రగాఢత కొంత భిన్నంగానే వుంటుంది. రాజకీయ సామాజిక తదితర అంశాలపై ప్రతిస్పందించే కవితల్లో ఎంతో కొంత అనుభూతి వున్నప్పుడే అది కవితగా సార్థకత చెందుతుంది. శుద్ధ వచనంగా నేలబారుగా వుండే ప్రమాదం నుంచి తప్పించుకున్నప్పుడే ప్రతి కవితాభివ్యక్తి హత్తుకుంటుంది.

**ఖండాంతరాల మీదుగా (2008) నా కవితాయాత్ర**

సమిష్టి ఉద్యమాల ఊపిరి పోసుకుని ప్రజా పోరాటాల స్ఫూర్తితో తిరిగి ఇప్పుడు కొత్త అనుభవాల స్పందనా ప్రవాహంలో..

ఈ సారి ముఖ్యంగా ఉత్తర అమెరికాలోని తూర్పు తీరప్రాంతంలో నా ఆరునెలల యాత్రానుభవాల సారమిది(ఇరవై కవితల మధ్య). ఆసియా ఖండంలోంచి యూరప్‌మీదుగా ఉత్తర అమెరికా ఖండం తిరిగొచ్చిన ఫలితమే 'ఖండాంతరాల మీదుగా' అభివ్యక్తి.

ఉద్యోగరీత్యా యుఎస్‌లో వున్న మా చిన్నబ్బాయి సమీర్ తన కారులో మమ్మల్ని మూడున్నర వేల కిలోమీటర్లు ప్రయాణం చేయించాడు. నేను నిరుత్సాహపరచినా తాను అలసటలేకుండా మమ్మల్ను ఉత్సాహపరుస్తూ చీకటి వెలుగుల దూరాన్ని అధిగమించాడు.

ఈ కవితా సంపుటిలోని కవిత ' ఖండాంతరాల మీదుగా' ఒక ప్రత్యేక ప్రయోగం. నా ఒంటరి సాయంత్రాల జాబితాగా మొదలై వ్యక్తిగత జీవిత గమనాన్ని ఆయా ప్రదేశాల మీదుగా ఆయా దశలను సూచిస్తున్నది.

ఇక మిగతా కవితలు ఆయా సందర్భాలలో గత మూడు నాలుగు సంవత్సరాల మధ్య రాసినవి కొన్ని అనువాదాలతో సహా మరికొన్ని పాతవి!

నిరంతరంగా సాగిపోతున్న నా కవితాయాత్రలో ఈ సంపుటి మరొక ముఖ్యమైన మజిలీ

**యుగస్వరం(2012) మరో మజిలీ**

కవిత్వరూపం సారం గురించి ఆలోచించినా ఉద్యమాల ఉధృతి అనుభవాల గాఢత నన్ను నడిపించాయి. కవితా రూపం నాకు ఏనాడూ ఒక సమస్య కాలేదు. ఆయా దశలలోని సారమే తన రూపాన్ని సమకూర్చుకుంటూ వచ్చేసింది.

కవిత్వంలో శిల్పరీత్యా చమక్కులు సర్కసులు సరదాగా బాగానే వుంటాయి - కాని జీవనసారంలోని ప్రగాఢతను వ్యక్తీకరించే పదాలతో ఆకట్టుకోగలిగితేనే సార్థకత.

బాహ్య ప్రపంచంలోని అనుభవాలనూ అవసరాలనూ శబ్దమార్మికతలోకి ద్రవింపచేయడమే కొందరు కవుల పని. మరికొందరు తమ మానసిక అధోలోకాలలోని అశాంతిని గందరగోళాన్ని సంక్లిష్ట పదజాలంతో మురిపించడమే గొప్ప కవిత్వమనుకుంటారు.

కాని సహజమైన జీవనభారం గుండెలోతుల్లోంచి ఉబికిరాగానే , ఆయా దశలలో అల్లుకునిఆయా సన్నివేశాలను - అంతర్ రహస్యాలను స్పందింపచేసే కవిత్వమే నా కవితా యాత్రకు అలంబన.

ఒక్కో దశలో నన్ను నేను పునరావృత్తం చేసుకుంటున్నానేమో అనే అనుమానం కలిగినా - నా కవితా యాత్ర ఎంతో వైవిధ్య భరితంగా, ఆయా చారిత్రిక దశలను ప్రతిస్పందిస్తూ, కొత్త పాఠాలు నేర్చుకుంటూ - కవిత్వ స్వరూపాన్ని సమన్వయ పరుస్తూ నాదైన శైలిలో యుగస్వరంగా ప్రసరించిందనే ఆత్మ విశ్వాసం కలిగింది.

ప్రజా ఉద్యమాలలో క్రియాశీల పాత్ర వహించినప్పుడు సహజంగానే వచన రచన ద్వారా ఇతర ప్రక్రియల్లోకి వెళ్లిపోయాను. ఆ క్రమంలోనే రాజకీయ వ్యాసాలు కథా రచన అనువాదాలు విమర్శా ప్రసంగ వ్యాసాలు నా సాహిత్య యాత్రలో అంతర్భాగమై పోయాయి. వివిధ రంగాల్లోని ఉద్యమాల వైపు దృష్టి మళ్లించినందువల్ల కవిత్వంలో కొంత మేర శ్రద్ధాసక్తులు తగ్గిన మాట వాస్తవమే!

దేశమంతా పర్యటిస్తూ ఆయా వేదికలపై ప్రసంగించడం

## ఆకాశమంత

- ఇల్ల ప్రసన్నలక్ష్మి
9494165632

గుప్పిట బంధించజాలని
ఆకాశమంత అతిశయానివి!
మదిలో సడి రేపి...
ఒడిలో సవ్వడి చేసే నవచైతన్యానివి
ఆంక్షల సంకెళ్ళను తెంచుకునే
స్వేచ్ఛా విహంగానికి చిరునామావి!
కలల అలల పై అలజడి రేపిన
కనురెప్పల అలజడికి నిలువెత్తు సాక్ష్యానివి!
నేల పై కాళ్ళూనుకునేందుకై
నింగి అంచుల కెగసే ఆశయ పతాకవి!



వేటాడే తోడేళ్ళపై
తెగించి తెగువ చూపే పిల్ల చిరుతవి
వెంటాడే దురాచార నిశిపై
ప్రజ్వలించే చైతన్యపు దివిటీవి
అధిగ్రహణపు నీలినీడను
చీల్చుకొచ్చే స్వయం ప్రకాశానివి!
నా ఊపిరిని శ్వాసగా మలచుకున్న
నా ప్రతిరూపానివి!
ఆశయసాధనకై వెనుకడుగేయని
రేపటి నా ప్రతినిధివి...!

♦

---

- కవితా పఠనం, ఇతర భాషా సాహిత్యవేత్తలతో సంభాషణ నా కవిత్వానుశీలనకు ఎంతో ప్రేరణ కలిగించాయి. కవితాయాత్ర ఎక్కడా ఆగిపోలేదు.

**ఒక ఆత్మ శోధన కాలాన్ని అధిగమించి(2014)**

ప్రపంచంలో ఏ భాషలోని ఆధునిక కవిత్వానికైనా ఏ మాత్రం తీసిపోకుండా సమధీటుగా నిలిచే తెలుగు కవిత్వం ఉద్యమాల రీత్యా తన చరిత్రను చాటుకున్నదనడానికి మన సాహిత్య చరిత్రనే సాక్ష్యం.

అయినా ఆనాటి నుంచి సమకాలీన కవితా ప్రపంచం దాకా తరచుగా కవులు ఎదుర్కొంటున్న ప్రశ్నలు–

అసలు ఈ రోజుల్లో కవిత్వం ఎంతమంది చదువుతున్నారు? పుస్తకాల షాపుల్లో కవిత్వానికి చోటున్నదా? వుంటే ఎంతమంది కవితా సంపుటాలను కొంటున్నారు? సమీక్షల పేరిట ఎన్ని పత్రికలు కవులకు న్యాయం చేస్తున్నాయి?

ఇంగ్లాండులోని ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ తన కవిత్వ విభాగాన్ని మూసివేస్తున్నదని పత్రికల్లో చదివాను.మరో పక్క యుఎస్‌లోని కొన్ని రాష్ట్రాలలో ఆస్థాన కవులున్నారు. అక్కడ ప్రతి ఏటా కవులు రివార్డులు అవార్డులు పుచ్చుకుంటున్నారు. కవితా సంకలనాలు పోయెట్రీ పత్రికలు వస్తున్నాయి

తెలుగులో ఇప్పుడు మరోవైపు ఎంతో నిస్సారమైన కవిత్వం వస్తున్నా – వైరుధ్యాల మధ్యనే తెలుగు కవులందరూ నిష్కామకర్మగా అందమైన అట్టలతో సంపుటాలను సంకలనాలను ప్రచురిస్తూనే వున్నారు. కొందరైనా పాఠకులు కవిత్వం చదువుతారనే ఆశతో పరస్పర సత్కారాలు – సన్మానాలు – పురస్కారాలతో తెలుగు కవితా లోకం వివిధ అస్తిత్వ అంతరంగ కథనాలతో సజీవంగా వున్నది

నా కవితా యానంలో వెనక్కు వెళ్లిన 50-60 సంవత్సరాల కాలంలో ఆనాటి గోలకొండ పత్రిక స్రవంతి మొదలు ఈనాటిదాకా దాదాపు అన్ని పత్రికల్లో నా కవితలు వెలుగుచూశాయి. ఇంగ్లీషు హిందీ ఉర్దూ పత్రికల్లో నా రచనలే కాకుండా ఇతరత్రా వివిధ భారతీయ భాషల్లో నా కవితల అనువాదాలు ప్రచురించారు.

ప్రస్తుతం నా సమగ్ర కవితా సంపుటిని ఈ రూపంలో వెలువరిస్తున్న ఎమెస్కో విజయకుమార్ గారికి, సహృదయ మిత్రులు ఎడిటర్ డా.డి.చంద్రశేఖరరెడ్డి గారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు.

**(1938 ఆగష్టు11న భోనగిరి యాదాద్రిజిల్లా వీరవల్లిలో కుంభం యాదగిరి రెడ్డిగా పుట్టిన నిఖిలేశ్వర్ సమగ్ర కవితా సంపుటి (ప్రారంభంలో ఆయన చేసుకున్న కవితాయాత్రావలోకనం స్వల్ప సంక్షిప్తీకరణతో)**

♦



# ప్రేరణ

అప్పరాజు నాగజ్యోతి
09480930084

హోటల్ తాజ్‌లో కాన్ఫరెన్స్‌కి వెళ్ళిన ప్రొఫెసర్ పార్థసారథికి అక్కడ అనుకోకుండా అర్జున్ కనిపించాడు. ఐఐటి చెన్నైలో చదివేటప్పుడు పార్థసారథికి ప్రియశిష్యుడు అర్జున్. మంచి తెలివైన విద్యార్థి అని అర్జున్‌ని ప్రత్యేకంగా చూస్తుండే పార్థసారథి , అప్పట్లో పండగలకి అతన్ని యింటికి కూడా ఆహ్వానిస్తుండేవాడు. పార్థసారథి భార్య తులసి కూడా అర్జున్‌ని ప్రేమగా, వాళ్ళ కొడుకు చరణ్‌తో సమానంగా చూస్తుండేది.

చాలా ఏళ్లకి కనిపించిన శిష్యుడిని చూసిన పార్థసారథి ఎంతో ఆనందించాడు. తను ఉద్యోగం నుండి రిటైర్ అయిన తరవాత బెంగళూర్‌లోనే సెటిల్ అయ్యానని చెప్పి కాన్ఫరెన్స్ అయిపోయిన తరువాత అర్జున్ని తనతోపాటు తన యింటికి తీసుకుని వెళ్ళాడు.

పాదాభివందనం చేసిన అర్జున్‌ని ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంది తులసి.

గురుశిష్యులిద్దరూ సోఫాలో కూర్చుని, టెక్నాలజీ రంగంలో కొత్తగా వస్తున్న మార్పుల గురించి వివరంగా చర్చించుకుంటుండగా బిస్కెట్లు, టీ తెచ్చింది తులసి.

టీ త్రాగుతుండగా సడెన్‌గా ఏదో గుర్తుకు వచ్చింది తులసికి.

“అర్జున్, నువ్వు మా ప్రేరణని చూడనేలేదు కదూ” అంటూ “అమ్మాయి ప్రేరణా , ఒకసారి యిలా రామ్మా“ అంటూ కేకేసింది.

గదిలో లాప్‌టాప్‌లో పని చేస్తోందేమో అలాగే చేతిలో లాప్‌టాప్‌తోనే “ పిలిచావా అమ్మా“ అంటూ హాల్లోకి వచ్చింది ప్రేరణ.

పొడుగ్గా, నాజుకుగా వుండి పచ్చటి పసిమి ఛాయలో మెరిసిపోతున్న ప్రేరణని చూస్తూనే ఆశ్చర్యపోయాడు అర్జున్.

“మీకు చరణ్ తరవాత అమ్మాయి పుట్టిందా సార్? నాకు తెలియదే! అన్నట్లు చరణ్ ఎలా వున్నాడు సార్? ఏం చేస్తున్నాడిప్పుడు? ప్రేరణ ఏం చదువుతోంది?“ అడిగాడు అర్జున్.

“నువ్వేమీ మారలేదయ్యా అర్జున్. అప్పుడూ క్లాస్‌లో యిలాగే వరసబెట్టి ప్రశ్నలతో వేధించే వాడివి “

శిష్యుడ్ని ముద్దుగా విసుక్కుంటూ " ముందు అమ్మాయికి నిన్ను పరిచయం చేయనీ" అంటూ ప్రేరణ వైపుకి తిరిగాడు.

" అమ్మా ప్రేరణా, వీడు నా స్టూడెంట్ అర్జున్. వెరీ బ్రైట్. ప్రస్తుతం ఒక మల్టీ నేషనల్ కంపెనీలో పెద్ద పొజిషన్ లో వున్నాడు "

"హలో అర్జున్ గారూ. మీ గురించి నాన్నగారు చాలా సార్లు చెప్పారు. వెరీ నైస్ టు మీట్ యు "

మర్యాదగా పలకరించి లోనికి వెళ్ళింది ప్రేరణ.

"ఎందుచేతో గానీ చిన్నతనం నుండీ సమాజంలో అట్టడుగు స్థాయిలో వున్న వాళ్ల కోసం ఏదైనా చేయాలనీ, వాళ్ళని పైకి తీసుకురావాలనీ ప్రేరణలో తీవ్రమైన తపన వుండేది అర్జున్. అందుకే ఎంబీఏ పూర్తవుతూనే తన ఆశయం మేరకు ఒక మల్టీ నేషనల్ కంపనీలో సిఎస్ఆర్ (కార్పోరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ) వింగ్‌లో చేరి అట్టడుగు వర్గ ప్రజలకు ఉపాధి కల్పించే ప్రాజెక్టులని చేపడుతోంది"

"ప్రేరణ చాలా మంచి ఫీల్డ్‌ని ఎన్నుకుంది సార్. యిప్పుడు చాలా కంపెనీలు చిత్తశుద్ధితో తమ సంస్థ కి వచ్చే లాభాలలో కొంత శాతం నిధులని యిలాంటి సేవా కార్యక్రమాలకి కేటాయిస్తున్నారు. ఇంతకీ చరణ్ ఎక్కడ సార్ ? కనిపించడే ?"

అర్జున్ ప్రశ్నలకి పార్థసారథి వదనం మ్లానమైనా కొద్ది క్షణాల్లోనే సర్దుకున్నాడు.

" నీ దగ్గర దాచేదేముంది అర్జున్. మాకు పెళ్ళైన పదేళ్లకు పుట్టాడు చరణ్. అదీ ఎన్నో ట్రీట్‌మెంట్స్ తీసుకున్న తర్వాత 'యింక మాకు పిల్లలు పుట్టరు' అని మేమిద్దరం నిరాశలో కూరుకుపోయిన తరుణంలో కృత్రిమ గర్భధారణ ద్వారా కలిగాడు"

'కృత్రిమ గర్భధారణ' అన్న మాటని వింటూనే ఒక్కక్షణం ఉలిక్కిపడ్డాడు అర్జున్. వెంటనే మళ్ళీ సర్దుకుని ప్రొఫెసర్ చెబుతున్నదాన్ని శ్రద్ధగా వినసాగాడు.

"అప్పట్లో తులసి 'ఈ ట్రీట్ మెంట్స్ అవీ వద్దండీ, మనం ఎవరైనా ఒక చక్కటి పాపని అనాథాశ్రమం నుండి తెచ్చుకుని పెంచుకుందాం' అంటూ ఎంత మొత్తుకున్నా కూడా నేను తన మాటని వినలేదు. నా జీన్స్, నా తెలివితేటలూ, నా రక్తంతో పుట్టే బిడ్డే నాకు కావాలంటూ మొండిపట్టు పట్టాను. అలా లేకలేక పుట్టిన చరణ్ మొదటినుండీ కూడా చదువులో కొంచెం మందకొండిగానే ఉండేవాడు. అన్ని విషయాల్లో మొండిగా, యింకా సరిగ్గా చెప్పాలంటే కాస్త విపరీతంగా ప్రవర్తించేవాడు. వాడిని దారిలో పెట్టడానికి అప్పుడప్పుడూ వాడి మీద చేయి చేసుకోవలసివచ్చేది కూడా. పదవ తరగతి పూర్తయిన పిమ్మట కాలేజీలో చేరాక నన్నూ, తులసినీ వాడసలు లెక్క చేసేవాడు కాదు. కాలేజీలో చెడు స్నేహాలు మరిగి, మెల్లిగా తాగుడికీ, డ్రగ్స్‌కీ అలవాటు పడ్డాడు. అతి త్వరలోనే వాడు మా చేయి జారిపోయాడు"

చెబుతూ చెబుతూ ఆయాసం రావడంతో ఆగాడు పార్థసారథి.

అక్కడే టేబుల్ మీద వున్న మంచినీళ్ళ గ్లాస్‌ని అర్జున్ అందించగా నీళ్ళు తాగిన తరవాత తిరిగి కొనసాగించాడు.

"యింత హైలీ ఎడ్యుకేటెడ్ని అయి వుండి కూడా నేనూ ఒక సగటు మనిషి లాగా నా రక్తం పంచుకుని పుట్టిన పిల్లలకి నా జన్యువుల లక్షణాలు, నా తెలివితేటలూ, నా గుణగణాలే వస్తాయని మూర్ఖంగా అనుకున్నాను అర్జున్. నిజానికి సైన్సు ప్రకారం పిల్లలకి కేవలం తల్లితండ్రుల పోలికలే కాకుండా వంశంలో ఎవరి పోలికలైనా రావచ్చు కదా! చరణ్‌కి మా నాన్నగారి పెదనాన్న, అంటే మా పెద్ద తాతయ్య పోలిక వచ్చింది. మా పెదతాతా వీడిలాగే ఆ కాలంలో తాగుడికి బానిసై చివరకి లివర్ కాన్సర్‌తో నలభై ఏళ్లు నిండకుండానే చనిపోయాడు. ఆయన పోలికలని పుణికి పుచ్చుకున్న చరణ్ కూడా అతనిలాగే చెడు వ్యసనాలకు బానిసై ఒక రోజున డ్రగ్స్‌ని కొంటూ పోలీసులకు పట్టుబడ్డాడు. ప్రస్తుతం జైల్లో వున్నాడు. చెడు అలవాట్లని మానిపించటానికి జైల్లోనే వాడికి ట్రీట్ మెంట్ యిస్తున్నారు వాళ్ళు "

చెమర్చిన కళ్ళని కళ్ళజోడు తీసి తుడుచుకున్నాడు పార్థసారథి.

ప్రొఫెసర్ చెప్పిందంతా విన్న అర్జున్కి మనసంతా చేదుగా అవడంతో కొద్దిసేపటివరకూ ఏమీ మాట్లాడలేకపోయాడు.

ఆ తరవాత ఎలాగో నోరు పెగుల్చుకుని "సార్, మరి ప్రేరణ .." అంటూ ఆర్ద్రోక్తి లో ఆపాడు.

అతని సందేహాన్ని అర్థం చేసుకున్నాడు పార్థసారథి.

"నువ్వూహించింది నిజమే అర్జున్. ప్రేరణ మా స్వంతకూతురు కాదు. చరణ్ ఆగడాలతో విసిగిపోయిన నేనూ, తులసీ అప్పట్లో మనశ్శాంతి కోసమని గుళ్లనీ, గోపురాలనీ దర్శించుకుంటుండే వాళ్ళం. వాటితో పాటుగా అనాథాశ్రమాలకీ, వృద్ధాశ్రమాలకీ కూడా వెళ్లి మా చేతనైనంత

సాయం చేస్తుండేవాళ్ళం. అలా ఒకసారి ఒక అనాధాశ్రమానికి వెళ్ళినప్పుడు అక్కడ ఒక చిన్న పాపని చూసాము. నెల రోజుల గుడ్డు. తెల్లగా, ముట్టుకుంటే కందిపోతుందేమో అన్నట్టున్న ఆ పాపని పెంచుకోవడానికి ఎంతోమంది ముందుకొచ్చారు. కానీ పాపకి పుడుతూనే వున్న గుండెజబ్బుకి భయపడి అలా ముందుకి వచ్చిన వారంతా వెనక్కి తగ్గారు. ముందే చెప్పాను కదా, చరణ్ పుట్టకముందు నుండీ కూడా ఎవరైనా అనాధ పాపని దత్తత తీసుకుని ఆ పాపకి తల్లితండ్రుల ప్రేమానురాగాలని పంచివ్వాలనే కోరిక వుండేది తులసికి. ఈ పాపని చూసిన తరవాత నేను కూడా తన కోరికని కాదనలేకపోయాను. అలా ఆ పాపని మేము దత్తత తీసుకున్నాము. మాకు డబ్బుకి కొదవ లేదు కదా, అమెరికా నుండి స్పెషలిస్టులని పిలిపించి పాపకి గుండె ఆపరేషన్ చేయించాము. మా అదృష్టం కొద్దీ ఆపరేషన్ విజయవంతమై పాప మాకు దక్కింది. పిల్లలు సహజంగా పుట్టే అవకాశం లేదని నిరాశ చెందే మాలాంటి దంపతులందరికీ కూడా మేము చేసిన ఈ పని ప్రేరణనివ్వాలనే ఆలోచనతోనే మేము పాపకి 'ప్రేరణ' అని పేరు పెట్టుకుని పెంచుకున్నాం. ప్రేరణకి పద్నాలుగేళ్ళు వచ్చాక తను మా స్వంత కూతురు కాదనే విషయాన్ని తనకి అర్థమయ్యేటట్లుగా చెప్పాము. ప్రేరణ తన పుట్టుక మూలాలని ఎన్నటికీ మరిచిపోకూడదనే ఉద్దేశ్యంతోనే ఇప్పటికీ ప్రతీ ఆదివారం నేనూ, తులసీ కూడా ప్రేరణని తీసుకుని తనని మాకిచ్చిన అనాధాశ్రమానికి వెళ్లి ఆ పిల్లలతో గడిపి వస్తాము. మా నుండి ప్రేరణ పొందిన ప్రేరణ, డిగ్రీ చేస్తుండగానే ఒక ఎనజీఓ సంస్థని స్థాపించింది. తనలాగే ఆలోచించే మరో పదిమంది వ్యక్తులు తనతో జత కూడారు. పిల్లలు పుట్టలేదని దిగులుపడే దంపతులకి కౌన్సిలింగ్ చేసి 'కేవలం రక్తం పంచుకుని పుట్టేవాళ్ళే బిడ్డలు కాదు' అని వాళ్లకి నచ్చచెప్పి తల్లీ తండ్రీ లేని అనాధ పిల్లలని ఆ దంపతులు దత్తత చేసుకునేటట్టు ఒప్పించే దిశగా వారి సంస్థ కృషి చేస్తోంది. ఈ నాలుగేళ్ళలో ఆ సంస్థ చేసిన కృషి ఫలితంగా పాతికమందికి పైగా అనాధలు అమ్మానాన్నల అనురాగానికి నోచుకున్నారు" అంటూ ముగించారు పార్థసారథి.

ప్రొఫెసర్ చెప్పినదంతా వింటుంటే వారం రోజుల నుండి తనకీ, తన భార్య శ్రావ్యకీ మధ్యన జరుగుతున్న కోల్డ్ వార్, అందుకు దారి తీసిన పరిస్థితులు అర్జున్ కళ్ళెదుట నిలబడ్డాయి.

◆◆◆

సిటీలో పేరుపొందిన గైనకాలజిస్ట్ డాక్టర్ హేమ వ్రాసిన టెస్ట్‌లన్నీ చేయించుకుని ఆ రిపోర్ట్స్‌ని తీసుకుని భార్య శ్రావ్యతో కలిసి హాస్పిటల్‌కి వెళ్ళాడు అర్జున్.

ఆ మెడికల్ రిపోర్ట్స్‌ని పరిశీలించిన డాక్టర్ హేమ, ఫలితాలకోసం ఆత్రంగా చూస్తున్న ఆ దంపతులని చూసి గొంతు సవరించుకుంది.

" మిస్టర్ అర్జున్, మీ రిపోర్ట్స్‌ని బట్టి చూస్తే మీరు రెండేళ్ళ నుండి ప్రయత్నం చేస్తున్నా కూడా మీకింకా పిల్లలు పుట్టకపోవటానికి మీ యిద్దరిలోనూ వున్న స్వల్పమైన లోపాలే కారణం. మీ మిసెస్‌కి గర్భసంచిలో వున్న సమస్య చిన్నదే, దానిని మైనర్ సర్జరీతో సరిచేసేయవచ్చు. కానీ మీ స్పెర్మ్ కౌంట్ మాత్రం చాలా తక్కువగా వుంది కాబట్టి మీకు నేచురల్‌గా పిల్లలు పుట్టడం అనేది దాదాపు అసంభవమనే చెప్పొచ్చు. కాకపోతే యిప్పుడు మెడికల్ సైన్సు చాలా అభివృద్ధి చెందింది కనుక కృత్రిమగర్భధారణ ద్వారా మనం కొంత ప్రయత్నం చేయవచ్చు. అయితే దీనికి చాలా సిట్టింగ్స్ అవసరమవుతాయి. ఎంతో సహనంగా చాలా రోజుల పాటు వేచి చూడవలసి వుంటుంది. కొన్ని కొన్ని కేసుల్లో అయితే ఏళ్ల తరబడి వెయిట్ చేయవలసిరావచ్చు. యింత చేసినా కూడా ఫలితం ఉంటుందని నూరుశాతం గ్యారంటీ మాత్రం యివ్వలేను. కాబట్టి ఏ విషయమూ మీరిద్దరూకలిసి ఆలోచించుకుని నిర్ణయానికి రండి"

డాక్టర్‌కి థాంక్స్ చెప్పి హాస్పిటల్ నుండి బయటకి వచ్చారు అర్జున్, శ్రావ్య.

◆◆◆

అర్జున్‌కి పసిపిల్లలంటే ప్రాణం. తమకి పిల్లలు పుట్టడం అసంభవమన్న విషయాన్ని డాక్టర్ నోటి నుండి వినగానే మొదట చాలా నిరుత్సాహపడినా , ఆ పైన డాక్టర్ సజెస్ట్ చేసిన కృత్రిమ గర్భధారణ మార్గం అతనికి కొంత ఆశాజనకంగా గోచరించింది.

సహజంగా ప్రతీ ఆడపిల్లా అపురూపంగా భావించే మాతృత్వం పట్ల శ్రావ్యకీ మమకారం వున్నా , డాక్టర్ చెప్పిన విషయం విని అర్జున్‌కి మల్లే ఆమె మరీ అంత డీలా పడిపోలేదు. దానికి కారణం ఆమె పెరిగిన వాతావరణమే.

శ్రావ్య నాన్న ఆమె చిన్నతనంలోనే ఒక రైలు ప్రమాదంలో చనిపోతే, అమ్మ గాయత్రి ఒక అనాధ

## పాఠకులకు, సాహిత్యాభిమానులకు విజ్ఞప్తి

**2000** సంవత్సరం నుండి నిరాటంకంగా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సాహిత్య ప్రస్థానం మాసపత్రిక వెలువడుతున్న సంగతి తెలిసిందే. పాఠకులు, అభిమానులు సహకారం వల్లనే ఇది సాధ్యమయింది. ఆర్థికంగా భారం అయినప్పటికీ జనవరి 2018 సంచిక నుండి సాహిత్య ప్రస్థానం మాసపత్రిక పేజీలను పెంచడం జరిగింది. సాహిత్య పత్రికల నిర్వహణ గురించి తెలుగు సాహిత్య అభిమానులకు తెలిసిందే. ప్రతీనెలా సంచిక వెలువరించడం ఎప్పటికప్పుడు దినదిన గండమే. అయినా సాహిత్యం పట్ల, తెలుగు భాషపట్ల ఆపేక్ష కలిగిన పాఠకాభిమానుల ప్రోత్సాహమే మాకు బలం. సాహితీ స్రవంతి కార్యకలాపాలు నిరంతరంగా సాగాలన్నా, సాహిత్య ప్రస్థానం మాసపత్రిక నిరాటంకంగా వెలువడాలన్నా సాహిత్యాభిమానులు స్పందించి విరాళం రూపంలో ప్రోత్సాహాన్ని అందించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. సాహిత్య ప్రస్థానం మాసపత్రిక ఖాతా వివరాలు తొలిపేజీలో ఇవ్వడం జరిగింది. గమనించగలరు. ♦

శరణాలయంలో సూపర్వైజర్‌గా పని చేస్తూ శ్రావ్యని పెంచి పెద్ద చేసింది.

అనాథ శరణాలయంలోని పిల్లలని తన స్వంతపిల్లల్లా ఆప్యాయంగా చూసుకునే గాయత్రి, చిన్నతనంలో శ్రావ్య పుట్టినరోజుతో సహా అన్ని పండగలనీ అనాథ శరణాలయం లో ఆ పిల్లల సమక్షంలోనే జరిపించేది. ఆ అనాథలని పెంచుకోవడానికి ఏ దంపతులైనా ముందుకొచ్చినప్పుడు తనే స్వయంగా దర్యాప్తు చేసిగానీ పిల్లలని వారికి దత్తతకి యిచ్చేది కాదు. అలా దత్తతకి యిచ్చిన తరవాత కూడా ఆ పిల్లలని అడపాదడపా వెళ్లి చూసి వస్తుండేది.

అలాంటి నేపథ్యంలో పెరిగిన శ్రావ్యకి పిల్లలు పుట్టకపోవడం అనేది చెప్పుకోదగ్గ లోపంలా అనిపించలేదు. అందుకే హాస్పిటల్ నుండి యింటికి కారులో తిరిగి వెళ్తుండగా భర్తతో చెప్పింది.

“పిల్లల కోసం ఈ ట్రీట్ మెంట్స్ అవీ వద్దండీ. ఎంతో మంది అనాథలు తల్లిదండ్రుల ప్రేమ కోసం అల్లాడిపోతుండగా యింత చదువుకున్న మనం ప్రత్యేకంగా ట్రీట్ మెంట్స్‌ని తీసుకుని మరీ పిల్లలని కనడం పిచ్చితనం కదూ ! అందుకే మనం ఒక అనాథ పాపని దత్తత చేసుకుని తల్లీ తండ్రి లేని ఆ చిన్నారికి చక్కటి జీవితాన్నిద్దామండీ. బహుశా ఆ భగవంతుడి సంకల్పం కూడా అదే అయుండొచ్చు, అందుకే మనకి సహజంగా పిల్లలు పుట్టే మార్గాన్ని మూసేసాడు”

శ్రావ్య చెప్పిన దానికి వెంటనే అభ్యంతరం చెప్పాడు అర్జున్.

“ లేదు శ్రావ్యా. నాకు పిల్లలంటే ఎంత యిష్టమో నీకు తెలుసుగా. మన రక్తం పంచుకుని పుట్టిన బిడ్డకైతే మన జీన్స్, మన తెలివితేటలూ, మన రూపురేఖలూ వస్తాయి. అంతే కానీ, ఎవరికి పుట్టారో తెలియని అనాథపిల్లని పెంచుకుంటే ఆ పిల్ల పెరిగి పెద్దయ్యాక ఏ విధంగా తయారవుతుందో ఎవరు చెప్పగలరు? అందుకే కాస్త కష్టమైనా, ఆలస్యమైనా కూడా ఫరవాలేదు. మనం డాక్టర్ హేమ చెప్పినట్లుగా ఆమె వద్ద ట్రీట్ మెంట్ తీసుకుందాం”

శ్రావ్య ఎన్ని రకాలుగా నచ్చజెప్పాలని చూసినా కూడా అర్జున్ దత్తతకు ససేమిరా అన్నాడు. ట్రీట్ మెంట్ వైపే పూర్తిగా మొగ్గు చూపాడు. యింక చేసేదేమిలేక శ్రావ్య మౌనం వహించింది.

♦♦♦

ఈ వేళ ప్రొఫెసర్ చెప్పినదంతా విన్నాక అర్జున్ కళ్ళకి క్రమ్మిన పొరలు ఒకటొకటిగా తొలగిపోయినట్లయింది.

శ్రావ్య ఎంత చెబుతున్నా వినకుండా మూర్ఖత్వంతో తనెటువంటి పొరపాటు చేయబోయాడో అర్థమయింది.

సరైన సమయంలో తనకి తారసపడి తన కళ్ళు తెరిపించిన ప్రొఫెసర్కి మనసులోనే కృతజ్ఞతలని చెప్పుకున్నాడు అర్జున్.

ముద్దులొలికే ఒక అనాథ పాపని దత్తత తీసుకుని , ఆ చిన్నారికి తల్లిదండ్రులుగా తమ ప్రేమని పంచివ్వాలని ఆ క్షణమే నిర్ణయించుకున్న అర్జున్ ఈ నిర్ణయాన్ని శ్రావ్యకి చెప్పి ఆమె కళ్ళల్లో మెరిసే కాంతులని చూడాలని మనసు తొందర చేస్తుండగా ఆనందంగా యింటికి బయలుదేరాడు.

♦

# మిత్రమా... ఎటెళ్ళిపోయావు !

- దార్ల వెంకటేశ్వరరావు
09182685231

మిత్రమా... నువ్వెక్కడికెళ్ళావు !
నువ్వు కనపడక
నిన్నటిదాకా నువ్వు కన్న కలలన్నీ
గుండెల్ని బాదుకుంటున్నాయి
కలలు కనడం కోసమే
ఎన్నిసార్లో బలవంతంగా మూసుకున్న
కళ్ళేమిటో తెరవడానికే
భయపడుతున్నాయి
లైబ్రరీలో నీకోసమే
తెరిచిన హృదయంలా పుస్తకాలింకా
చేతులు చాచి అలాగే చూస్తున్నాయి
విస్తర్లో సంపూర్ణంగా వడ్డించి
నిన్ను అసంపూర్ణంగా లాగేసిందెవరు?
నీ మునివేళ్ళ స్పర్శ లేక
మాటల్నేర్చుకుంటున్న
కాగితాలలా దుఃఖిస్తున్నాయేంటి?
ఎక్కడికెళ్ళావు మిత్రమా....
నిన్ను చూసినప్పుడల్లా
భాషంటే యాంత్రికం కాదనిపించేది
భాషంటే భావవ్యక్తీకరణకో
భాషంటే బాధల వ్యక్తీకరణకో
మానవత్వం పరిమళించడానికో
బలమైన సాధనమనిపించేది
నువ్వెక్కడికి వెళ్ళిపోయావు
ఎవ్వరికైనా చెప్పావా?
నువ్వు జల్లిన అక్షరాల్నింకా ఏరుకుంటున్న




గిరిజన తాండాలకైనా చెప్పావా?
వేదనల్ని పట్టించుకోని
భాషావేత్తలనుకునేవాళ్ళకైనా చెప్పావా?
రెప్పలార్పకుండా
నీతో కలిసి కష్టసుఖాల్ని పంచుకునే
నీ సహజీవితానికైనా చెప్పావా?
నువ్వెప్పుడొస్తావని చెప్పాలి
నువ్వు రాగానే నిన్ను అభిషేకించాలని
కళ్ళల్లో ఒత్తులేసుకుని
చేతుల్లో చిరునవ్వుల్తో ఎదురుచూసే
ఆశలదీపాలకైనా చెప్పావా?
ఎవ్వరికీ చెప్పకపోయినా
ఉద్యోగం వచ్చాక్కూడా
ఇంకా దేవులాటలేమిటంటూ
కునుకుపాట్లుపడే వాళ్ళకైనా చెప్పావా?
మిత్రమా... నువ్వెక్కడికి వెళ్ళిపోయావు?
నువ్వు లేవంటే నమ్మలేకపోతున్నాను
నువ్వు మళ్ళీ కనబడవంటేనే
అటు చూడలేకపోతున్నాను!
నువ్వెటూ కనపడకపోతే
అటూ ఇటూ ఎటు చూసినా
చీకట్లేవో కమ్మినట్లవుతోంది!
మిత్రమా.. నువ్వెక్కడికెళ్ళిపోయావు!

(మిత్రుడు డా. అడబాల అప్పారావు
ఆకస్మిక మరణాన్ని జీర్ణించుకోలేక....) ♦

---

## హైకూలు

- బి. గోవర్ధనరావు
94419 68930

మంచుమల్లెలు
హేమంతపు హేలలో
రుతురాగాలు

తామరపూలు
చెరగని ముగ్గులు
నీటిలో దీపాలు

చేతిలో చెరుకు
తేనెలూరు పలుకు
సంక్రాంతి పిలుపు

రైలు ప్రయాణం
వంతెన్ని దాటుతున్న
కొత్త పల్లవి



పేపర్‌బాయ్
వార్తలపూలను చల్లే
తొలిపొద్దు హాయి

వలస పక్షి
రెక్కల కష్టంతో
భుక్తిని గెలిచింది ♦

# ఇస్మాయిల్ కవిత్వం, కాసిన్ని జ్ఞాపకాలు



- బొల్లోజు బాబా
9849320443

26.05.1928 - 25.11.2003

ఇస్మాయిల్ అనగానే రెండు విషయాలు చాలామంది స్మరణకు వస్తాయి. మొదటిది "చెట్టు నా ఆదర్శం". రెండవది ఆయన ఆంధ్రదేశానికి పరిచయం చేసిన హైకూ. ఇస్మాయిల్ కవిత్వ భాష విశిష్టమైనది. క్లిష్టపదాలు, పొడుగు వాక్యాలు ఉండవు. ఛందస్సులు, లయ శయ్యల వంటివి కనపడవు. అయినప్పటికి ఈయన కవిత్వం ఒక అనుభూతిని పదచిత్రాల ద్వారా పఠితకు ప్రసారం చేసి అతనూ అనుభూతి చెందేలా చేస్తుంది, అదీ ఎంతో నిశ్శబ్దం గా.

సౌందర్యారాధన, మానవత్వంపై విశ్వాసం, స్వేచ్ఛాశీలత, ప్రకృతి ఉపాసన ఆయన కవిత్వానికి కాన్వాసు. మన దైనందిక విషయాలను, చిన్న చిన్న అనుభవాల్నీ, అపుడపుడూ ప్రకృతి కరుణించే సుందర దృశ్యాలకు, కరుణ తాత్వికలను అద్ది కవిత్వంగా మలచి మనకందించారు. కేవలం కవిత్వం మాత్రమే వినిపిస్తాంటుంది. జీవితోత్సవాన్ని ఎన్నికోణాల్లో ఆనందించవచ్చో అన్ని కోణాల్నీ ఆయన తన కవిత్వంలో ఆవిష్కరించారు. అందుకనే ఇస్మాయిల్ పుస్తకాలను వరుసగా చదువుతున్నపుడు ఇతివృత్త సంబంధమైన మోనాటనీ కనిపించదు.

ఆయన కవిత్వంలో పదచిత్రాల సౌందర్యం పరిమళిస్తాంటుంది. పదచిత్రాల్ని ఎవరైనా కల్పన చేయగలరు. కానీ ఒక దృశ్యాన్ని నలుగురూ చూసే దృష్టితో కాక కొత్తగా దర్శించి దాన్ని పదచిత్రంగా మలచటం ఇస్మాయిల్‌కే చెల్లింది. ఒక్కోసారి ఈయన "ఇలా ఎలా" చూడగలిగారబ్బా అని విస్మయంతో ఆశ్చర్యపడక తప్పదు. ఈ క్రింది ఉదాహరణలను చూస్తే అర్థం అవుతుంది ఆయన విలక్షణ వీక్షణం.

*ఎక్కడెక్కణ్ణించో ఎగిరి వచ్చిన కాకులు చింతచెట్టులో నల్లగా అస్తమిస్తాయి /*

*ప్రణయక్రీడలో మన అంగాల పాచికల్ని మహోద్రేకంతో విసిరి నక్షత్రాల పావుల్ని రాత్రల్లా నడిపించాం గుర్తుందా! /*

*కిటికీలోంచి చూస్తే వెలుతురునిండిన బొజ్జాలతో పిల్లం గోవిలా ఊళవేసుకుంటూ దూసుకుపోతోంది రైలు /*

*తొలిసంజె నారింజని ఎవరు ఒలిచేరు, తెలిఎండ తొనలను ఎవరు పంచారు /*

*ఊగుతోంది వేయి పిర్రల సముద్రం /*

*మూగిన బంధుమిత్రులు మోసుకుపోయి అతణ్ణి విత్తనంలా పాతారు /*

*భూమి బుగ్గపై చల్లటి నవ్వు సొట్టలా బావి /*

*ఉదయాలు అనాది నుంచీ సూర్య శిశువును ఎన్నివిధాలుగా ఎగరేసి పట్టుకొన్నాయో/*

**నీడల విసనకర్రను విప్పి ఎండలో సేదదీరుస్తుంది చెట్టు**

- ఇలా చెప్పుకుంటూ పోతే ఆయన కవితలనన్నీ టైప్ చెయ్యవలసి ఉంటుంది. ఎన్ని పదచిత్రాలు, ఎన్నెన్ని సునిశిత దృశ్యాలు.

**బుద్ధిగా ప్రేమించుకోక**
**యుద్ధమెందుకు చేస్తారో**
**నాకర్థం కాదు.**

పై వాక్యాల సారాంశమే ఇస్మాయిల్ కవిత్వమూ, జీవితమూను. జీవితానందాల్ని గానం చేసే కవికి, వానిని పాడుచేసే మనుష్యులను చూస్తే ఇలాకాక వేరెలా అనిపిస్తుంది!

***తనని బాధిస్తున్న ప్రపంచపు ముల్లుని***
***పీకి పారేసి***
***ఈ పిల్ల చకచక ఎటో నడిచిపోయింది (ఆత్మహత్య)***

ఆత్మహత్యకు ఎంత అద్భుత నిర్వచనం. ఈ గుప్పెడు వాక్యాలలో, ఒక అమ్మాయి జీవితంలో ఓడి పోవటం, తద్వారా ఎదుర్కోవలసి వచ్చిన సామాజిక వివక్ష, నిత్యం ముల్లై బాధించిన ఈ ప్రపంచాన్ని ఇక ఏమాత్రమూ తప్పించుకోలేని దోషిగా నిలబెట్టటమూ ఎంతగొప్పగా ఇమిడి పోయాయి.

*సెలయేరా సెలయేరా*
*గలగలమంటో నిత్యం*
*ఎలా పాడ గలుగుతున్నావు?*
***చూడు, నా బతుకునిండా రాళ్లు***
*పాడకుంటే ఎలా?*

జీవితంలోని కష్టాలను కప్పిపుచ్చు కొని ఆనందంగా ఉండక తప్పదు అని ప్రవచించే ఈ కవితే ఇస్మాయిల్ జీవితాదర్శం. ఆయనకు ఎన్ని ఆర్థిక ఇబ్బందులున్నా చిరునవ్వును, సంతృప్తిని వీడ లేదంటారు సన్నిహితులు. అందుకేనేమో ఓ కవితలో ఇలా అన్నారు.

*నేను డబ్బు సంపాదించలేదని*
***మా ఆవిడ సణుగుతుంది.***
*డబ్బెందుకు?*
***కిటికీలోంచి వాలి టేబుల్ పై పుస్తకాన్ని, పెన్నుని***
***ఇంకు స్టాండుని మంత్రించే సూర్యకిరణం ఖరీదెంత!***
***ఎంత డబ్బు పెడితే దొరుకుతుంది.***

సూర్యకిరణాలు, చందమామలు, సాయంత్రపు కలువలూ, పక్షుల కిలకిలలు, నదిలో నీడలు, గదిలో కాంతులు, ఆకాశపు దీపాలు, ఇవీ ఇస్మాయిల్ కవితాలోకపు డబ్బులు. వారి సతీమణిని మరో కవితలో వర్ణించిన తీరు చాలా హృద్యంగా ఉంటుంది.

***మా ఆవిడ ఒక చేత్తో ఆకాశాన్ని ఎత్తిపట్టుకొంటుంది***
***ఒక చేత్తో భూమిని బుజ్జగిస్తుంది.***
***ఒక పిట్ట చేత్తో కన్నీటి బీజాల్ని ఏరుకుంటుంది.***
***ఒక సెలయేటి చేత్తో బండల్ని నిమిరి ఓదారుస్తుంది......***

నా ఇల్లు, నా సంసారం అనుకుంటూ నిత్యం శ్రమించే ఇల్లాలిని ఇంతకన్నా గొప్పగా వర్ణించే వాక్యాలు తెలుగు సాహిత్యంలో లేవు అంటే అతిశయోక్తి కాదు.

ఇస్మాయిల్ తన పద్యాల్ని తెరుచుకొన్న పద్యాలు అన్నపుడు, మిగిలిన వారివి మూసుకొన్న పద్యాలా అంటూ తెలుగు సాహిత్యవిమర్శనా లోకంలో కొంత అలజడి రేగింది. అలా అన్నప్పుడు ఇస్మాయిల్ ఉద్దేశ్యం ఒక కవిత చదవగానే పాఠకుడు ఆ పద్యానికి కంటిన్యూ అవుతారనీ, అంటే అతను కవితను తనంతట తానుగా కొనసాగించుకొనే అవకాశం ఉంటుందని. అలాంటి "ఓపెన్ నెస్" ఈయన కవితలలో ఉండి పాఠకుల కల్పనా శక్తికి పని కల్పించటం ద్వారా అవి మరింతగా వారి హృదయంలోకి ఇంకటం జరుగుతుంది.

స్త్రీవాద కవిత్వాన్ని ఇస్మాయిల్ అహ్వానించలేదన్న అపవాదు వారిపై ఉంది. కానీ నిజానికి ఆయన ఉద్దేశ్యం కవిత్వం ప్రకృతిని ప్రతిబింబిస్తుందనీ, స్త్రీ ప్రకృతికి దగ్గర కనుక వారికి కవిత్వం వ్రాసే అవసరం రాకపోవచ్చుననీ మాత్రమే అన్నారు. ఆ తరువాత వచ్చిన స్త్రీవాద కవిత్వాన్ని చూసిన ఆయన, కవిత్వం అనేది అంతర్గతకల్లోలాల వల్ల జనిస్తుంది, ఈనాడు స్త్రీలకు కూడా ఈ మానసిక అశాంతి తప్పటం లేదన్న మాట అని అభిప్రాయ పడ్డారు.

అతని ప్రతి కవితలోను ఒక మనోహరత్వాన్ని, ఒక హృదయరంజకత్వాన్ని అనుభవించాకనే నేను ఆయన మొదటి కావ్యాన్ని ప్రచురించాను - **సోమసుందర్**

తనకు పోటీగా ఎన్ని ప్రబల కవి సిద్ధాంతాలు ఉన్నా, తనదైన వాదాన్ని కడదాకా నిలిపిన గొప్ప కవి, కవిత్వాన్ని మానవతా ప్రబోధ సాధనంగా మహోన్నత శిఖరాలపై నిలిపాడు ఇస్మాయిల్ - సి.నా.రె

సాదీ మహాకవి ఒక మాటంటాడు " జ్ఞానవంతులకు పచ్చని చెట్టులోని ఒక్కొక్క ఆకు ఒకో దివ్యజ్ఞాన ప్రపంచంలాగ కనిపిస్తుందని" , నిజంగా ఈ మాటలకు నూటికి నూరు పాళ్లూ సరిపోయే తెలుగు కవి ఇస్మాయిల్ మాత్రమే **-శిఖామణి**

ఒక రుషిలాగ, సూఫీ కవిలాగ, ఒక హైకూగా ఇస్మాయిల్ బతికాడు. తెలుగు భాష ఉన్నంత వరకు సాహిత్య చరిత్ర

పుటల మీద పచ్చని సంతకంలా ఇస్మాయిల్ పది కాలాలు పదిలంగా ఉంటాడు **- ఎండ్లూరి సుధాకర్**

ఇస్మాయిల్ ఎందుకు విశిష్టకవి అయ్యారంటే, ఏ వ్యాసం ద్వారానో, విస్తృతమైన నవలద్వారానో, కథ ద్వారానో, వార్తా కథనం ద్వారానో చెప్పదగిన ఆవేశకావేషాలను, సిద్ధాంత చర్చలను, ఒక నిలువెత్తు పద్యంలా పోతపొయ్యటానికి ఆయనెప్పుడూ ప్రయత్నించలేదు **- ఇంద్రగంటి శ్రీకాంత శర్మ**

సాదా సీదాగా ఉండే ఇస్మాయిల్ కవిత్వానికి అంతశక్తి ఎక్కణ్ణించి వచ్చిందంటే 'నిబద్ధత లేకపోవడమే ఆయన కవిత్వ శక్తికి కారణం" అని ఆయన (అఫ్సర్ తండ్రిగారు) లెనిన్ అన్నమాటని గుర్తుచేసేవారు **- అఫ్సర్**

**ఆణిముత్యాలు** - ఇస్మాయిల్ వివిధ సందర్భాలలో వెలువరించిన అభిప్రాయాలు.

- క్షణక్షణం మనల్ని ప్రత్యక్షంగా తాకే అనుభవాలూ, వాటి స్పందనలూ, జీవితాన్ని జీవనపాత్రంగా మార్చే అనంతమైన అనుభూతులూ, ఇవి కాక కవిత్వానికేవీ అర్థం?

- అనుభూతి ఎప్పుడూ వైయక్తికమే. అనుభవ వస్తువు ఒకటైనా, ఎవరి అనుభూతి వారిది. అది ఎప్పుడూ కొత్తగా ఉంటుంది. ఒకరి అనుభూతిలా మరొకరి అనుభూతి ఉండదు. ఈ నవనవోన్మేషమైన అనుభూతిని ఆవిష్కరించటమే కవి కర్తవ్యం

- కవి అనుభవాల్ని తనలో ఇంకించుకుని, అంతర్దర్శి ఐననాడే మంచి కవిత్వం జనిస్తుంది.

- అనుభూతులు శబ్ద ప్రపంచానికి చెందినవి కావు. ఈ నిశ్శబ్దాన్ని శబ్దంలోకి ప్రవేశపెట్టటమే కవిత్వం విశిష్ట లక్షణం. కవిత్వానికి శబ్దమెంత ముఖ్యమో నిశ్శబ్దం కూడా అంతే.

- పదచిత్రమనేది ఐంద్రియకం (*sensuous*). ఇంద్రియ జ్ఞానాన్ని ప్రేరేపిస్తుంది. హేతుబుద్ధికి సంబంధించింది కాదు. లోతైన అనుభూతుల్నీ(*feelings*), భావాల్నీ(*emotions*) ఆవాహించే శక్తి పదచిత్రానికుంది.

- లేబిల్స్ ఉపయోగించడం నాకిష్టం లేదు. అందుకనే నా కవిత్వానికి పేరు పెట్టనీయలేదు

- ప్రస్తుతం తయారవుతున్న కవిత్వాన్ని రెండు రకాలుగా విశాలంగా వర్గీకరించవచ్చు ననుకుంటాను. ***poetry of ideas*** (అభిప్రాయ కవిత్వం), ***poetry of experience*** (అనుభవ కవిత్వం).

- మినీ కవిత్వం రాస్తున్న యువకవులు చమత్కారమే కవిత్వం అనుకుంటున్నారు. చమత్కారం వేరు, కవిత్వం వేరు.

- కవిత్వం వల్ల కొంపలు కాల్తాయి. విప్లవాలు వస్తాయి అని మీరనుకున్నట్టయితే నిరాశ కోసం సిద్ధపడండి. అది చేసే పనల్లా చదువరి మనస్సులో దీపం వెలిగించడమే. దీని వల్ల అతని అవగాహన పరిధి విస్తరిస్తుంది. తన మనస్సులో వెలిగిన దీపం వెలుతురు తన దారి తను వెతుక్కోవడానికి సహాయపడుతుంది. ఫలానా దారినే నడవమని ఒకరు చెబితే వినడు మనిషి. అది తనకు తోచాలి. తన దారేదో తను నిర్ణయించుకోవాలి. ఈ నిర్ణయానికి కవిత్వం తోడ్పడుతుంది.

- బ్రహ్మాండం బద్దలయ్యే సంఘటనలకి బ్రహ్మాండం బద్ధలయే కవిత్వం పుడ్తుందని ఆశించడం అమాయకత్వం.

- కవిత్వం హృదయ సంబంధి. ఆలోచనా వ్యవస్థ బుద్ధికి సంబంధించినది. కవిత్వాన్ని బుద్ధి *(Reason)* శాసించలేదు. దాని సామ్రాజ్యమే వేరు.

- కవిత్వమనేది కవి సంపూర్ణ అస్తిత్వంలోంచి ఉద్భవిస్తుంది. నేను బ్రాహ్మణుణ్ణి, లేదా దళితుడిని అని జీవితాన్ని కుంచింపజేసుకున్నవాడు కవిత్వమేం రాయగలడు?

- జీవిత మహోత్సవంలోని అద్భుతాన్ని ఆవిష్కరించడమే కవిత్వం పని. ఈ విధంగా మన చేతనని సుసంపన్నం చేస్తుంది కవిత్వం.

**ఇస్మాయిల్ రచనలు**

1. చెట్టు నా ఆదర్శం 2. మృత్యువృక్షం 3. చిలకలు వాలిన చెట్టు 4. రాత్రి వచ్చిన రహస్యపు వాన 5. బాల్చీలో చంద్రోదయం 6. కప్పల నిశ్శబ్దం 7. రెండో ప్రతిపాదన (అనుసృష్టి) 8. కరుణ ముఖ్యం 9. కవిత్వంలో నిశ్శబ్దం (ఒక వ్యాసం) 10. పల్లెలో మా పాత ఇల్లు (రివ్యూ)

చివరి మూడు రచనలలో, మొదటి రెండూ సాహితీ విమర్శనా వ్యాస సంపుటులు, చివరది ఆయన మరణానంతరం, అభిమానులు వెలువరించిన కవితాసంకలనం.

**నేను ఇస్మాయిల్ గారితో**

అప్పుడు నేను పి.జి. విద్యార్థిని. కవిత్వం అంటే తిలక్, ఇస్మాయిల్, శిఖామణి, చలం అని అనుకొనే రోజులవి. అప్పటికి అచ్చయిన నా కొన్ని కవితలను ఇస్మాయిల్ గారికి చూపించాలని నా తాపత్రయం. మిత్రుని ద్వారా ఓ రోజు ఆయనకు పరిచయం చేయించుకొన్నాను. పసుపు పచ్చని దేహచ్ఛాయ, ఎత్తైన విగ్రహం, సన్నని స్వరం, రంగులు చిమ్మే సాదా దుస్తులతో ఆయనను చూడగానే కవిత్వంతో నిండిన గౌరవం కలిగింది. కుశలప్రశ్నలయ్యాకా నా కవితల గురించి

# చిగురించే కాలం కోసం....

- పి. గోపీనాథ్
9440572989



ఇది ఉసురు తీస్తున్న శిశిరం
వసంతాన్ని మేల్కొలిపే ఉద్యమానికి ఇది సమయం
రాలిపడుతున్న కలలన్నీ తిరిగి చిగిర్చి
పచ్చని పిడికిళ్ళెత్తిన పూలు పూయాలి
ప్రశ్నలపై పరిహాసం... నిజాలపై నిర్బంధం
నిరంకుశంగా రుద్ధబడుతున్న నిశ్శబ్దంలో
బతుకులు విరిగిపడుతున్న నిర్వేద శబ్దం

బీడుపడ్డ పొలాల గట్టునా
చతికిలబడ్డ సంసారాల్లో
చదువుల కారాగారాల్లోనూ
కుప్పలుగా కూలుతున్న దేహాలపై ముసిరే
ఈగల గుంపు రెక్కలపై కూడా....
చప్పుడు చెయ్యొద్దని హుకుం జారీ !!
కళ్ళ ముంగిటి వేదనను
నిజం నీడన మొలకెత్తించే ఆలోచనలన్నీ
గాయాలైన కలాలై.... రక్తసిక్తమవుతున్నది కాలం

రద్దు... పన్ను... ఆర్థిక సూత్రం
పెద్దల భోషాణానికి కావలి కుక్క
సామాన్యుడి కష్టార్జితం
ఖజానా భారం మోసే కన్నీటి చుక్క

ముష్కరత్వానికి దేశభక్తి ముసుగు
మతోన్మాదానికి నెత్తుటి మంటల పండుగ
నలుపూ తెలుపూ దాగుడుమూతలాటతో
అధికారం సాగిస్తున్నది 'అచ్చేదిన్' ఆకాశయానం

ఈ దారుణాల కాలాన్ని మార్చాలంటే...
కష్టాల అవరోధాలపై కవాతు చెయ్యాలి
కమ్ముకొస్తున్న శత్రువును జయించాలంటే....
మూలాలను మట్టుపెట్టే యుద్ధం చెయ్యాలి
కాగుతున్న కన్నీళ్ళతో పోరాట దివిటీలు ముట్టించే
వసంతోద్యమ చైతన్యం మన గుండెల్లో ఉదయించాలి !! ♦

---

ఆయనన్న మాటలు ఇప్పటికీ నాకు గుర్తే. "నీ కవిత్వంలో స్పార్క్ ఉంది. ఆవేశాన్ని పదాలలోకి ఒంపేప్పుడు తేలికైన పదాల్ని ఎంచుకోవాలి. భావాన్ని మరింత క్లుప్తంగా చెప్పగలగాలి" అన్నారు. ఇది జరిగి సుమారు పదిహేను సంవత్సరాలు అయ్యింది. ఇప్పటిదాకా వ్రాసిన నా కవితలను తరచి చూసుకొంటే క్లుప్తత, పదాల ఎంపిక విషయంలో ఆయన పరిశీలన ఎంతటి సూక్ష్మమో తెలుస్తూంటుంది.

చాలా కాలం కవిత్వానికి దూరంగా ఉండటం వలన, ఆయనను కలుసుకోవటం అదే మొదలు మరియు చివరు అయ్యింది నాకు.

***కీర్తి శేషుడైన కవి/కాలతీరాన/కాసేపు పచార్లు చేసి/ గులకరాయొకటి/గిరవాటేసి/తిరిగి వెళ్లిపోయాడు***

అన్న ఆయన కవితావాక్యాలలోని కవి ఎవరనేది ఇన్నాళ్లకు అర్థం అయ్యింది. ఆయన ఎవరో కాదు ఇస్మాయిల్. చెట్టు నా ఆదర్శం అని ప్రకటించుకొన్న ఇస్మాయిల్ కవిత్వం తెలుగు సాహిత్య చరిత్రలో చిరస్థాయిగా నిలుస్తుంది

కవిగా, విమర్శకునిగా ఇస్మాయిల్ పోషించిన పాత్ర తెలుగు సాహితీవనంలో నిలువెత్తు పొగడచెట్టై పరిమళాలు చిందిస్తూనే ఉంటుంది. ఆయన రచించినవి పదిపుస్తకాలే కావొచ్చు, అన్నీ కలిపి ఓ మూడు, నాలుగొందల పేజీల సారస్వతమే అవ్వొచ్చు, కానీ వాటి ముద్ర మాత్రం తెలుగు సాహిత్యంపై ఏనాటికీ చెరగనిది.

ఆయన సాహిత్య శకటాన్ని ఎక్కడ ఆపారో దాన్ని అక్కడి నుండి కొనసాగించటం తదుపరి కర్తవ్యం, భుజానికెత్తుకోవలసిన ఇంకొక పని - ఆయన ఎంతో ప్రేమతో, ఓపికతో నెరవేర్చినదే - ఎందరో సదా బాలకుల రాకకు అనుకూలంగా దారిని సుగమం చేయటం - అన్న తమ్మినేని యదుకుల భూషణ్ మాటలు స్మరించుకొందాం. ♦



# నవ వారసత్వం

జంధ్యాల రఘుబాబు
9849753298

ఉదయాన్నే అందరూ జీవితమనే పరుగును అందుకునేందుకు, ఇతరులను దాటేసేటందుకు సిద్ధమవుతున్నారు. క్రితం రాత్రి నిద్ర ఇచ్చిన విశ్రాంతి, మన:శాంతి మెల్ల మెల్లగా మేఘాల్లా పక్కకుపోయి జీవితమనే సూర్యుడికి దారినిస్తున్నట్టు, ఆ వెలుగులకు తామెందుకడ్డు అనుకున్నట్టు పక్కకు తొలిగిపోతున్నాయనిపిస్తుంది.

ఆ సూర్యకిరణాలు తేడాలేకుండా అందరిమీద పడ్డట్టు ఆ ఇంట్లోనూ చొరబడ్డాయి. వాటితో ఏమాత్రం పనిలేనట్టు, తాను సూర్యుడికంటే ముందే లేచే ఆ ఇంటి ఇల్లాలు నిర్మల పనులు చేసుకుంటూ పోతోంది. అయితే రోజులా కాకుండా కొంత ప్రత్యేకంగా శ్రద్ధపెట్టి ఇంటిని శుభ్రపరుస్తున్నట్టుంది. పనమ్మాయికి సలహాలిస్తూనే తానే దగ్గర ఉండి చూస్తోంది. జర్మనీ నుండి వచ్చిన కొడుకు, పూణె నుండి వచ్చిన కూతురు, అల్లుడు, మనవరాలు ఇంకా నిద్రలోనే ఉన్నారు. జెట్ ల్యాగ్, ప్రయాణపు అలసట ఏదైతేనేం వారింకా లేవలేదన్నది నిజం. భర్త రాఘవాచారి ఉదయాన్నే వాకింగుకు పోయాడు. ఈ రోజైనా త్వరగా రండని చెప్పి మరీ పంపించింది. తానెటూ సెలవు పెట్టింది. ఆమె హడావుడి చూసినవారికి పండుగ కాని, ఇంట్లో ఏదన్నా వేడుక గాని ఉందనిపిస్తోంది. పిల్లలొచ్చారని వారుండే రెండురోజులు ఎటువంటి ఇబ్బంది కలుగకూడదని కొన్ని పనులు చేస్తోందని చూసినవారెవరైనా అనుకోవచ్చు. కాని అవేవీ కారణాలు కావు. అరవై ఏళ్ళు ఆంగ్ల అధ్యాపకుడిగా పనిచేసిన భర్త పదవీ విరమణ చేస్తున్న రోజది. అందుకే ఆమె పనులు ప్రత్యేకంగా కనిపిస్తున్నాయి ఆ రోజు.

రాఘవాచారి ఇంగ్లీషు అధ్యాపకుడిగా ముప్పై నాలుగేండ్లు పనిచేశాడు. తొమ్మిదేండ్లు జూనియర్ కాలేజీలో చెప్పి ఆపై డిగ్రీ కాలేజీకి పదోన్నతిపై వచ్చాడు. పాతికేళ్ళపాటు డిగ్రీ విద్యార్థుల జీవితాలెన్నింటినో తన తరగతిగదిలో తీర్చి దిద్దాడు. తనదగ్గర చదువుకున్నవారిలో ఒకరిద్దరు తనలాగే ఇంగ్లీషు అధ్యాపకులయ్యారు. సివిల్ సర్వీసులో పాసై మంచి అధికారులైన వారు, ఇన్సూరెన్సు, బ్యాంకు, రైల్వేల్లో అధికారులు, క్లర్కులు అయినవాళ్ళూ ఉన్నారు. ఏమైనా ఆయన క్లాసు చెబుతుంటే శ్రద్ధగా విన్నవారు తాము అంతకుముందు జీవించినట్టు తరువాత జీవించలేదు, అంతకుముందు ఆలోచించినట్టు ఆలోచించనూ లేదు. అది ఆయన ప్రత్యేకత. ఆయన క్లాసు విని వెళ్ళారంటే ఏదో ఒకటి నేర్చుకున్నట్టే లెక్క. జీవితాన్ని, జీవిత గమ్యాన్ని, జీవిత సాఫల్యాన్ని, ఏ పుస్తకంలోనూ చెప్పని రీతిలో చెబుతాడాయన.

పేరుకు ఆంగ్లోపాధ్యాయుడైనా ఆయన క్లాసులో తెలుగు సాహిత్యం వచ్చేస్తుంది. తెలుగు కవులు వచ్చి సందడిచేస్తూ

పోతారు. ఆయన చెబుతుంటే వినేవారందరికీ తెలుసు శ్రీశ్రీ విషయం కాని, కవిత కాని చెప్పని క్లాసు ఉండదని. సోమర్సెట్ మామ్ అయినా, వర్డ్స్‌వర్త్ అయినాసరే వారి పాఠాన్ని చెప్పేటప్పుడు ఎంత మోతాదులో కవితాత్మకంగా చెబుతాడో అంతే మోతాదులో శ్రీశ్రీ వస్తాడు ఆ క్లాసుకు. ఆయన చెబుతున్న క్రమంలో ఎక్కడా స్పృహతో అలా జరుగుతుందని ఆయనతో పాటు ఎవ్వరూ అనుకోరు. అది అసంకల్పితం. వినేవారికి ఎటువంటి విసుగు, అసహనం కలగకుండా అదో సాధారణ విషయంలా జరిగిపోతుందంతే. ఇక ఇంగ్లీషు కవుల గురించి చెప్పేటప్పుడు వారి పాఠ్యభాగాలతో పాటు ఇతర రచనలు, జీవితం గురించి చెబితే ఆయనే చెప్పాలి అనిపిస్తుంది విన్నవారికి. వారిపై గ్రీకు, లాటిన్, ఫ్రెంచి కవుల ప్రభావాన్ని కూడా సున్నితంగా చెబుతారు. అవన్నీ కూడా తన విద్యార్థుల జీవితాలకు దిశా నిర్దేశం చేయటానికే. ఇక కర్నూలులోని అన్ని సాహిత్య సంఘాలు ఆయన అనుభవాన్ని, సామర్థ్యాన్ని ఎప్పుడో ఒకప్పుడు ఉపయోగించుకున్నవే. సాహిత్యం గురించి ఏమాత్రం అవగాహన ఉన్నవారికైనా ఆయన తెలిసే ఉంటాడు. సాహిత్యంలో స్థాయితో పాటు మంచితనం, పెద్దరికం కలబోత అయన.

భార్యమాటకు విలువనిచ్చేవాడే కాబట్టి మార్నింగ్ వాక్ తొందరగా ముగించుకొచ్చాడు. నడక తరువాత వేసే బాతాఖానికి నిలవకుండా మిత్రులకు చెప్పి వచ్చాడు. మరుసటిరోజునుండి ఎంతసేపైనా ఉందాంలే కాలేజీకి పోవలసిన పనిలేదు కదా అని చెప్పి వారిని ఆహ్వానించి మరీ వచ్చాడు. త్వరగా ఇంటికొచ్చిన ఆయనను భార్య ప్రశంసించింది. త్వరగా తయారవమని కాలేజీకి ఎప్పుడూ ఆలశ్యంగా వెళ్ళని ఆయనకే చెప్పింది. చిన్నపిల్లల పుట్టినరోజు ఇంట్లో అందరూ ప్రత్యేకంగా ఎలా చూస్తారో తననీ అలా చూస్తోందని నవ్వుకున్నాడాయన. భార్యాభర్తల పోట్లాటలకంటే వీరి అన్యోన్యతనే ఎక్కువగా చూస్తుంటారు బయటివారు.

“నేను చెప్పింది ఆలోచించావా” కాఫీ తాగుతూ అడిగాడు

“ఏదీ ఆ పంపకాల విషయమేనా”

“అవును”

“అప్పుడే ఏం మించిపోయిందని? కొద్దిగా సమయం తీసుకుందాం లెండి”

“అలా వీలుకాదని చెబుతూనే ఉన్నానా. ఈరోజే దాని గురించి నేను నిర్ణయం తీసుకోవాలి”

“అయితే మీరు చెప్పిందే బాగుందిలెండి, అలాగే చేద్దురు”

నిర్ణయం బాగా ఉన్నప్పుడు తన భార్య నిర్మల ఎటువంటి అనుమానం లేకుండా బలపరుస్తుందని ఆయన నమ్మకమే కాదు అనుభవం కూడా.

రోజులాగానే తయారై కాలేజీకి పోతుంటే భార్య చెయ్యి ఊపి సాగనంపింది. బడికిపోతున్న పిల్లల్ని చూసినంత మురిపెంగానూ చూసింది. మధ్యాహ్నం భోజనానికి వచ్చి అందరినీ తయారై నాలుగుకంతా రమ్మన్నాడు. కూతురు, అల్లుడు, కొడుకు, మనవలతో భోజనాలప్పుడు తమ చిన్నప్పటి స్కూలు విషయాలు గుర్తు చేసుకున్నారు పిల్లలు. నాన్న సైకిల్లో విడిచిపెట్టటం, వెనుక క్యారియర్ పై కూచోవటానికి పోటీ పడటం లాంటివన్నీ చెప్పుకుని నవ్వుకున్నారు. భోజనం ముగించి స్కూటీలో బయలుదేరాడు. తాము తెచ్చిన బహుమతులు అప్పుడే ఆయనకిచ్చారు. సెల్ఫీలు దిగారు. ఉన్న కొద్ది సమయంలోనే మనవల్ని ముద్దాడి హాయిగా కాలేజీకి బయలుదేరాడు. ఈ రోజే రిటైర్ ఔవుతున్నానన్న ఫీలింగు ఆయనలో లేనే లేదు. జీవితంలో ఒక సైనికుడిగా ఒకదాని తరువాత ఒకటిగా పనులు చేసుకుంటూ పోవటమే ఆయన పని. అందుకే ఆయన మొహంలో తరువాత ఏం చేయాలి అన్న ఆలోచన స్పష్టంగా ఉన్నట్టుంది. పదవీ విరమణ తరువాత తన సమయం ఎలా గడపాలో ముందే నిర్ణయించుకుంటే తరువాతి కాలం సాఫీగా సాగిపోతుందని ఆయన ఎందరికో చెబుతాడు. తానూ ఆచరించే విషయంలో ఎటువంటి అస్పష్టతా లేదాయనలో.

ఆయన కాలేజీకి పోయాక పిల్లలు తాతయ్య గ్రంథాలయాన్ని చూస్తామని పట్టు పట్టారు. అమ్మ నాన్న ఎప్పుడూ ఎంతో ఆసక్తిగా చెప్పుకునే ఆ లైబ్రరీని చూడాలన్న కోరిక చాలా కాలంగా ఉంది వారిలో. కాలేజీకి పోయేలోపు పుస్తకాలన్నీ చూసి వచ్చారు. అందులో పిల్లల కథలూ చూశారు. ఇంగ్లీషు పుస్తకాలూ చూశారు. సైన్సు, భూగోళం ఒకటేమిటి తాతయ్యకు ఇష్టమైన సబ్జెక్టులు ఇన్ని ఉన్నాయా అని ఆశ్చర్యపోయారు. ఒక ఇంగ్లీషు లెక్చరరు దగ్గర ఇన్ని రకాల పుస్తకాలుండటం వాళ్ళకు ఆశ్చర్యాన్ని కాక ఇంకేం కలిగిస్తాయి!

ఈ రిటైర్మెంటు సభకు పూర్వ విద్యార్థులెందరో వచ్చారు. ఆదాయపుపన్ను శాఖలో పెద్ద అధికారి సలీం, ఆంధ్రా బ్యాంకు జోనల్ మేనేజరు జేమ్స్, ఇన్సూరెన్సు బ్రాంచి మేనేజరు మహేష్, ఆర్టీసీలో పనిచేసే రఘు, ఎం.ఆర్.ఓ హుస్సేన్ ఇలా ఎందరో వస్తూనే ఉన్నారు. ఈ ఐదుగురు తమ ప్రియతమ మాస్టారు ప్రభావం వల్ల కవులు, రచయితలుగా మారి ఇప్పటికే రాష్ట్రంలో పేరు తెచ్చుకున్నవారు. అందరూ తమ ప్రియతమ ఉపాధ్యాయుడు ఆ తరువాత అధ్యాపకుడు అన్నిటికీ మించి

తమ జీవితాల్ని సరిదిద్దినవాడు, గమ్యం చూపినవాడు రాఘవాచారి మాష్టారు గురించిన కబుర్లు చెప్పుకున్నారు. తమను ఎంతగానో మెచ్చుకున్న సందర్భాలను మననం చేసుకున్నారు. సెల్లుల్లో వస్తున్న మెస్సేజీలను చూడకుండా ఎప్పుడో కానీ రాని అలాంటి వాతావరణాన్ని ఆస్వాదిస్తున్నారు.

కళాశాలలోని మీటింగు హాల్ చాలదని ముందే ఊహించిన సిబ్బంది గ్రౌండ్‌లో షామియానాలు, కుర్చీలు వేయించారు. అనుకున్నట్టే అక్కడి వాతావరణం ఓ పండుగను తలపించేలా తయారైంది. అందరూ ఒకరినొకరు పలకరించుకుంటున్నారు. రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలనుండి కవులెందరో వచ్చారు. ఆ రోజు తమ పదవీ విరమణ ఉన్నవారు తప్ప అంతకు ముందు ఈయనతో పనిచేసిన ఉపాధ్యాయులు, అధ్యాపకులు, సిబ్బంది ఎందరో వచ్చారు. సభ మొదలైంది. భార్యాభర్తలిద్దరినీ స్టేజీపైన కూచోబెట్టారు. వారి పిల్లలు, మనవలు ముందువరసలో కూచున్నారు. యూనివర్సిటీ సంచాలకుడు ముఖ్య అతిధిగా వచ్చాడు. నలుగురు ప్రముఖ కవులను కూడా పైన కూచోబెట్టారు.

ముఖ్య అతిథితో పాటు మిగతా అతిధులు, కొందరు పూర్వ విద్యార్థులు, కొలీగ్స్ ఒక్కొక్కరూ ఆయనతో తమ అనుభవాల్ని పంచుకున్నారు. ఆయన ప్రత్యేకతను వివరిస్తున్నారు. నిర్మల చేత కూడా మాట్లాడించారు.

ఇక ఆయన వంతు వచ్చింది. మామూలుగానే లేచాడాయన. గొంతు సర్దుకుని అందరికీ ధన్యవాదాలు చెప్పి తాను టీచరుగా, లెక్చరరుగా పనిచేసిన రోజుల్లోని అనుభవాలు కొన్నింటిని పంచుకున్నాడు. ఇక ఒక విషయం చెబుతాను అని మొహం గంభీరంగా పెట్టి "ఇన్నిరోజులు నా వ్యక్తిగత జీవితాన్ని, ఉద్యోగ జీవితాన్ని, సాంఘిక జీవితాన్ని పంచుకున్నవాళ్ళు ఇక్కడ చాలామంది ఉన్నారు. పదవీవిరమణ తరువాత కూడా వీళ్ళందరూ నాతోనే ఉంటారు. నాకొచ్చే డబ్బు, ఆస్తులు నా పిల్లలకు ఎటూ ఇస్తాను, వాళ్ళు దానిమీద ఆధారపడిందీ లేదు. కాని తండ్రిగా నాబాధ్యత నేను చేయాలి కదా. కొంత మొత్తం సేవా కార్యక్రమాలకు, సాహిత్య కార్యక్రమాలకు ఉపయోగిస్తాను".

కొద్దిగా నీళ్ళు తాగి మళ్ళీ మొదలు పెట్టాడు "సమస్య అనను కాని ఒక ఆలోచన నన్ను చాలా రోజులుగా వేధిస్తోంది. ఆ విషయంలో ఏం చేయాలి అన్న సందేహం, ఫలానా విధంగా చేయాలన్న కోరిక ఒకవైపు, పట్టుదల ఒకవైపు కొనసాగుతూ ఉన్నాయి. నా భార్య నిర్మలతో నిత్యం దీని గురించి చర్చించాను కూడా. ఆమె సూచనలు, సలహాలు నాకు ఎంతో సంతోషాన్ని, ధైర్యాన్ని ఇచ్చాయి" అని ఆమె వైపు చూశాడు. సభ మొత్తం చప్పట్లు.

"ఆ మధ్య ఎక్కడో చదివాను ఆస్తులకు వారసులుంటారు కాని పుస్తకాలకు ఉండరు అని. అందులో కొంత నిజం లేకపోలేదు, అలా అని అదే పూర్తి సత్యం కాదు. నా పిల్లలకు పుస్తకాలపైన మోజు ఏర్పడలేదు. దానికి వారిని నిందించటం మూర్ఖత్వమే అవుతుంది. ఎవరి ఇష్టాలు వాళ్ళవి. అందులో వారు స్వతంత్రులు. ఇక నా పుస్తకాలు నా ఆస్తిలోనూ భాగమే. అవేం చేయాలి. పదవీ విరమణ తరువాత చదువుకోవచ్చు. అన్నీ ఎల్లవేళలా చదవలేను, అన్నీ చదవలేను. అందుకే కొన్ని నాతో అట్టిపెట్టుకుంటాను. మరి మిగతావి ఏం చేయాలి? పుస్తకాలన్నీ గ్రంధాలయాలకు ఇవ్వమన్నారు కొందరు శ్రేయోభిలాషులు. నిజమే. కొన్ని అక్కడే ఉంచుతాను. మరి మిగిలినవేం చేయాలి? పుస్తక ప్రియులను ఎందరినో చూశాను. వారూ నాలాగే సతమతమయ్యారు. నాతో పాటు వారందరికీ కూడా పనికొచ్చే ఆలోచన ఏదైనా చేయాలనిపించింది. నా సాహిత్య జీవితంలో నాతో ఉండి, నా తరువాత సాహిత్యరంగంలో నా వారసులుగా తయారైన సలీం, జేమ్స్, మహేష్, రఘు, హుస్సేన్ ముఖ్యంగా ఉన్నారు. ఊరకే నా వారసులు అనుకోకుండా నా గ్రంథాలయంలోని పుస్తకాల్ని వీరికి ఇవ్వాలనుకున్నాను. అదే నేను వారికిచ్చే సాహిత్య సంపద. ఒక విధంగా వారసత్వ సంపద. ఎవరికి ఏ పుస్తకాలు ఇచ్చానన్నది డైరీలో రాసిపెట్టుకుంటాను. అవసరమైనప్పుడు వారిదగ్గరికిపోయి చదువుకుంటాను. మా పిల్లల ఇళ్ళకు ఎలా వెళతామో వీళ్ళ ఇండ్లకూ వెళతాము. ఈ విధంగా మా వృద్ధాప్యంలో కొత్తవారసులుగా వీళ్ళుంటారు. జీవితంలో ఎన్నో ఒడిదుడుకులు చూసే ఉంటారందరూ. కానీ కొన్నిసార్లు ఎటూ తేల్చుకోలేని, నిర్ణయం తీసుకోలేని విషయాలు ఎదురౌతుంటాయి. అలాంటి వాటిల్లో ఇదీ ఒకటి. ఇదేం పెద్ద సమస్య అని కొందరనుకోవచ్చు. పాత పుస్తకాలవాడికి వేసేస్తే సరిపోతుంది కదా అనుకోవచ్చు. అవన్నీ నా గురించి తెలియనివాళ్ళు మాట్లాడే మాటలు. తెలిసినవారికి నేను పెద్దగా చెప్పే అవసరం లేదు. ఒకవిధంగా ఈ నవ వారసత్వ ఆలోచన చేశాక నేను, నిర్మల ఎంతో సంతోషంగా ఉన్నాము. ముందున్న జీవితం సాఫీగా, హాయిగా కనిపిస్తోంది. ఆ అయిదుగురు వారసుల్ని మీకందరికి పరిచయం చేస్తాను"

సభా ప్రాంగణమంతా చప్పట్లు. ఆ ఐదుగురూ కళ్ళనిండా నీళ్ళతో లేచి చేతులు జోడించి నిలబడ్డారు. ♦

## కొలమానాలు

- జానూ సురేష్
9966861565

చల్లని వెన్నెలపై గాఢాంధకారం పరుస్తామంటే
ఎవరు సరేనంటారు
తెల్లని పాలపై బురద చల్లుతావుంటే
ఎవరైతే ఒప్పుకుంటారు

లోకమంతా ఆకాశానికెత్తేసిన సౌందర్యం
అందవిహీనంగా కనిపిస్తోందంటే
వాణ్ణి అంధుడనికాక ఇంకేమంటారు?
విలువైన వస్తువు మనదేనని తెలిశాక్కూడా
ముక్కలు చేయడానికి పూనుకునేవాడిని
మూర్ఖుడని కాక మరేమంటారు?
గతాన్ని సైతం మత కొలమానాలతో కొలవడం
వైపరీత్యం కాక ఇంకేమిటి?



సన్యాసులంతా ఏకమై
దేశంపై గుత్తాధిపత్యం కోసం వెంపర్లాడుతున్నచోట
మహల్ ల కింద కూడా
మహాలయాలు ఉద్భవిస్తాయి
మతం మత్తు మందు
కుళ్ళిన కులం తాలూకు రసాయనాలు
మెదడులోకి నెమ్మదిగా ఇంజెక్ట్ అవుతున్నచోట

ప్రపంచ మేధావులు సైతం
పనికిరానివారిగానే కనిపిస్తారు

ఒకప్పుడు
మతపిచ్చిని మూకుమ్మడిగా నెత్తినేసుకొని
మనుషుల్ని సమాధుల పాలు చేసి
ఇప్పుడేమో
సమాధుల్లోని శవాలను కూడా
పెకలించే ప్రయత్నం షురూ చేస్తున్నారు
అయినా
అందమైన కట్టడంపైకి
ఒంటికాలిమీద వస్తోంటే
ఎవరు మాత్రం ఎందుకు ఊరకుంటారు
అది ఆగ్రా అయితేనేం........
అమీర్ పేట అయితేనేం .....

---

## నా కవిత్వం

- పద్మావతి రాంభక్త
9966307777

పక్వానికొచ్చిన పండు చెట్టునుండి రాలిపడినట్టు
బాధను మోయలేని మది నుండి నేను దుఃఖవాక్యాన్నై
తెగిపడతాను
రెక్కలొచ్చిన పక్షి మొదటిసారి నింగిలోకి ఎగసినట్టు
ఆనందాన్ని తాళలేని నేను పదాల కొమ్మలపై
చక్కని భావసుమాలను విరబూయిస్తాను
నాటిన విత్తులో నుండి చిన్నారి మొలక తలెత్తినట్టు
ఆలోచనల తాకిడికి నేను
మనోఫలకపు పలకపై అందమైన అక్షరాలు దిద్దుతాను
చీకటి తెరలను చీల్చడానికి భానుడు కిరణాలతో యుద్ధం
ప్రకటించినట్టు
సామాజిక సమస్యలపై నేను కలాన్ని కత్తిగా దూస్తాను
గుక్కపెట్టిన పసిపాపను పరుగు పరుగున వచ్చిన అమ్మ
ప్రేమతో ఎత్తుకున్నట్టు



మనసు అలజడితో అల్లకల్లోలమైనపుడు
నేను పుస్తకాన్ని ఆత్మీయంగా గుండెలకు హత్తుకుంటాను
నా ముఖం నా మనసుకు ప్రతిబింబం
నా వాక్యం నా మానసిక స్థితికి సంకేతం
నా అనుభూతి నా భావోద్వేగాలకు నిదర్శనం
మొత్తంగా నా జీవిత కాలపు అనుభవమే
నాలో పోటెత్తే కవితాసంద్రం



# నా రచనా శైలిని మార్చుకున్నాను

- పెరుమాళ్ మురుగన్

■ ***2015 లో మీ నవల వివాదాస్పద రచన తర్వాత పూనాచి( ఒక నల్ల మేక కథ) మీ మొదటి నవల. మరలా మీరు కలం చేతబట్టేట్లు చేసిందేమిటి?***

నేనెప్పుడూ వ్రాయటం ఆపలేదు. వివాదం జరిగిన కొన్ని నెలల తర్వాత ఒక రోజు నేను ఒక కవిత వ్రాశాను. ఆ తర్వాత మరి కొన్ని వ్రాశాను. వాటిలో ఏ ఒక్కటీ ముద్రించే ఉద్దేశ్యం నాకు లేదు. నా చుట్టూ జరుగుతున్న గొడవ నుండి నా ఆలోచనను మరల్చటానికి, నన్ను నేను ప్రశాంతంగా ఉంచుకోవటానికి నా భావ ప్రకటనా మాధ్యమంగా నేను రచనను కొనసాగించవలసి వచ్చింది. రచన నాకు స్వయంగా అలవడింది అందుకే దానినుండి నేనెన్నడూ దూరంగా ఉండలేనని అర్థంచేసుకున్నాను.

■ ***మీ నవల ఆడ మేక యొక్క జీవితాన్ని పుట్టుక నుండి మరణం వరకు - ఆవిష్కరించింది. దేశం లోని ప్రస్తుత రాజకీయ వాతావరణాన్ని పరిగణనలోనికి తీసుకొని ఉద్దేశ్యపూర్వకంగానే మీరు ఈ నవలా ఇతివృత్తాన్ని జంతువు మీద కేంద్రీకరించారా?***

అవును, మీరు అలాగే అనుకోవచ్చు. మారుతున్న పరిస్థితులకనుగుణమైన సాహితీ వస్తువులను ఉపయోగిస్తూ రచయితలు తాము చెప్పదలచుకున్న విషయాన్ని తమ రచనలలో ప్రతిబింబిస్తారు. ఉదా: లాటిన్ అమెరికాలో రచయితలు ప్రజా సమస్యలను సూటిగా వ్యక్తీకరించలేని ఒక సందర్భంలో Magical realism ను ఆశ్రయించారు. నా నవలలో నేను రాక్షస భూమిలో నివసించే జంతువుల గురించి వ్రాయాలని నిర్ణయించుకున్నాను. నాకు మనుషుల గురించి వ్రాయాలని లేదు. కాని ఈ మేక నేటి పరిస్థితులలో జీవిస్తుంది. నేను ప్రత్యక్షంగా ఏ సామాజిక అంశం మీద వ్యాఖ్యానించ లేకపోతున్నప్పుడు కథ ద్వారా అనేక విషయాలను చర్చించవచ్చు. చదువరి తనకు నచ్చిన విధంగా దానిని అన్వయించుకోవచ్చు. దానిని నేను నియంత్రించలేను.

■ ***మరొకసారి విద్వేషదాడిని నివారించటానికి మీరు చాలా ఎక్కువ జాగురూకతతో వున్నారా?***

అవును. నాకు నేనుగానే కొంతవరకు స్వీయ నిషేధాన్ని విధించుకోవటం ప్రారంభించాను. నాకు నచ్చిన విషయాన్ని ఎంపిక చేసుకొని యదార్థంగా చిత్రించటానికి నాకు స్వేచ్ఛ లేనప్పుడు నేను చాలా జాగ్రత్తగా వుండాలి. అందుకనే నేను నా రచనా శైలిని మార్చుకున్నాను. ఇంతకుముందు నా రచనలలో కులాలు, పట్టణాలు, బజార్ల పేర్లు యధాతథంగా ప్రస్తావించాను. కాని ఇకముందు అలా చేయబోవటం లేదు. ప్రజలు ఇంకా సమస్యలుగా గుర్తించని కొన్ని సామాజిక సమస్యల గురించి మాట్లాడటానికి తగిన మార్గాలను వెతుకుతున్నాను.

■ ***2015 లో మీరు బేషరతుగా క్షమాపణ చెప్పవలసి వచ్చింది. ఇటీవల సినీ నిర్మాత సంజయ్ లీలా బన్సాలీ తన***

## ప్రముఖ కథా రచయిత మునిపల్లె రాజు మృతి


16.03.1925 - 24.02.2018

తెలుగు కథను సుసంపన్నం చేసిన ప్రసిద్ధ కథకుడు మునిపల్లె రాజు (93) రచయిత, కవి, వ్యాసకారుడు. హైదరాబాద్‌లోని ఏఎస్‌రావు నగర్‌లోని స్వగృహంలో ఫిబ్రవరి 24న ఆయన కన్నుమూశారు. ఆయన స్వగ్రామం గుంటూరు జిల్లా పొన్నూరు మండలం, మునిపల్లె. ఆయన కాకమాను మండలం గరికపాడులో 1925, మార్చి 16న జన్మించారు. ఆయన తండ్రి హనుమంతరావు తల్లి శారదమ్మ. చిన్నప్పటి నుంచి కథా సాహిత్యంపై మక్కువ పెంచుకున్న మునిపల్లె రాజు 1943 నుండి 1983 వరకు భారత ప్రభుత్వ రక్షణ శాఖలోని ఇంజనీరింగ్ సర్వీసులో సర్వేయర్‌గా ఉద్యోగం చేశారు. ఆయన మొత్తం 69 కథలు రాశారు. 'అస్తిత్వనాదం ఆవలి తీరాన' 'దివోస్వప్నాలతో ముఖాముఖి' 'పుష్పాలు – ప్రేమికులు – పశువులు', 'మునిపల్లె రాజు' పేరుతో నాలుగు కథా సంపుటాలు వెలువరించారు. 'అలసిపోయినవాడి అరణ్యకాలు', 'వేరొక ఆకాశం వేరెన్నో నక్షత్రాలు' పేరుతో రెండు కవితా సంపుటాలు ప్రచురించారు. రచయితలు, కవుల మీద ఆయన రాసిన సాహిత్య వ్యాసాలు 'జర్నలిజంలో సృజనరాగాలు', 'సాహితీ మంత్రనగరిలో సుస్వరాలు' గా వెలువరించారు. ఆయన రాసిన 'పూజారి' నవలనే 'పూజాఫలం' పేరుతో సినిమాగా బి.ఎన్. రెడ్డి వెండితెరకు ఎక్కించారు. 'అస్తిత్వనాదం ఆవలి తీరాన' కథా సంకలనానికి ఆయన 2006లో కేంద్రసాహిత్య అకాడమీ అవార్డును అందుకున్నారు. అదే కథకు 2004లో పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురస్కారం వచ్చింది. ♦

***సినిమాలో మార్పులు చేయవలసిన స్థితికి నెట్టబడ్డాడు. ఈ రెండు కేసులలో కూడా న్యాయస్థానం కళాకారులకు అనుకూలంగా తీర్పునిచ్చింది, వీటిని మీరు విజయాలుగా చూస్తారా?***

వాటిని విజయాలుగా భావించాలో లేదో నాకు తెలియదు. ఈనాటి భారతదేశంలో న్యాయవ్యవస్థే మనకు ఒక ఆశగా వున్నది. ఉదా: నా కేసులో తీర్పు చట్టబద్ధమైన న్యాయపత్రం కన్నా ఎక్కువ. నేనైతే అది నేరుగా ఒక రచయితను తిరిగి వ్రాయమని అభ్యర్థించే ఒక సాహితీపాఠంగా భావించాను. ఒక రచయిత అణచివేతకు గురైనప్పుడు సహాయం కోసం అతనికి కోర్టు తప్ప ఆశ్రయించదగిన మరొక సంస్థ లేదు. అదే సందర్భంలో అసహనంతో వున్నా సమాజం యొక్క మానసిక స్థితిని కోర్టులు మార్చలేవు. ఈ రెండు ముఖ్యమైన వాస్తవాలు కూడా మనం విస్మరించలేనివి.

■ ***క్రొత్త పెరుమళ్ మురుగన్ బహిర్ముఖి. మీరు ఎక్కువ సాహితీ సభలలోను, ఉత్సవాలలోను కనబడుతున్నారు. ఇలాంటి మార్పు అవసరమని భావించారా?***

నేనెప్పుడూ దీనిని అనుకొని చేయలేదు. నా జీవితం ఈ దిశగా నన్ను లాగుతుంది. నేను ఏకాంతంలో వున్నప్పుడు నేను దానిని ఆస్వాదించాను. ఇప్పుడు దీనినీ ఆస్వాదిస్తున్నాను. ప్రతిరోజూ క్రొత్త పాఠకులు పెరగటం ప్రస్తుత సానుకూల పరిణామం. వివిధ జీవిత పార్శ్వాలకు చెందిన ముఖ్యమైన వ్యక్తులను కలుస్తున్నాను. నా పుస్తకాలు కూడా అనేక భాషలలోకి తర్జుమా అవుతున్నాయి. 'పునచి' 8 భారతీయ భాషలలోకి మరియు కొరియన్ లోకి తర్జుమా అవుతుంది. One part woman చెక్, జర్మన్, ఫ్రెంచ్ భాషలలోకి తర్జుమా అయ్యే ప్రక్రియలో వుంది. అన్నింటికంటే ముఖ్యంగా అమెరికాలోని అతి పెద్ద ముద్రణా సంస్థతో రెండు పుస్తకాలు అంతర్జాతీయ మార్కెట్లో ముద్రించటానికి ఒప్పందం కుదిరింది ఈ అవకాశం దక్కిన మొదటి తమిళ రచయిత.

■ ***మున్ముందు మీ ప్రయాణం ఏమిటి?***

నా తదుపరి నవలను పూర్తి చేశాను. ప్రస్తుతం నేను ఇప్పటి వరకు ఎవరు స్పృశించని అసహనం, భావ స్వేచ్ఛ, కుల దృక్కోణం లాంటి విషయాలను అధ్యయనం చేస్తున్నాను. క్రింది సామాజిక తరగతుల ప్రజలకు భావ స్వేచ్ఛ ఎలా నిరాకరించాబడుతుంది అని నా వాదన. ఇప్పటి వరకు ఆవిష్కరించబడని వివిధ పార్శ్వాల నుండి ఈ విషయాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించే వైపుగా ప్రస్తుత నా ప్రయాణం సాగుతున్నది.

**ఇంటర్వ్యూ: సుదీప్త సేన్‌గుప్తా, టైమ్స్ ఆఫ్ ఇండియా దినపత్రిక 16.02.2018. తెలుగు: అనంతలక్ష్మి** ♦

# జానపద విజ్ఞానంలో - పొడుపు కథలు



- ఆర్. సుజిత
9177110048

జానపద విజ్ఞానంలో ప్రత్యేక శాఖగా చెప్పుకోతగినంత వ్యాప్తి పొడుపు కథలకు ఉంది. జానపద కవిత్వం, గద్య కథ, సామెత వైవిధ్యం గల ప్రక్రియలైతే పొడుపు కథలో వాటన్నింటి కంటే ఎక్కువ ప్రత్యేకత ఉంది. పొడుపు కథల్ని జానపద సాహిత్యంలో భాగంగా చెప్పుకుంటున్నా ఇవి గణిత రూపంలో, చిత్ర రూపంలో కూడా ఉన్నాయి.

జానపద గేయ రూపంలో, సామెత రూపంలో, కథ రూపంలో కూడా పొడుపు కథలు ఉన్నాయి. మనిషికి విజ్ఞానాన్ని వినోదాన్ని పంచిపెట్టిన వాటిలో పొడుపు కథలు కూడా ఉన్నాయని చెప్పడంలో అతిశయోక్తి లేదు. ప్రయోజనాత్మక దృష్టితో ప్రపంచంలోని ప్రతిసమాజంలో పొడుపు కథలను ఉపయోగిస్తారు. నిత్య జీవితంలో ఇవి కూడా భాగమైపోయాయి. పొడుపు కథలకు జీవితమే మూలాధారం. మనిషి జీవితంలో వచ్చే సమస్యలను ఎదుర్కొని సమస్యకు చిక్కుముడిని ఎలా అయితే విప్పుతారో పొడుపు కథలను పరిశీలిస్తే అవగతం అవుతుంది. పొడుపు కథలకు ప్రేరణ మనిషి జీవితమే.

ఇంగ్లీషులో పొడుపు కథను "రిడిల్" అంటారు. దీనికి మూలమైన రీడన్ అనే పాత ఇంగ్లీషు పదానికి సలహాఇవ్వడం అని అర్థం "పొడుచుట విప్పుటలో ఆనందమును వెలి యించునవి పొడుపు కథలు" అని అన్నారు శ్రీ నేదునూరు గంగాధరం. తెలుగులో పొడుపు కథలకు ఆయా ప్రాంతాలకు సంబంధించిన పేర్లు ఉన్నాయి. తెలంగాణాలోని కొన్ని ప్రాంతాలలో దీన్ని శాస్త్రం అని అంటారు. మరి కొన్ని ప్రాంతాల్లో శాస్త్రం అంటే సామెత. ఇచ్చుకథ, విచ్చు కథ, విప్పుకథ, అడ్డుకథ మొదలైన పేర్లు కూడా ఉన్నాయి. పొడుపు అంటే పొడవడం, పొడిచేటట్లుగా ప్రశ్నించడం అనే అర్థాలు చెప్తుంటారు. గుచ్చడమే ప్రధాన పనిగా ఉండే పచ్చ పొడుపు అందరికి పరిచయమే. సూటిగా చెప్పడానికి బదులుగా వేరొకటి చెప్పడం వల్ల మారు కథ అనే పేరు వచ్చుంటుంది. ఒక సమస్యను అడిగినప్పుడు విప్పు కథ, విచ్చు కథ అనే పేర్లు వచ్చుండొచ్చు.

గంభీరత్వాన్ని కలిగి ఉండడం పొడుపు కథలకు ప్రధాన లక్షణంగా చెప్పవచ్చును. బుద్ధిచాతుర్యానికి వీటిలో ఎక్కువ ప్రాముఖ్యత ఉంది. పొడుపు కథను గంభీరం వుట్టిపడేలా అడగడమే ప్రశ్నించేవాడి వంతు. అడిగిన దాన్ని తెలివిగా విప్పడమే విన్నవాడి వంతు. పొడుపు కథలో మరో గుణం హాస్యం. హాస్యానికి తోడు ఒక్కొక్కసారి వ్యంగ్యం కూడా కనిపిస్తుంది. ప్రకృతితో సంబంధం ఉండడం పొడుపు కథల మరొక లక్షణం. ప్రకృతికి సంబంధించిన అనేక వస్తువులు దీనిలో స్థానం సంపాదించుకున్నాయి. పొడుపు కథలో కనిపించే ఆలోచన, బుద్ధి, శక్తి జానపదులు వీటిని ప్రయత్న పూర్వకంగా కల్పించి ఉంటారు. ప్రశ్నోత్తర రూపంలో ఉండేవి తెలుగులోను ఉన్నాయి. ఇవి పాటల రూపంలో ఉండవచ్చు లేక గద్య రూపంలో ఉండవచ్చును. ఇలాంటి పొడుపు కథలు ఎక్కువగా పెళ్ళిళ్ళలో వాడుతుంటారు.

భారతదేశంలోని పొడుపు కథల వికాసాన్ని గురించి చెప్పేటప్పుడు వేదాల తర్వాత మహాభారతాన్ని చెప్పుకుంటారు. ప్రకృతికి, నీతికి సంబంధించిన చాలా పొడుపు కథలు మహాభారతంలో ఉన్నాయి. నీతికి సంబంధించిన పొడుపు కథలు జాతక కథల్లో ఉన్నాయి. వాటిలో కొన్ని సమస్యాత్మక కథారూపంలో ఉన్నాయి. రాజు చనిపోయిన తర్వాత మరొకర్ని ఎన్నుకోవడానికి పొడుపు కథలు వేసి ఎన్నుకొనే విధానం జాతక కథల్లో ఉన్నాయి.

తెలుగు పొడుపు కథలకు కూడా విభజన ఉందని (ఆంధ్రుల జానపద విజ్ఞానం) డా॥ ఆర్.వి.యస్. సుందరం తెలియజేశారు. పొడుపు కథల నిడివిని బట్టి చిన్నవి, పెద్దవి అని రెండు రకాలుగా విభజించవచ్చని టేకుమళ్ళవారు సూచించారు.

**చిన్నవి :**

ఎందరు ఎక్కిన విరగని మంచం **(అరుగు)**

ప్రతి ఇంట్లో ఒక నల్లోడు **(మసిగుడ్డ)**

ఆకు చిటికెడు కాయ మూరెడు **(మునగకాయ)**

**పెద్దవి :**

చూస్తే చూసింది కానీ కళ్ళు లేవు
నవ్వితే నవ్వింది కానీ పళ్ళు, నోరు లేవు
తంతే తన్నింది కానీ కాలు కాదు **(అద్దం)**

అడ్డగోడ మీద ముద్ద చెంబు
తోసిన ఇటు పక్కపడదు
అటు పక్కపడదు **(ఆబోతు మూపురం)**

**ప్రశ్నల రూపంలో ఉండేవి కొన్ని :**

ఆకలేయదు నీరు తాగదు నేలని పాకదు ఏమిటి?
**(విద్యుత్ తీగ)**

కొమ్ములుంటాయి కానీ ఎద్దు కాదు
అంబారీ ఉంటుంది కానీ ఏనుగు కాదు **(నత్త)**

**గేయంలాగ ఉండేవి కొన్ని :**

చాక్లెట్లు బిస్కెట్లు దాచుకోవడానికి జేబు అక్కరలేదు
పలకా బలపం పెట్టుకోవడానికి సంచి అక్కర్లేదు
అన్నింటికి కంగారు పడుతుంది
ఆస్ట్రేలియా నుంచి వచ్చింది **(కంగారు)**

చీకటి పడకముందే
ఇంటికి చేరాలనే తొందరేం లేదు
రాత్రయినా, పగలైనా
చేత దీపం పట్టుకొని తిరుగుతుంది **(మిణుగురు)**

పొడుపు కథలను గుర్తుంచుకొనేటట్లు చేసేవి వాటి అంత్యప్రాసలు. చాలా పొడుపు కథల్లో చివరి అక్షరమో, చివరి రెండక్షరాలో, పదాలో అంత్యప్రాసల రూపంలో ఉంటాయి. దీనికి సంబంధించినవి కొన్ని –

దూడ అక్కడనే ఉండు
ఆవు పోతావుండు **(గుమ్మడికాయ తీగ)**

తెలిసి కాయ కాస్తుంది
తెలీకుండా పువ్వు పూస్తుంది **(అత్తి చెట్టు)**

తోలుతో చేస్తారు
కర్రతో చేస్తారు
అన్నం పెడతారు
అదే పనిగా బాదుతారు **(మద్దెల)**

ప్రకృతిలోని చెట్లు, చేమలు, ఆహార పదార్థాలు లెక్కకు మించినవి పొడుపు కథల్లో దాగి ఉంటాయి. అసలు పొడుపు కథల ఉత్పత్తికి ప్రకృతిని ఆరాధించే మానవుని మనస్సుకీ సంబంధం ఉందని విద్యాంసుల నమ్మకం. అందువల్లే ప్రకృతిలో మన చుట్టూ కనిపించే వస్తువులు అనేకం.

వాటిలో కొన్ని –

తల్లి దయ్యం పిల్ల పగడం **(రేగుపండు)**

ఒకటి తోటి రెండు పిల్లలు **(వేరుశనగ)**

**కథ రూపంలో ఉండే పొడుపు కథలు :**

అనగనగా ఒ అప్సరస ఆమె పేరులో మధ్య అక్షరం తీసేస్తే మేక **(మేనక)**

మనదేశంలో ప్రధాన రంగమైన వ్యవసాయం వందల కొద్ది పొడుపు కథల ఆవిర్భావానికి కారణం అయ్యింది. పంటలకు సంబంధించినవి కూడా ఉన్నాయి.

ఈకలు ఈరమ్మ ముళ్ళ పేరమ్మ సంతకు వెళితే అందరూ కొనేవారే **(ఉల్లిపాయ)**

పైడి పెట్టెలో ముత్యపు గింజ **(వడ్లగింజ)**

చింకిరి చింకిరి గుడ్డలు
రత్నాలలాంటి బిడ్డలు **(మొక్కజొన్న)**

కొన్ని పొడుపు కథలు విశ్వంలోని ఖగోళ వస్తువులను గురించి ఆకాశం, నక్షత్రాలు, చంద్రుడు మొదలైన వాటిని ఉపమేయాలుగా కలిగినవి ఉంటాయి. వాటిల్లో కొన్ని –

రాజుగారి తోటలో రోజాపూలు
చూసేవారే కానీ కోసేవారు లేరు **(చుక్కలు)**

అంతులేని చెట్టుకు
అరవై కొమ్మలు

# పాఠంలో ఒక్కముక్క

- డా. పెంకి విజయ కుమార్
95533 92949



అమ్మా నాన్నల ప్రేమకు ప్రతిరూపంగా
వారి అనురాగానికి నలుసై
అమ్మ ఉమ్మనీటి కొలనులో కలువమొగ్గయ్యాడు
మొగ్గైంది మొదలు విరబూసే వరకు
ఆ అమ్మపడిన ఆరాటానికి అంతేలేదు
ఆ నాన్నపడిన తపనకు తరుగేలేదు
నవమాసాలకు రంగులద్ది,
పురిటినొప్పుల కుంచెతో
అమ్మ అపురూపచిత్రాన్ని ఆవిష్కరించింది
వాడి ఎదుగుదలకోసం
కష్టాన్ని పంటిబిగువున నిల్పిన
నాన్నచేతులు కాయలుకాశాయి.
బాగాచదివి పరిమళిస్తాడని
ఆ తల్లిదండ్రుల ప్రతి చెమటచుక్క
వాడు చదివిన కార్పోరేట్ హైటెక్కుస్కూల్ ఫీజు
రశీదులలో ఆవిరైపోయింది
చదువుల సేద్యంలో పొలం,ఇల్లు
తాకట్టుకొట్టు మెట్లెక్కాయి
ఎందరో శ్రమజీవుల రక్తాన్ని
రుచిని మరిగిన ఆ స్కూలు పుస్తకాలలో
"డబ్బు సంపాదించడం ఎలా?"
అనేపాఠమే ముళ్ళకిరీటమైంది
అక్కడ ఏ పుస్తకాన్ని తిరగేసినా....
మానవ సంబంధాలు, నైతిక విలువలు
ఎండమావులయ్యాయి
బట్టీ పాఠాలతో అతనికి పట్టాదక్కిందికానీ...
ఉద్యోగ అన్వేషణబాటలో
జ్ఞానం నిండని మదిని
ప్రతీచోట పాకుడుమెట్లు వెక్కిరించాయి
తల్లిదండ్రుల చెమటచుక్కల చిత్రం
వాడికళ్లల్లో రక్తసిక్తమయ్యింది
రుణం తీర్చుకొనే క్షణికావేశంలో
పిరికితనందే పైచేయయ్యింది
అమ్మానాన్నలందించిన జీవశిల్పదేహాన్ని
రైలుపట్టాలపై పరుండబెట్టి
తల, మొండెంగా ముక్కలుచేశాడు
వారి ఆశలకు పిండంపెట్టాడు
ఎంతకాలం ఈ గర్భశోక సంద్రపు ఘోషలు?
జీవితమంటే డబ్బు సంపాదన కాదని
చదువంటే జీవితాన్ని గెలవడమని
తను బతుకుతూ ఇతరులనూ బతికించడమని
చదివినపాఠంలో ఒక్కముక్క
బతుకుని పరిచయం చేసినా బాగుండు!
వాడు ముక్కలయ్యేముందు
ఒక్క క్షణం ఆలోచించేవాడేమో!!

◆

---

కొమ్మ కొమ్మకు
కోటి పూలు
పువ్వులలో రెండే కాయలు
**(ఆకాశం, చుక్కలు, సూర్యుడు, చంద్రుడు)**

'ఒకదాన్ని మించి మరొకటి' అన్నట్లుగా జానపద విజ్ఞాన క్షేత్రంలో ఇలా చెప్పుకుంటూపోతుంటే ఒకదాని మించి మరొకటి ఉంటుంది. పొడుపు కథలు కాలక్షేపానికి మాత్రమే కాదు. మానవ జీవితానికి కూడా సంబంధం కలిగి ఉంటాయి. ఇవి వినోద సాధనం మాత్రమే కాక విజ్ఞాన సాధనం కూడా. ఇవి జానపదుల బుద్ధి వికాసానికి బలమైన పరికరాలుగా ఉంటాయి. పొడుపు కథను అడగడం, ఎదుటి వారు దానిని విప్పడం పిల్లలకు వినోదాన్ని, దానితోపాటు బుద్ధి వికాసాన్ని కూడా కలిగిస్తాయి. పొడుపు కథలలో ఆదిమ మానవునికి సంబంధించిన అనేక ఆచారాలు, సంప్రదాయాలు ముడిపడి ఉన్నాయి. కానీ కొన్ని సందర్భాల్లో వీటిని నిషేదించడం జరుగుతుంది. ముఖ్యంగా నాట్లు సమయంలో, కోతల సమయంలో వీటిని నిషేధిస్తారు. అన్ని సమయాల్లో వినోదంతో కాలం గడిపేస్తే పొలం పనులు సరిగా జరగవనే అభిప్రాయం దీనికి కారణం కావచ్చు. జానపద సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లో ఎక్కువగా గేయాలు గురించిన అధ్యయనం జరిగింది. తర్వాత కథాగేయాలు, కథలు, సామెతలు, చిట్టచివర పొడుపు కథలు ఉన్నాయి. ◆



# కొలిమి

డా. మౌని
8074631328

కరమల పెద్దన్న బెయిల్‌పై ఊరిలోకి వచ్చిన మరుసటి రోజు ఉదయం అన్ని వార్తాపత్రికల్లోను అదే వార్త. 'గుంతకల్లు రైల్వేజంక్షన్ పోలీస్‌స్టేషన్‌లో లొంగిపోయిన అపరాధి రాజశేఖరం కుమారుడు రమణబాబు'. మరియు బెనిఫిట్ ఆఫ్ డౌట్‌తో అరెస్టు చేయబడిన కరమల పెద్దన్నను సొంత పూచీకత్తుపై విడుదల.

ఈ వార్త ఆ ఊరి జనాలకే కాకుండా ఆ ఊరి పెద్ద తలకాయలలో ఒకరైన రాజశేఖరం నోట కూడా మాట రాకుండా చేసింది. అపరాధిగా మారిన రమణబాబు తనకు తానుగా తన వాంగ్మూలాన్ని పోలీసులకు నివేదించాడు. 'తాను కరమల పెద్దన్నను భయపెట్టి, ప్రోద్భలం చేసి అతనిచేత రైల్వే గవర్నమెంట్‌కు సంబంధించిన ఇనుప దిమ్మెతో పనిముట్లను చేయించుకున్నానని ఆ వస్తువులతో పాటు మిగిలిన ఇనుప తండోలం దిమ్మెను పోలీస్‌స్టేషన్‌లో అప్పగిస్తానని చెప్పడం జరిగింది. ఈ పరిస్థితుల్లో తన కుమారుడు రమణబాబుకి బెయిల్‌కూడా అంత సులభంగా రాదన్న విషయం రాజేశఖరాన్ని కలవరపరిచింది.

ఆ రోజు తన తండ్రి బంగారంలాంటి కరమల పెద్దన్నను ఈ దొంగ సొత్తుతో పనిముట్లు చేసే పాపానికి బలిచేశాడు. పెద్దన్న కుటుంబానికి తీరని ద్రోహం, అన్యాయం చేశాడు. ఇలా ఆలోచిస్తున్న రమణబాబులో మానవత్వం నిదురలేచింది. అందుకే ఈ నిర్ణయానికి వచ్చాడు. పోలీసులతో నాన్న దీనికి బాధ్యుడని చెబితే ఎలక్షన్‌లో అభ్యర్థిగా నిలిచే అర్హత తాను కోల్పోతాడు, నిజం చెప్పకపోతే కరమలపెద్దన్న బలైపోతాడు, అందుకే తాను నిజం చెప్పి ఇద్దరినీ కాపాడుకోవాలి. అందుకే ఈ అపవాదుని తన నెత్తిపై వేసుకుని న్యాయం ఇంకా బ్రతికే ఉందని చాటింపు వేశాడు. ఏమైతేనేమి తన తండ్రి చేసిన పాపానికి భవిష్యత్తులో ఆయనే ప్రాశ్చిత్తం అనుభవించనీ అని తీర్మానించుకున్నాడు.

అయితే ఈ అనుకోని సంఘటనతో రాజశేఖరంకు దిమ్మతిరిగిపోయింది. తలమొద్దుపారిపోయింది. తాను అనుకున్నది ఒకటి జరిగింది మరొకటి. ఈ నాకొడుకు తనకు

చెప్పకుండా ఇలా ఎందుకు చేశాడో! ఎంత ఆలోచించినా అర్థం కాకుండా పోతోంది. మంత్రాలయంకు పోతానన్న నా కొడుకు, గుంతకల్లు పోలీస్‌స్టేషన్‌లో ఎందుకు దూరినట్లు. ఇప్పుడు వాడిని రైల్వే పోలీసుల నుంచి ఎలా కాపాడుకోవాలా? బెయిల్ ఎలా సంపాదించాలా? అనే ఆలోచనతో సతమతమైపోయాడు.

♦♦♦

ఇలా ఎందుకు జరగాల్సి వచ్చింది? దీని వెనుక చోటుచేసుకున్న ఆశ్చర్యకర పరిణామాలను పరిశీలిద్దాం...

ఆ ఊరికి మిట్టమీద కూడా ఇండ్లున్నాయి. ఆ ఇండ్లకు కొంచెం ఎడంగా ఓ పెద్ద చింతచెట్టు పెద్దరికంతో పండిపోయిన పాతకాలం మనిషిలా. దాని నీడలో ఎప్పుడూ పదిమంది కూర్చుని సందడి చేసుకుంటు పిచ్చాపాటి మాట్లాడుతూ ఉండటం పరిపాటిగా మారింది. అందుకుగాను అక్కడ రెండు దశాబ్దాలకు ముందు కరమల మునిరత్నం అనే పెద్దబ్బ ఆచారి వెలిగించిన కొలిమి ప్రభల కారణమైంది.

కరమల పెద్దన్న కొలిమి నిరంతరం మండుతూనే ఉండేది. ఉద్యోగాలు వెలగబెట్టేవారికి, పండుగలకు పబ్బాలకే కాకుండా కనీనం వారానికి ఒకరోజు సెలవు ఉంటుందేమోగాని, కరమల పెద్దన్నకు ఏడాది పొడవునా ఉద్యోగమే కదా అని ఎగతాలి చేసేవాళ్లు కొందరైతే, పైసా ఆదాయం లేదు అరక్షణం తీరిక లేదన్నట్లుగా కరమల పెద్దన్న ఏ ముహూర్తంలో కొలిమిలో నిప్పురాజేసాడో ఇప్పటికీ అది నిత్య అగ్నిహోత్రంలా మండుతూనే ఉందని ఆశ్చర్యపోయేవాళ్లు కొందరు లేకపోలేదు. ఏమైతేనేమి కరమల పెద్దన్న బ్రతుకంతా కొలిమికాడనే గడచిపోతూ ఉందంటే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. రెక్కాడితేగాని డొక్కాడని బ్రతుకులు కరమల పెద్దన్నలాంటి వృత్తుల వాళ్ల సొంతమే కదా.

పెద్దన్న నిదానస్తుడు. మంచిమనిషి. నోట్లో నాలుక లేనివాడు. అయితే ఊర్లో వాళ్లకు తలలో నాలుకలాంటి వాడు. పల్లెల్లో జనాలకు శుభముహూర్తాలను వాస్తులాంటి విషయాలను వివరించడంలో దిట్ట. కాని లౌకికం తెలియనివాడు. పని పని పని తప్ప వేరే విషయాలు గూర్చి ఆలోచనలు లేనివాడు. మోసం తెలియదు. రాజకీయాలు పట్టించుకోడు. తన భార్య, పిల్లలు తప్పితే వేరే లోకం లేనివాడు. పేరుకు తగ్గట్టుగా కరమల పెద్దన్న పెద్ద మనసున్న పెద్దమనిషే.

కరమల పెద్దన్న కొలిమి వెలిగించాడంటే చాలు, అప్పటికే బిలబిలమంటు రైతులు, కూలీలు, చుట్టూ మూగేవారు, తమకు కావాల్సిన లోహపు పనిముట్లను తయారుచేయించుకుని వెళ్లేందుకు. వచ్చినవాళ్లలో ఎవరో ఒకరు కొలిమి చక్రాన్ని తిప్పేవారు. దాంతో గాలితిత్తి నుండి వెలువడే గాలికి కొలిమిలోని నిప్పులు బాగా మండి ప్రజ్వరిల్లుతుండేవి. అందులో కాలుతున్న ఉక్కు ఇనుప ముక్కలు ఎర్రగా మిరిమిట్లు గొలిపి భయపెట్టేవి. కొలిమి పక్కనే కాల్చిన నల్లబొగ్గులకుప్ప, నీళ్లతో నింపిన చిన్న రాతి తొట్టె ఉండేది.

కరమల పెద్దన్న ఎంత సౌమ్యంగా కనిపించేవాడో కొలిమి పనిలో కూర్చుంటే చాలు ఆయన రూపే మారిపోయేది. మూడో కన్ను తెరిచిన శివుడిలా, ఊడిన శిగముడితో పొడవాటి వెంట్రుకలు భుజాల మీద ఊగుతుంటే, చేతిలోని సమ్మెటలాంటి పెద్ద సుత్తితో, కాలిన లోహాన్ని పట్టకర్రతో పట్టుకుని ఇనుప పట్టెమీద పెట్టి కొడుతుంటే చూసేవాళ్లకు ఒళ్లు గగుర్పొడిచేది. ఆ ఎర్రని నిప్పు కణికల్లో కాలిన ఆ లోహంలోంచి వెలువడిన కాంతి కళ్లకు మిరుమిట్లు గొలిపేది.

అలా కరమల పెద్దన్న కొలిమి పని చేస్తుంటే, ఇంద్రజాలికుడు గారడి చేస్తు చివరిలో ప్రేక్షకులకు వారు కోరుకున్న వస్తువుల్ని తాత్కాలికంగా వారికి ఇచ్చి ఆశ్చర్యపరచినట్లుగా ఇక్కడ కరమల పెద్దన్న కూడా మాయామంత్రాలు చేయకుండా, కళ్లకు గంతలు కట్టకుండ తన శ్రమతో కొలిమి నుంచి కత్తులు, చాకులు, కొడవళ్లు, తొలికలు, మడక కర్రులు, గొడ్డల్లు, ఒంకీ దోటెలు, ఎద్దుల లాడములు, పారలు, గడ్డపారలు లాంటి పనిముట్లను చేసి ఇచ్చేవాడు. ఆయన నైపుణ్యం ముందు ఇంద్రజాలం, ఇంద్రజాలికులు ఎంతమందైనా దిగదుడిపే.

తన చేతి కష్టమీద, కొలిమిమీద ఆధారపడి పెద్దన్న అయిదుమంది పిల్లల్ని పోషించుకుంటూ బ్రతుకును నెట్టుకొస్తున్నాడు. తన తాతలు సంపాదించిపెట్టిన రెండెకరాల చేనును కూడా తన ముగ్గురు కూతుర్ల పెళ్ళిఖర్చులకు కోటకాడ రామచంద్రయ్య దగ్గర అడమానం పెట్టి డబ్బులు తీసుకున్నాడు. ఆ బాకీ ఇప్పుడు తీర్చుకోవాల్సి ఉంది. మిగిలిన ఇద్దరు మగబిడ్డలు చిన్నవాళ్లు. వారు తన చేతికి అంది వచ్చేంతవరకు పోరాడాల్సిందే. తన భార్య తనతో వచ్చిన్నాటినుంచి ఇంటిపనులతో పాటు, పిల్లల ఆలనా పాలనా చూసుకుంటు

కొలిమి దగ్గర చిన్నపనులు చేస్తూ సాయమందిస్తూనే ఉంది.

ఎంత మంచి ఊరైన, ఎంతమంది మంచిమనుషులున్నా చిక్కని పాలల్లో ఒక ఉప్పు కళ్లు పడితే ఆ పాలు పాడవక ఏమౌతాయి అన్నట్లుగా ఇప్పుడు ఈ ఊరిలో కూడా రాజకీయం తన ఎడమ పాదం మోపింది. పదవుల ఆశను రగిలించింది. ఊరిని రెండుగా చీల్చేసింది. కులాల కుమ్ములాట మొదలైంది. ఆదినారాయణరెడ్డి వర్గం ఒకవైపు మరో వైపు కోటకాడ రామచంద్రయ్య బామరిది రాజశేఖరం వర్గం పోటాపోటీగా తయారైంది. దీంతో ఊరిలో జనాల బ్రతుకు హీనంగా తయారైంది. పచ్చగా ఉన్న ఊరు భగ్గుమంది. అకారణ ద్వేషాలు మండుకున్నాయి. ఉరుము ఉరిమి ఊరిమీద పడ్డదన్న సామెతలాగా, ఎవర్రా అలుసు అంటే బీదబిక్కీ, బడుగువర్గాలేకదా అన్నట్లు తయారైంది.

కరమల పెద్దన్న కొలిమి చంద్రనిప్పుల మంటలాగా ఎర్రగా మండుతూ ఉంది. కొలిమిలో కాలుతున్న లోహాలు నెత్తుటి రంగుతో మిరమిట్లు గొల్పుతున్నాయి. వాటిలో ఒక్కొక్కదానిని పట్టగారతో బయటికి తీసి ఇనుప పట్టీపై పెట్టి, దాన్ని గట్టిగా ఎడమచేతి పట్టగారతో అదుముకుని, కుడిచేతిలోని పెద్ద సుత్తితో ఒక్కవేటు వేశాడు. అది దెబ్బతిన్న నాగుపాములా బుసకొడుతున్నట్లు ఆ వేడిలో కస్‌కస్‌మంటు శబ్దం చేస్తూ ఉంది. ఇంకో దెబ్బ కొట్టేందుకు సుత్తిని పైకి ఎత్తాడు. ఇంతలో రాజశేఖరం కేక వినిపించింది.

'కరముల పెద్దన్న! నీతో అర్జెంటు పని ఉంది. ఆ పని అక్కడతో ఆపేసి నాతో పాటు ఇప్పుడే మా ఇంటి దగ్గరికి రావాలి బయలుదేరు' అంటూ తొందరపెట్టాడు.

'లేదయ్యా! ఇప్పుడు రావడం కుదరదు. కొలిమి పని సగములో ఆపి రాలేను. ఒక్క గంటలో ఈ పని పూర్తి చేసుకుని వచ్చేస్తాను. ఈ వేడిలోహాలు మధ్యలో చల్లారిపోతే, తిరిగి కొలిమి మండించి నిప్పు రాజేయాలంటే చాలా టైం పడతాది'

'ఏం! ఫర్వాలేదు తర్వాత వచ్చి చేసుకుందువులే తీరిగ్గా. ఈ కొలిమి పనులు ఈరోజుతో అయిపోయేవి కాదుకదా. మారు మాట్లాడకుండా లేచి రా' అంటు కరముల పెద్దన్న చెప్పేది వినకుండా బిరుక్కున తిరిగి బయలుదేరిపోయాడు రాజశేఖరం.

పెద్దన్నకు ఏం చేయాలో దిక్కుతోచలేదు. ఊరిలో వాళ్లకి పనిముట్లు అర్జెంటుగా ఉన్నాయి. ఈ రోజు చేసిచ్చేయాలి. వాళ్లు తొందర పెడుతున్నారు, అనుకుంటు రాజశేఖరం ఇంత అర్జెంటుగా తనను రమ్మనడంలో విషయం తెలియకుండా ఉంది. ఏమైతేనేం అని అనుకుంటు చేతులు కడుక్కొని, తుండు గుడ్డ విదిలించి భుజాన వేసుకుని ఒట్టికాళ్లతోనే ఊర్లోకి బయలుదేరాడు కరముల పెద్దన్న.

రాజశేఖరం కరమల పెద్దన్నను ఇంటిలోకి పిలుచుకెళ్ళాడు. వరండా కుడివైపునున్న బెల్లం, శెనక్కాయలు నిల్వచేసే గదిలో కూర్చోబెట్టుకున్నాడు. బెల్లం కాగుల పక్కన ఎప్పుడో దాచిన ఒక మనుగు బరువున్న ఇనుప తండోలం అంటే రైల్వేకి సంబంధించిన ఇనుప పట్టా భాగాన్ని పెద్దన్నకు తెచ్చి చూపించాడు. వరండాలో కూర్చుని ఉన్న రాజశేఖరం కుమారుడు రమణబాబు వీళ్ళిద్దర్ని ఒక కంటితో గమనిస్తూనే ఉన్నాడు. రాజశేఖరం వ్యక్తిత్వంలో హిరణ్యకశిపుడు అయితే కొడుకు రమణబాబు అపర ప్రహ్లాదుడే. అందుకే రమణబాబుకి తన తండ్రి చేసే రాజకీయాలు సుతరాము నచ్చవు. పేద సాదలంటే రమణబాబుకు ఎంతో జాలి. అందుకే తన తండ్రి పులి పంజాకు, కరమల పెద్దన్న అనే అమాయక జింక ఎక్కడ బలిఅయిపోతుందో అనే అనుమానంతో వాళ్లను గమనించడం జరిగింది.

రాజశేఖరం పెద్దన్నతో చెబుతున్నాడు....'ఈ లోహం దిమ్మెతో మూడోకంటికి తెలియకుండా రెండురోజుల్లో చిన్నపాటి తల్వార్లు, తొలికలు, కత్తులు, వేటకొడవళ్లు చేసిపెట్టాలి. అవి వ్యవసాయానికి పనికొస్తాయి, పనిలోపనిగా ఎలక్షన్లు కూడా వస్తున్నాయిగా అప్పుడు వాటి అవసరం ఏమైన ఉంటాదిలే' అని వెకిలిగా నవ్వుతుంటే....

పెద్దన్న పై ప్రాణం పైన్నే పోతున్నట్లు అనిపించింది. రైల్వే గవర్నమెంటు సొత్తును ఉపయోగించి వస్తువులు చేయడం కాదుకదా, అవిటిని తాకిన, దాచుకున్న శిక్షలు బహు కఠినంగా ఉంటాయి. వాళ్లు చేతిల్లో పడితే నరకం చూపిస్తారు. జైల్లో పెట్టేంతవరకు నిద్రపోరు. ఈ విషయం తెలిసిన కరమల పెద్దన్న 'అయ్యా! ఇది రైల్వే సొత్తు. రైల్వే పోలీసులకు తెలిస్తే ఇంకేముంది దొంగతనం అంటగట్టి నన్ను జైల్లో పెట్టేస్తారు సామి.. నా సంసారం వీధిన పడుతుంది. నన్ను మన్నించండి రాజశేఖరంగారు'. అంటు ప్రాధేయపడుతున్నాడు. నెమలి కంట్లో కన్నీరు వస్తే, వేటగాడి బాణానికి కనికరం పుడుతుందా అన్న సామెతలాగా పెద్దన్న బాధకు రాజశేఖరం కరగలేదు.

ససేమిరా అన్నాడు. తాను చెప్పినట్లుగానే పనిముట్లు ఈ లోహంతోనే చేసిపెట్టాలని కండీషన్ పెట్టాడు.

అయినా పెద్దన్న మళ్లీ ప్రాధేయపడ్డాడు. 'అయ్యా! రెండేళ్ల మునుపునుంచే ఆదినారాయణరెడ్డికూడా ఇలాంటి పని చేసి పెట్టమంటు నన్ను బాధిస్తూనే ఉన్నాడు. అయినా నేను ఒప్పుకోలేదు. అప్పటినుంచి ఆయన కూడా నామీద గుర్రుగా ఉన్నాడు అయ్యా... ఆలోచించుకోండి.. దయపెట్టి ఈ సారికి నన్ను ఇట్లా వదిలేయండి... పిల్లలుగలవాడిని'.

'పెద్దన్న! ఇది మూడో కంటికి తెలియదు. నీ మీద ఏ కేసులు రావు. ఊరికే భయపడి అతిగా ఆలోచించమాక. నేను చెప్పినట్లు చెయ్యి. ఇక మాట్లాడవద్దు. నా కథ తెలుసుగా, నువ్వు నా పని చేసిపెట్టక పోయిన ఆ తర్వాత ఈ రైల్వే ఇనుపతుండు మీ ఇంటి కొలిమి కాడ దొరుకుతుంది. కాబట్టి జాగ్రత్తగా విని నా పని చేసిపెట్టు. రాత్రికి నీ కొలిమికాడికి ఇనుపతుండు బొగ్గుల మూటతో పాటు చేరిపోతుంది' అనేసి కోపంతో బయటకు వచ్చేశాడు రాజశేఖరం.

రమణబాబు తన తండ్రి వెళ్తున్న దిశగా చూస్తూ, పెద్దన్న పరిస్థితికి జాలిగా ఆయనవైపు చూడటం తప్ప ఏమీ చేయలేకపోయాడు. రాజశేఖరం మాట అనే కత్తికి రెండు పక్కలా పదునే. కరమల పెద్దన్న కాదన్నా? అవునన్నా? మెడమీద కత్తి వేలాడుతున్నట్లే లెక్క. పాపం చచ్చినట్లుగా పెద్దన్న తనకు చెప్పిన పనిని రాత్రింబవళ్లు కూర్చుని భయంభయంగా ఎలాగో అయ్యిందనిపించాడు. రాజశేఖరంగారింటికి రెండురోజుల తర్వాత ఆ వస్తువులు చేరిపోయాయి. కరమలపెద్దన్నకు నెత్తిబరువుకాదుకదా, గుండెబరువు దించినట్లయ్యింది. రాజశేఖరం తన పంతం నెగ్గించినందుకు మీసాన్ని ఎడమచేత్తో మెలివేసాడు గర్వంగా.

అయితే ఆ ఊరిలో రాజకీయం నిప్పు ఇప్పుడిప్పుడే రగులుకుంటున్నది. అలాంటి ఊరిలో మంచి జరిగితే నోరు విప్పరుగాని కానిపని జరిగితేమాత్రం ఎప్పుడెప్పుడు వీధిలో పెట్టి దండోరా వేద్దామా అని చెవులు కొరుక్కుంటు ఎదురుచూస్తుంటారు. ఇప్పుడు ఇక్కడ ఇదే జరిగింది. ఆదినారాయాణరెడ్డి వర్గంలోని వాడెవడో ఒకడు ఈ విషయం పసికట్టాడు. కరమల పెద్దన్న రాజశేఖరం ఇంటికి పోవడం రావడం, మాటామంతి సూచాయిగా వాసన పసిగట్టాడు. తీగలాగితే డొంకకదిలినట్లుగా అనుమానాన్ని అంటించి రైల్వేపోలీసులకు ఈ వార్తతో ఉప్పు అందించారు. ఇంకేముంది రెండు రోజులు తర్వాత రైల్వే పోలీసులు కరమల పెద్దన్న కొలిమి ముందు తిష్ట వేసుకున్నారు. అనుమానంతో సవాలక్ష ప్రశ్నలతో పెద్దన్నకు ఊపిరి సలపనీకుండా చేశారు.

రైల్వే దొంగ సొత్తులతో ఎంత కాలంగా పనులు చేసి సంపాదిస్తున్నావు? నీకు ఎవరు రైల్వే ముడిసరుకులు ఇస్తున్నారు? లేదా నువ్వే దొంగతనం చేసి తెస్తున్నావా? నీ వెనక సూత్రధారులు ఎవరెవరు ఉన్నారు? ఇప్పుడే చెప్పాలి? లేకుంటే గుంతకల్లు రైల్వే పోలీస్‌స్టేషన్‌కు వచ్చి సంజాయిషీ రాసివ్వాల్సి ఉంటుంది. అని ఉన్నపలంగా బెనిఫిట్ ఆఫ్ డౌట్ కింద పెద్దన్నను జీపులో ఎక్కించుకుని ఎంత ప్రాధేయపడుతున్నా వినకుండా తీసుకెళ్ళిపోయారు.

కరముల పెద్దన్న కుటుంబం ఈ దారుణానికి గొల్లుమంది. భార్య ఆదిలక్ష్మమ్మ కంటికి కడివెడుగా ఏడుస్తుంది. పోలీసోళ్ల కాళ్లు పట్టుకుని బ్రతిమలాడినా వాళ్లు జాలి చూపించకపోయారు. బిడ్డలు, బంధువులు ఎంత ప్రాధేయపడిన పోలీసువాళ్లు గుంతకల్లు స్టేషన్‌కు వచ్చి మాట్లాడండి అంటు వెళ్ళిపోవడం వాళ్లను ఎంతగానో బాధించింది. దీని వెనుక ఆదినారాయణరెడ్డి వర్గం బలంగా ఉంది కాబట్టి పోలీసోళ్లు కూడా కరమల పెద్దన్న విషయంలో కనీస సమయం కూడా ఇవ్వలేకపోయారన్నది నిజం.

ఏమైతేనేమి కరమల పెద్దన్న బ్రతుకు వీధినపడింది. భార్య, పిల్లలు, బంధువులు రాజశేఖరం ఇంటిముందు పడిగాపులు కాస్తున్నారు కాపాడమని వేడుకుంటున్నారు. రాజశేఖరంగారు నోరుతెరచారు. 'ఆదిలక్ష్మమ్మ పెద్దన్నకు ఏమీ కాదు నేను లాయరుతో మాట్లాడి పెద్దన్నను బెయిల్‌మీద తీసుకొచ్చే ఏర్పాట్లు చేయిస్తాను. భోజనానికి కావాల్సిన బియ్యం, పప్పులు పట్టుకెళ్లు. అంతా నేను చూసుకుంటాను. ధైర్యంగా ఉండు' అంటుంటే ఆదిలక్ష్మమ్మ 'అయ్యా!మీరు తండ్రిలాంటివారు మీరు చెబితేనేగదా మా ఆయన ఆ పని చేసిపెట్టారు. ఆయన ససేమిరా చేయను మహాప్రభో అన్నా మీరే భయపెట్టి ధైర్యం చెప్పి చేయించారు కదా సామి! మీరే మమ్మల్ని కాపాడాలి అంటుంటే 'ఏంది ఆదిలక్ష్మి! నీకేం తెలుసు అని మాట్లాడుతున్నావు. పనుల విషయాల్లో మా మధ్య ఎన్నో ఉంటాయి అవన్నీ నీకు చెప్పాల్సిన పనిలేదు. బిడ్డల్ని తీసుకుని ఇంటికెళ్లు. ఊర్లో రాద్ధాంతం చెయ్యద్దు. ఎలక్షన్ల హడావుడి

తొందరలో మేము తలమునకలై ఉన్నాము' అంటుంటే చేసేది లేక ఆదిలక్ష్మమ్మ బిడ్డలను పిలుచుకుని ఏడ్చుకుంటు బయలుదేరిపోయింది.

రైల్వే పోలీసులు ఊరిమీద నిఘా పెట్టేశారు. ఇద్దరు పోలీసుల్ని ఊరిలో డ్యూటీ వేసి విచారణ మొదలపెట్టమన్నారు. వారికి తెలుసు కరమల పెద్దన్న దొంగతనం చేసేటంతటి ధైర్యస్తుడు కాదని, నెమ్మదస్తుడని. అయినా నిజం బయటికిరావాలంటే కరమల పెద్దన్నలాంటి ముడి ఇనుమును కొలిమిలో కాకపెట్టి కాల్చి, సుత్తితో కొట్టి 'నిజం' అనే వస్తువును తయారుచేయాల్సి ఉందని భావించారు.

ఇప్పుడు ఊరిపెద్ద రాజశేఖరం పరిస్థితి అడకత్తిలో పోకలా తయారైంది. ఈ దొంగతనం కేసుకు తాను మూలసూత్రధారి అని తెలిస్తే తనని ఎలక్షన్‌లో అనర్హుడుగా ప్రకటిస్తారు. ఎలక్షన్‌కు ఇంతవరకు ఖర్చుపెట్టిన డబ్బుతో పాటు తన పరువు అంతా పోతుంది. అందుకే ఎలక్షన్ అయ్యేంతవరకు కరమల పెద్దన్నకు బెయిల్ రాకుండా చూడమని తన లాయర్‌కి సూచనలు ఇచ్చి, ఇటువైపు కరమల పెద్దన్న కుటుంబంపై జాలిగా ముసలికన్నీరు కార్చుతున్నాడు.

ఈ అవమానంతో కరమల పెద్దన్న కుటుంబం చితికిపోయింది. తలెత్తుకోలేకపోయింది. ఏ దేవుడి దయ వల్లనైనా కరమల పెద్దన్న ఈ కేసు నుంచి బయటపడితే, ఉన్నపలంగా తాము ఈ ఊరిని వదిలేసి పట్టణంలో కూలోనాలో చేసుకుని బ్రతకాలనే నిర్ణయానికి వచ్చింది.

ఇలాంటి పరిస్థితులలో రమణబాబు తన తండ్రి అనుమతి తీసుకుని మంత్రాలయం వెళ్ళి రాఘువేంద్రస్వామిని దర్శించుకుని నాలుగురోజుల్లో వచ్చేస్తానని చెప్పి వెళ్ళినాడు. వారమైనా అతడు ఇంటికి రాలేదు. అయితే రాజశేఖరం కొడుకును గూర్చి పెద్దగా ఆలోచించలేదు. 'వీడెప్పుడు గుడులు, గోపురాలంటూ వారం పదిరోజులు బయట ఊర్లకి చెక్కేస్తుండటం మామూలేకదా' అనుకుంటు స్థితిమితంగా ఉండిపోయాడు.

ఒక వారం గడచిపోయింది. ఒకరోజు ఉదయం కరమల పెద్దన్న పోలీస్‌స్టేషన్ నుంచి బెయిల్‌పై పొద్దు పొడిచి పొడవంగానే ఊరిలోకి వచ్చాడు, తూర్పున మొలిచిన సూర్యుడిలా. కళ్లు చింతనిప్పులా ఉన్నాయి. మాసిన బట్టల్లో ఉన్నా మనిషిలో కొత్త ప్రకాశం కనబడుతోంది. ఊర్లోవాళ్లకు ఆశ్చర్యం వేసింది. రాజశేఖరంకైతే ఇంకా ఆశ్చర్యంగా ఉంది. తాను కదా లాయరు ద్వారా పెద్దన్నకు బెయిల్ ఇప్పించాల్సింది. ఎలక్షన్ అయ్యేంతవరకు పెద్దన్నను అక్కడే ఉంచేటట్టు చేయమన్నాను కదా? అయితే ఇది ఎలా జరిగిందబ్బా? అని అనుకుంటు ఏడవలేక నవ్వుతూ కరమల పెద్దన్నను పలకరించారు.

'పెద్దన్నా! ఇప్పుడు నిన్ను చూస్తే నాకు ఎంతో సంతోషంగా ఉంది. నిన్ను జామీను మీద బయటకు తీసుకురావడం కోసం నేను ఎంతో కష్టపడి బెయిల్ ఇప్పించాను' అని పచ్చి అబద్ధం చెప్పాడు. నిజానికి అప్పటి వరకు రాజశేఖరానికి తన కొడుకు గుంతకల్లు రైల్వేపోలీస్టేషన్‌లో లొంగిపోయాడన్న విషయం తెలుసుకోలేకపోయాడు. అందుకే రాజశేఖరం అబద్ధపు మాటలను కరమల పెద్దన్న వినిపించుకోన్నట్లుగా అతనివైపు చూడకుండా నిర్లిప్తంగా నవ్వుకుంటు తన ఇంటిలోకి వెళ్ళి భార్య, పిల్లల్ని పట్టుకుని తనివి తీరా ఏడ్చాడు.

పాపం పెద్దన్న ఆలోచనలో పడిపోయాడు. ఇన్నేళ్లుగా తనని ఈ ఊరు, ఈ జనాలు ఎంతగానో ఆదరించారని భ్రమపడ్డాడు. కాని తనని ఒక మసిగుడ్డపేలికలా, కూరలో కరివేపాకులా వాడుకుని ఇలా దూరంగా విసిరి పారవేస్తారని గ్రహించలేకపోయాడు. దు:ఖం తన్నుకొచ్చింది. ఆ బాధల ఆలోచనలో పట్టణంవైపు మనసు పోయింది. అక్కడ వీధుల్లో తోపుడు బండిపై కూరగాయలు అమ్ముకునేవాళ్లు, పాలమ్ముకునే వాళ్లు గుర్తొచ్చారు. పచారి కొట్టు, బడ్డీబంకులవాళ్లు గుర్తొచ్చారు. వాళ్ళంతా బ్రతకలేంది తాను బ్రతకలేడా? తన కుటుంబాన్ని పోషించుకోలేడా? అన్న ధీమా కొండంత బలాన్ని ఇచ్చినట్లైంది.

అప్పుడు ఆ చింతచెట్టు కింద నిరంతరం ఇన్నేళ్లుగా అగ్నిహోత్రంలా మండుతూ ఆ ఊరిని, ఆ పల్లె జనాలను ఆదుకుని అవసరాలను తీర్చిన కరమల పెద్దన్న 'కొలిమి' కూడా గుండెలవిసేలా విలపిస్తున్నందుకు గుర్తుగా కన్నీటి కడలిలో మునిగిపోతున్నట్లుగా ఆకాశం నుంచి దూకుతున్న ఆ కుండపోత వర్షంలో మునిగిపోతూ ఉంది.

◆

# మొండి టార్టర్

- తమ్మెర రాధిక
9440626702




దూరంగా నాగేటి చాళ్ళల్లో టార్టర్ ! ముళ్ళకంప !!
నిజమే ఎన్ని సార్లు దున్నినా ఎదిరించి మరీ ఎదుగుతోంది
ఎంత మొండి బ్రతుకు !
చివరి క్షణం వరకూ దాడి చేసిన వారిపై పోరాటం చేస్తూనే
ఎదుటి వారిని గాయం చేయకుండా
ఓటమి అంగీకరించదు కదా!
నిత్య యుద్ధాలే జీవన సరళిగా మారిప్పుడు మరీనూ!
కల్తీ మందులతో, తాలు విత్తనాలతో
వ్యవసాయం కత్తి మీద సాము
కురియని మేఘాలూ, ఉరమని ఆకాశమూ
అయినా మొక్కవోని ఆశలు పొలమంతా విత్తాడు రైతు
దున్నీ.... దున్నీ..... టార్టర్‌ని పెరికించెయ్యాలని చూసే అతని
గులకరాళ్ళ వెనకాల అనూహ్యంగా
పర్వతంలా ఎదిగొస్తోంది ముళ్ళమొక్క !!
బ్రతుకులో శతాబ్దాల పర్యంతం బానిసత్వ దుర్గతి
ధరల మోసాలు - వాన రాకలలోని
నిజా నిజాలు అస్పష్టత
చిరకాల మెతుకు బతుకును
సరి చేసుకోలేక పోయిన రైతును కమ్మిన మాయతెరలెక్కడివి?
రాజకీయాల విష కీటకాలు పంట చేలను ధ్వంసం చేస్తుంటే
విత్తన సామ్రాజ్యాలు ఏకఛత్రాధిపత్యపు విషకౌగిలో
బంధిస్తుంటే
వాతావరణం నిర్వీర్యమై కాలుష్యపు కోరలతో కాటేస్తుంటే
దళారీ వ్యవస్థ కుమ్మక్కై పంట కొల్లగొడుతుంటే
గోచీ పాతతో కయ్యమీద నెత్తిన చేతులు పెట్టుకొని
ఎముకల మీద చర్మం అతికి కట్టేసినట్టు...
ఆశాలతలు రైతు పాదాల్లో నాటి వళ్ళంతా పాకిద్దామన్నా
పురిట్లో పసికందులు చచ్చినట్టు, తీగ పారని ఆశలు
కొన వూపిరితో రైతు కంట్లో
మినుకూ మినుకూమంటున్నాయి!
ఏ గాలి తుఫానులు వారి కొన జీవితాన్ని ఆర్పివేస్తాయో!
పుట్టినప్పుడు పంచే ఆస్తితో పాటు
అశ్రువులు కూడా పంచారు తల్లితండ్రులు
కన్నీటి చెలిమలు తవ్వకోమని
ఎక్కడో దాచుకున్న వారి ఆర్ద్రతను
ఫెళ ఫెళార్భాటాలతో మబ్బులు తుడిచి పెట్టేస్తున్నాయి
కలిసి రాని ఋతువులు రైతు ఆశలని గిరఫ్తార్ చేస్తూ -
ఇవ్వాళ రాని మబ్బు, ఇవ్వాళ పడని చినుకు,
ఇప్పుడు చేతికి రాని పంటా
రేపెప్పుడైనా రావచ్చేమో ! అతని కళ్ళల్లో కనపడే
మృత్యుదృశ్యాన్ని వంద కోట్ల భారతీయుల్లో
ఒక్కరికైనా తుడి చెయ్యడం చేతకాదా !!
అందాకానైనా చిన్న రైతు బ్రతకాలి
'టార్టర్' లా ముళ్ళకంపై !!

(టార్టర్ అంటే ముళ్ళున్న మొండి మొక్క) ♦

---

# పునరుత్థానం

- పి. లక్ష్మణ్‌రావ్
9441215989

మదనపడినప్పుడల్లా
మనల్ని మనం
మదించుకుంటూనే ఉండాలి
ఆవేదన చెందినప్పుడల్లా
మనలోకి మనం
అవలోకించుకుంటూనే ఉండాలి
రోదించినప్పుడల్లా
మనల్ని మనం
శోధించుకుంటూనే ఉండాలి
ఆవేదన, రోదనల మధ్య
సంవేదనా రాగాన్ని
శృతి చేస్తూనే ఉండాలి
నిన్న, రేపుల మధ్య
నేటిగా బతకడం కోసం
కాలం గోటితో
జ్ఞానాన్ని మీటుతూనే ఉండాలి
భావానికీ, అక్షరానికీ మధ్య
కవితగా వెలగడం కోసం
నిత్యం రగులుతూనే ఉండాలి ♦






# సంక్షోభాల సజీవ చిత్రణ 'శికారి'

- ఎమ్వీ రామిరెడ్డి
9866777870

కథల మాస్టారు కాళీపట్నం రామారావు వర్తమాన సాహిత్య ధోరణుల గురించి మాట్లాడుతూ 'కూడు, గూడు, గుడ్డ కరవైన నిరుపేద బతుకుల గురించి కాస్త పట్టించుకో'మంటూ రచయితలకు సలహా ఇచ్చారు. క్రమం తప్పకుండా చదువుతున్న కథల్ని గుర్తు చేసుకున్నాను.

ఆకలి ప్రస్తావన అరుదు. నిలువనీడ లేని అభాగ్యుల ఆచూకీ బహు అరుదు. వంటిని కప్పే వస్త్రాలకూ నోచుకోని దరిద్రనారాయణుల గురించి అసలే ఊహించుకోలేం.

నిజంగానే పేదరికం మాయమైపోయిందా? లేక అన్నార్తుల గురించి రాసే కలాలు కరువయ్యాయా? అనే సందేహం వేధిస్తున్న సమయంలో పర్కపెల్లి యాదగిరి కథాసంపుటి "శికారి" నా చేతికొచ్చింది.

దాదాపు కథలన్నీ అచ్చమైన తెలంగాణ యాసలో ఉండటం వల్ల వాక్యాల్ని ఒకటికి రెండుసార్లు వెనక్కీ ముందుకీ చదువుతూ మెల్లగా కథల్లో లీనమైపోయాను. ఒక్కసారి ఆ పాత్రలతో, పరిస్థితులతో, పలుకుబళ్లతో మమేకమయ్యాక అందులోని వాస్తవిక నగ్నసౌందర్యం తాలూకు చేదునిజాలు నన్ను కుదురుగా నిలవనివ్వలేదు. ఏకబిగిన చదివి, అనుభూతుల్ని నెమరు వేసుకునే సరదా కథలు కావివి. పచ్చిపచ్చిగా పేదరికాన్ని రూపు కట్టిన వాస్తవ గాథలు.

◆◆◆

పర్కపెల్లి యాదగిరి కథల్లో... నడి పొద్దెండ కొర్రాయోలె మండుతాది. ఆగకుండా ముసురు కురుస్తాది. ఈదురుగాలులకు గుడిసెల మీది ప్లాస్టిక్ కాగితాలు ఎగిరిపోతుంటాయి. కుంపట్లో ఊక కాలుతున్న వాసన కమ్ముకుంటది. తూట్లుపడ్డ గొంగళి ముసుగు సరి చేసుకుంటది. పట్టగొలుసుల కోసం సంటిబిడ్డలు మారాం జేస్తుంటరు. అప్పులిచ్చిన సేట్లు రాక్షసావతారాల్లో అగపడతరు. శ్రమజేసి బత్కెటోల్లు కూటికోసం పేగులు దెంపుకుంటరు.

ఫ్యాక్టరీ నిర్మాణం కోసం భూములు కోల్పోయిన ఓ రైతు కుటుంబం పాతాళంలోకి కూరుకుపోయిన దీనగాథ "పాతాళగరిగె" కథ. "ఆ జుంపాలోడు తెల్లారంగనే దిగుతడు, ఆడు యాదికత్తనే కాల్రెక్కలు ఒన్కుతున్నయి" అని రాయేస్రవ్వ భీతిల్లిపోతున్న దృశ్యంతో కథ మొదలవుతుంది. అప్పు వసూలుకు వచ్చే కర్కోటకుడి గురించే ఆమె దిగులంతా.

"ఏం జేత్తాడు, పానం దీత్తడా" అని బీరాలు పోతాడు పెనిమిటి మల్లేష.

"అన్కి ఒక్క రెక్క కిందికి గావు నువ్వు, ఆల్లు నల్గురొత్తరు, బీమునోలె ఉన్నోల్లనే ఈపంత మండంగ జంపి గుంజ్కపొయ్యి ఆపీస్ల కూసోవెట్టుకున్నరు, నువ్వెంత" అని రాయేస్రవ్వ కస్సుమంటది.

మల్లేష అహం దెబ్బ తింటుంది. పెళ్లాన్ని తిడతాడు.

"బూములు పొయ్యేటట్టున్నయని అందరంటున్రు, బాకీలు జెయ్యకు ముండకొడ్కా అంటె ఇన్నవా" అంటూ రాయేస్రవ్వ దుమ్మెత్తిపోస్తుంది.

మల్లేషకు పౌరుషం పొడుచుకొచ్చి, భార్య వీపుమీద పిడిగుద్దులు కురిపిస్తాడు.

లేమిలో కుంగిపోయే కాపురాల్లోని కరకు వాస్తవాలకు అక్షర చిత్రీకరణ పట్టడంలో యాదగిరి దిట్ట.

మల్లేష అర్ధాంతర మరణంతో రాయేస్రవ్వ

కుమిలిపోతుంది. సందవ్వ అందించిన ధైర్యంతో బిడ్డతో పాటు సావుకారింటికి చేరుతుంది. సావుకారు చిన్నకొడుకు బిడ్డకు పాలిచ్చి, తన కొడుకు ఆకలి తీర్చలేక తల్లడిల్లిపోతుంది. యాత్రలకు వెళ్లిన సావుకారు, అతని భార్య దుర్మరణం చెందుతారు. వాళ్ల దశదిన కర్మ ముగిసేవరకు.. రాయేస్రవ్వకు తినేందుకు కూడా తీరిక దొరకదు. ఇంతకు ఇంత చాకిరీ చేసినా, ఆ బాకీ తీరదనీ, గుడిసె తన చేతికి రాదనీ గ్రహిస్తుంది రాయేస్రవ్వ. చావు తప్ప పరిష్కారం లేదని భావించి, సంటోడితో సహా చెరువులో నిమజ్జనం కావాలనుకుంటుంది.

సరిగ్గా ఇక్కడే యాదగిరి ఒక అద్భుతమైన ముగింపుతో కథను పతాక స్థితికి చేరుస్తారు. క్రూరుడైన జుంపాలోడు ఆమెను రక్షించి, గుడిసె తాళాలు, కొంత డబ్బు ఇచ్చి 'ఇన్నన్ని కూరగాయలో పండ్లో అమ్ముకోని బత్క'మని చెబుతాడు.

చీకటి తీరాలకావల వెలుగు ఉంటుందని, ఎప్పుడో ఒకప్పుడు మానవత్వం ఒంటికన్నుతోనైనా కరుణిస్తుందని పరోక్షంగా చెప్పిన "పాతాళగరిగె" ఓ అద్భుత కథ.

♦♦♦

వ్యవసాయ సంక్షోభానికి అద్దం పట్టిన మరో అక్షరాయుధం "గావు". పత్తిపంట చావుదెబ్బ కొడితే, గుక్క తిప్పుకోటానికి మస్కట్ పోయిన భర్త... వీసా సరిగా లేదని జైలుపాలవుతాడు. ఈ మలుపుల్లో అయిన అప్పులు తీర్చలేక, సంటిదాని పోషణ భరించలేక సతమతమవుతుంది లక్ష్మి. తల్లి ఇక్కట్లు తెలియని పాప పట్టగొలుసుల కోసం మారాం చేస్తుంది. ఆ కోరిక తీర్చలేని అశక్తత కోపం రూపంలో పాప వీపుమీద వాతలై తేలుతుంది. ఏడ్చీ ఏడ్చీ బిడ్డ నిద్రపోయాక, కూతురి శరీరంపై నల్లగా కందిపోయిన దెబ్బలు చూసి వలవలా ఏడుస్తుంది.

ఈ దృశ్యమే సరాసరి పాఠకుడి మనసు మీద దాడి చేసి బాగా డిస్టర్బ్ చేస్తుందనుకుంటే, 'సంటిది నిద్రమత్తులోనే తల్లి ముఖంలోకి చెయ్యిపెట్టి కన్నీళ్ల కోసం తడిమింది' అంటూ పేద హృదయాల ఆర్తరావంతో మరింత దెబ్బ తీస్తాడు రచయిత.

లక్ష్మి కష్టాల కారడవుల గుండా ప్రయాణించీ ప్రయాణించీ, ఏదో రూపంలో ఆసరా దొరికింది కదాని మురిసిపోతుంది. ఇక సూర్యోదయపు వెలుగులోని ఆనందాన్ని అనుభవించవచ్చుననుకుంటుంది. కానీ, కడుపులోని కుట్రను కథ చివరి వాక్యంలో బట్టబయలు చేస్తాడు రచయిత. "సంటిది మందుకల్లు తాగి తిరిగిరాని లోకాలకు తరలిపోయిం"దనే విషయం చెప్పి, మనల్ని మళ్లీ అడవులపాలు చేస్తాడు.

లేమిలో మలమల మసిలే కోరికల తీవ్రత, వాటిని నిజం చేసుకునేందుకు దృఢతరమయ్యే మానసిక సంసిద్ధతను నగ్నరూపంలో వర్ణించడానికి రచయితకు 'కట్టెలల్ల కాలిన అనుభవముండాలె'.

♦♦♦

ప్రముఖ కథారచయిత అల్లం రాజయ్య అన్నట్టు 'రైతు బతుకులోని అన్ని రకాల విధ్వంసాలను చిత్రించిన కథ' "శికారి". "పండిచ్చేటోల్లు పానాల్దీసుకోవట్రి, కొనేటోల్లు కోట్లు కూడ వెట్ట వట్రి" అని ఇత్తారి పాత్ర ద్వారా ఒక్క వాక్యంలో రైతుభారతాన్ని కథలబండి కెక్కించారు యాదగిరి. ఈ కథలో ఇత్తారి పాత్ర కష్టానికి ప్రతిరూపం. యాభై వేల అప్పు తీర్చడానికి వీరేశం సేటు దగ్గర నౌకరీకి కుదురుతాడు. చివరికి– కోడిపుంజును పట్టుకోటానికి పరిగెత్తీ పరిగెత్తీ ప్రాణాలొదిలేస్తాడు.

ఇత్తారి చనిపోయిన వార్త "విషవాయువులా ఆ ప్రాంతమంతా వ్యాపించింది" అంటాడు రచయిత. రైతుచావు సమాజానికి ఎంత ప్రమాదకరమో తెలియజెప్పే పదునైన వాక్యమది. పైగా ఇత్తారి మనవడు అనాథలా మారడం ద్వారా పేదోడి బతుకు వ్యవస్థీకృత విషాదంగా మారుతున్న కఠిన వాస్తవాన్ని కళ్లకు కడతారు.

"అవ్వు! ఇకమత్ బాగానే చేసింద్రు మామాకోడలు. పోలీసులకు పట్టిచ్చి తొండలు సొర్రకొట్టిత్త..." అంటూ అమాయకజీవుల్ని అన్యాయంగా బెదిరించే వీరేశంలు సమాజం నిండా వికటాట్టహాసం చేస్తున్నారని గొంతెత్తి చెబుతున్నారు రచయిత.

♦♦♦

అప్పుల గాయాలు అంతకంతకూ రాకాసిపుళ్లుగా మారి, రైతుబతుకు రంపపుకోతకు గురవుతున్న దుర్భర స్థితిని "శిల్లరజిత్తు" కథలో వివరిస్తారు. 'మూడ్రోజుల ఆకలిని మూట గట్టుకొని, గొడ్డలి భుజాన పెట్టుకొని, భీమ్లా కుటుంబం బుక్కెడు బువ్వను వెతుక్కుంటూ పట్నం చేరుకుంటుంది'. పిలగాని ఆకలి తీర్చడానికి ఫ్లోరైడు వ్యాధి వచ్చినట్టు వడదిరిగిపోయి ఉన్న మొద్దును ముక్కలుజేసే పనికి ఒప్పుకుంటాడు బీమ్లా. అది ఓ పట్టాన లొంగదు. ఆకలి అంతకన్నా లొంగదు.

కళ్లు బైర్లుకమ్మి కాలూచెయ్యీ ఆడని విపత్కర పరిస్థితిలో భార్య నీల ఎలుగుబంటిలా చింతచెట్టు ఎక్కుతుంది. చిగురు దూసి, పెనిమిటి నోట్లో, పిలగాని నోట్లో రెండు పిడికిల్లు

పోసి, ప్రాణాలు నిలుపుతుంది. బజారుకెళ్లి చింతచిగురు అమ్మి, ఇడ్లీలు తెస్తుంది.

ఇలాంటి గండాలు ఎన్నని దాటడం?

బగ్గ గుడంబ తాగి సోయి లేకుండా పడి ఉండే సాధువు కాళ్లు కడిగి, తన భక్తిభావాన్ని చాటుకుంటాడు సేటు. ఆ సాధువు నీల అన్నయ్య అని తేలుతుంది. అతగాడే దయదల్చి అక్కబావలకు అయిదు వేలిచ్చి, "మీరు ఊల్లె ఉండకుర్రి, బత్కపోరి..." అంటాడు. పొట్ట పోసుకోవడానికి పేదలు పల్లెల్ని ఖాళీ చేస్తున్న దృశ్యానికి ప్రతిరూపం ఆ వాక్యం.

"సౌందర్య మోహనం" కథ చదివినప్పుడు మన 'శరీరంలో ఒక నూతనత్వపు చలనాలు సుడులు తిరుగుతాయి'. సూక్ష్మంగా చూస్తే ఇదొక సరసమైన కథ. లోతుగా చూస్తే, ఇందులోనూ రచయిత పక్షపాత వర్గమైన బడుగుజీవుల మోహన సౌందర్యం మనసుకు కనిపిస్తుంది.

◆◆◆

'తూర్పువైపు ఆకాశమంతా మోదుగుపూలు విరగబూసి'నంత ఆహ్లాదకరంగా ప్రారంభమవుతుంది "స్రవంతి". ఈ కథలోని చిన్నారులకు కొందరు వ్యక్తుల పట్ల ఆరాధన ఉంటుంది. 'వాళ్లంతా పొద్దుపొడుపులో నుంచే వస్తున్నట్టుగా' అనిపిస్తుంది వారికి. తురకోల్ల తాత అట్లాంటి ఆరాధ్యుడే. పిల్లలకే కాదు, 'దుర్గ'కు కూడా. దుర్గంటే చిన్నారి కాదు. ఓ కుక్క. పిల్లలకు డబుల్ రొట్టెలు, బిస్కెట్లు అమ్మడంతోపాటు ఆ మూగజీవికి నిత్యం ఆహారం అందించే తాతకు కుక్క ఆత్మబంధువు కన్నా ఎక్కువ. ఆరోగ్యం బాగోకపోయినా తాత తంటాలు పడి మరీ ఆ మైదానానికి వస్తాడు.

మున్సిపాలిటీ వాళ్లకు మాత్రం అవన్నీ పరమ అనవసర బాంధవ్యాలు. సమాజాన్ని ఉద్ధరించడానికని మైకుల్లో బాకాలూదుతూ ఆ కుక్కకు మందు తినిపిస్తారు. ఆ జాతికి శాపంలాంటి 'రేబిస్' వ్యాధి, వీళ్లకో అవకాశం. దాన్ని బతికించుకోటానికి పిల్లలూ కొందరు పెద్దలూ చేసిన ప్రయత్నాలేవీ ఫలించవు. కుక్క చనిపోతుంది. తాతకు ఆ విషయం ఎలా చెప్పాలా అని మథన పడుతున్న పిల్లలకు ఆయన కూడా కనిపించడు. కొన్నాళ్ల తర్వాత తాత డ్యూటీలో ప్రత్యక్షమైన అవ్వ పిల్లలకు దుర్వార్త చెబుతుంది.

సాధారణంగా సాగిపోయిన ఈ కథ చివర్లో 'వాళ్లిద్దరూ స్వర్గంలో కలుసుకుంటారన్న తృప్తి' అని ముగించడం ద్వారా రచయిత తన పరిణతిని చాటుకుంటారు.

సహజంగా విప్పారే వర్ణనలు

తన కథల్ని బొమ్మల్లా చెక్కుకుంటూపోవడం పర్కపెల్లి యాదగిరి ప్రత్యేకత. స్వయంగా చిత్రకారుడైనందున ఆయనకా విశిష్ట లక్షణం అలవడి ఉండవచ్చు. అది ప్రతి కథలోనూ విలువైన చేర్పు. చాలాచోట్ల ఆయనలోని కవి ఒళ్లు విరుచుకుంటాడు. ఆ ఉద్వేగంలోంచి సహజాతి సహజంగా వాక్యాలు దొర్లిపోతాయి. ముఖ్యంగా ప్రకృతినీ, పేదవారి ఇళ్లముంగిళ్లనీ వర్ణించేటప్పుడు ఆయన పరకాయ ప్రవేశం చేస్తారు. ఉదాహరణకు 'పాతాళగరిగె' కథలోని కొన్ని...

'వర్షంలోనే చెట్టులా నిలబడిపోయాడు చాలాసేపు',

'నిమిషాలు నీటివరదలా పారుతున్నాయి'

'ఆకాశం ఏమీ ఎరుగనట్టే తూర్పు వైపు ఎరుపురంగు పులుముకుంటోంది'

'సౌందర్య మోహనం' కథలో 'గోధూళితో సంధ్యకు వందనాలు సమర్పించుకుంటూ నదీప్రవాహంలా సాగుతున్నాయి గోవులు', 'నీలాకాశంలో పసుపుతో తిలకం దిద్దుకున్నట్టుగా చంద్రబింబం' అంటూ అక్షరాలతో సుందరచిత్రాలు నిర్మిస్తాడు రచయిత.

కథ నడిపే తీరులోనూ రచయిత చాలా జాగ్రత్తలు తీసుకుంటారు. ఉదాహరణకు...

'పైనాన్సంటే కోర్టు ఆడ్డరసొంటిది' (పాతాళగరిగె)– అప్పు ఇచ్చిన సేటు అన్న మాటిది. పెద్దోళ్లు ఏం జెప్పినా చెల్లుబాటవుతుందనే విషయాన్ని చిన్న వాక్యంలో ప్రభావశీలంగా చెబుతాడు.

'ఇయ్యాల మా నాయ్నకు నైవేద్గం బెట్టేదాన్క మంచిలీల్లు నోట్లె పొయ్యం' (శిల్లరజిత్తు)– కనీసం దాహార్తి తీర్చే దయ లేకపోగా, సాంప్రదాయిక చాడీలు చెప్పే చాలామందిని ఉతికి ఆరేస్తాడు.

'సీతమ్మ అసొంటింది జంగల్ల ఉండలేదా' (గావు).

ఇలా ఎన్నో కాఠిన్యపుటక్షరాలు పుస్తకం మూసేశాక కూడా వెంటాడతాయి.

నీల, భీమ్లా, ఇత్తారి, లక్ష్మి, రాజేశ్వరి, నర్సిమ్లు, సరోజన, సోమయ్య, మల్లేశు, రాజాలు, భిక్షపతి, భాగ్యమ్మ, రామారావు, ఎల్లయ్యసారు మన చుట్టూ పరిభ్రమిస్తుంటారు. రేపట్నుంచీ వాళ్లు ఏయే రూపాల్లో మన చుట్టూ నివసిస్తున్నారో పోల్చుకోగలుగుతాం. ఆధునిక ఆడంబరాల ఆకాశంలోంచి నేల మీదికి దిగి, వాస్తవం వాకిట అడుగు పెట్టగలుగుతాం.

జీవన సంక్షోభాలకు కారణమవుతున్న వివిధ అంశాలపై దృష్టి సారించి, మరిన్ని మంచి కథలు రాయగల సత్తా పర్కపెల్లి యాదగిరికి ఉందని ఈ కథాసంపుటి బాస చేస్తోంది. ◆

# నాలుగు కాళ్ళ మండపం

- కంచనపల్లి ద్వారకనాథ్
9985295605



వేకువనే
నగరం నడిబొడ్డులో
యుద్ధానికి సిద్ధమైన సైనికుల్లా
పలుగు, పార,
గడ్డపార, టకార,
దిమిశ, సుత్తి,
తాపీ, పిక్కాసు చేతపట్టి
కవాతు చేసే సైనికుల్లా
ఉదరంలో జఠరాగ్ని కుండంలో
ఆష్ట మథనంతో ఉద్భవించే
ఆకలే బంధమైనప్పుడు
ఊరువదలి, వాడవదలి
బంధువులు, బంధాలు, బంధనాలు, వదులుకుని
అనురాగాలు, ఆప్యాయతలు, కడుపుతీపులు తెంపుకుని
హద్దులు, సరిహద్దులు దాటి
ఊరి నుండి బహిష్కరణకు గురైన వారిలా
కరువు ప్రాంతం నుండి
కదలివచ్చిన శరణార్థుల్లా
బ్రతుకు తెరువు మనుగడ కోసం
కాంక్రీట్ కీకారణ్యంలో కాలుపెట్టిన నిర్భాగ్యులు వాళ్ళు
వలస వచ్చే గువ్వల్లా బారులు తీరిన విహంగ విచరితులు
పనికోసం ఎదురుచూసే చకోరపక్షులు
సుఖదుఃఖాలు నడుమ అనంతమైన వైరాగ్యాన్ని
అదిమిపెట్టీ
పట్టెడన్నం కోసం అలుపెరుగక
మట్టిని మహాప్రసాదంలా తలచి
మహా ప్రసాదాలు నిర్మించే పునాది రాళ్ళు వాళ్ళు
దుఃఖపు వెతల బ్రతుకులలో అలసి
నిద్రించినా స్వప్నాలు రానివాళ్ళు
ధనవంతుల స్వప్నాలకు ఆకారాలు దిద్దే
అపర బ్రహ్మలు వారు
నక్షత్రాల హోటళ్ళు, కళ్యాణమండపాలు,
అపార్ట్‌మెంటులు, వాణిజ్య సముదాయాలకు
నగిషీలు చెక్కే శిల్పులు వాళ్ళు
స్వేదం, రుధిరం రంగరించి
ప్రాణాన్ని పణంగా పెట్టి
ప్రమాదపుటంచున ప్రయాణించి
రంగులు వెలిసిన బ్రతుకు లైన
రంగు రంగుల ఇంద్రధనుస్సు రంగులద్ది
హంగుల ఇంద్రభవనాలు నిర్మించే అమర శిల్పులు వాళ్ళు
జవం జీవం ముక్కలౌతున్నా
సుందర మందిరాలు, రమ్య ఆకాశ హర్మ్యాలు
నిర్మించే కలియుగ మయులు వాళ్ళు
రాళ్ళు మోస్తూ... శ్రమను పణంగా పెట్టి
సాంకేతిక, నాగరిక నగరాలకు
అద్భుత కట్టడాలు ఆవిష్కరించే
భవన నిర్మాణ శాస్త్రజ్ఞులు వాళ్ళు
పనిలేని రోజుల్లో
దారిద్ర్యపు శోక భయాలతో
కన్నీటి తుఫానులు చెలరేగినా
విషాద మేఘాలు కమ్ముకున్నా
జీవన సంక్షోభం సుడుపెడుతున్నా
అశోక తమో తీరాలని దాటించి
దారి చూపే దివిటీల కోసం
ఊతనిచ్చే చేయూత కోసం
మట్టిని నమ్ముకున్న వాళ్ళ బ్రతుకుల్లో
వేకువ సూర్యుడు ఎప్పుడు వస్తాడని
వాళ్ళ కళ్ళు ఎదురు చూస్తూనే వున్నాయి
వేకువ కాగానే పలుగు, పార చేతపట్టి
పనికోసం కాళ్ళు కదులుతూనే ఉన్నాయి.

**(తిరుపతి నడిబొడ్డులోని నాలుగు కాళ్ళ మండపం దగ్గర రోజూ పనికోసం నిరీక్షిస్తున్న భవననిర్మాణ కార్మికులను చూసి...)**

◆



# మోహం తీర్చే విమర్శ ఏదీ?

- టి. సతీశ్
9391614443

ఫిబ్రవరి సంచికలో తెలకపల్లి రవి రాసిన 'సాహిత్య రంగంలో సమూహాలు, స్వమోహాలు' వ్యాసానికి స్పందన

స్వమోహం కవిత్వానికే పరిమితం కాదు. సాహిత్యానికంతా వర్తిస్తుంది. ఆ మాటకొస్తే వర్తమాన సమాజానికంతా బాగా వర్తించేమాట. ప్రస్తుతం సాహిత్యానికి పరిమితమౌదాం. వర్గ స్వభావం సమాజానికికాదు, మనుషులకూ విస్తరించింది. ఎవరికి ఆనందం ఎక్కడ దొరికితే అక్కడ చేరడం సహజం. విజ్ఞానం అందుకు అతీతమేం కాదు. సమాజంలో విభిన్న ఆకాంక్షలు, ఆశయాలూ, పరిష్కారాలూ ఉన్నంత కాలం ఈ సమూహాలు ఉంటాయ్. వీటితో పెద్దగా నష్టంలేదు.

ఎటొచ్చీ సమస్య స్వమోహాలతోనే. తాము నమ్మిందీ, పాటించేదే సరైనదనే దృక్పథంతో ఇతర మార్గాల్ని దూషిస్తూ ముందుకెళ్ళడం స్వమోహంలో ప్రధాన లక్షణం.

తెలుగు సాహిత్యంలో సమూహాలూ, స్వమోహాలూ ఎప్పటినుంచో ఉన్నవే. వీటిని చూసి తెలకపల్లి రవి బాధపడుతున్నట్టు ఎందరో సాహితీ ప్రియులు మథన పడుతున్నదే. ఇలాంటి వేషాలు చూసి సాహిత్యేతర వ్యక్తులు కూడా బాధపడుతున్నారు. ఒక్కోసారి సాహిత్యరంగాన్నే అసహ్యించుకుంటున్నారు. కారణాలు సరే. ఎవరైనా చెప్తారు. పరిష్కారాల మాటేమిటి?

విద్యార్థి గురువుకు, అసిస్టెంట్ ప్రొఫెసర్ ప్రొఫెసర్కి చిన్నరచయిత పెద్దరచయితకు, సభ్యుడు అధ్యక్షుడికి, ఉద్యోగి యజమానికి సలహాలు చెప్పకూడదు. అనుభవం, వయసూ, డబ్బూ, పరపతి, సంఘంలో గౌరవం ఇలా ఒకటేమిటి కారణాలు ఎన్నో. పొగడ్తలు (పొగడ్డం, పొగిడించుకోవడం) వీటికి అదనం.

ఇలాంటప్పుడు ప్రగతిశీల భావాలకంటే, స్వలాభం కోసం కుల, మత, ప్రాంత, లింగ, వయోది అనంత కారణాలతో ఎవరికి తోచినట్లు వాళ్ళు చీలిక సంఘాలుగా ఏర్పడుతున్నాయ్. ఇవన్నీ భజన సంఘాలే. వాళ్ళు ఏర్పాటు చేసుకుంటున్నవి ఆధునిక భజన సభలే. ఇవాళ ఒక్కటంటే ఒక్కటి - ఏ ఒక్క సాహిత్య సభా సమ్మిళితంగా జరగడంలేదు. సభల తర్వాత విజయవంతమని భజాలెగరేసి, గప్పాలు కొట్టడం తప్పా నిజంగా విజయవంతమౌతున్న సభల్లేవ్. కొంత వరకూ భాషాశాస్త్రం వాళ్ళు జరుపుతున్న సభలు నయం. అక్కడ విభిన్న భావజాలాలకు, ఆలోచనకు చోటుండడమేగాక పరిష్కారాలు కూడా దొరుకుతున్నాయ్.

ఎవరైనా ఎలాంటి కల్మషం లేకుండా ఎదుటివారి తప్పుల్ని ఎత్తి చూపారో, ఇక అంతే. వాళ్ళ క(ఖ)ర్మ కాలిపోవాల్సిందే. ఇక అప్పటి నుండీ వాళ్ళు ఈ స్వమోహుల దృష్టిలో శత్రువులైపోతారు. వీళ్ళ వ్యతిరేక ప్రచారానికి, నిందలకు, నిష్టూరాలకూ బలి కావాల్సిందే. ఇదెక్కడి గొడవని కొంతమంది అసలు విమర్శ జోలికి రారు. కొందరు విమర్శలో లౌక్యం

నేర్చుకుంటారు. మరికొందరు ఎవరెక్కడపోతే మనకేమని విమర్శ పేరుతో భజనచేసి తమక్కావాల్సింది సాధించుకుంటారు.

నిఖార్సైన విమర్శ యువత చేస్తే ఆహ్వానించే వాళ్ళెంతమంది? ఆ విమర్శ వల్ల తమ ఎదుటివాళ్ళు ఇబ్బందిపడితే సరే. అంతా బాగానే ఉంటుంది. అది తమ దాకా వస్తేమాత్రం, కథ అడ్డం తిరుగుతుంది. ఇక ఆ యువ కిశోరం రచనలు అచ్చవకుండా, పేరు రాకుండా, ఎదగనివ్వకుండా వృద్ధ జంబూకాలు చేసే ఫీట్లు అన్నీ, ఇన్నీ కావు. కొంతమంది దీన్ని వ్యతిరేకిస్తారు. సూర్యోదయాన్ని అర చేతితో ఆపలేరన్న వెధవ పోలికల్ని తగిలిస్తారు. కానీ, ఆచరణలో ఇది నిజం. అందుకే పాతపత్రికల్లో కొంతమంది రచయితలు ఇలాంటి పెద్దల పెద్దరికాలకు జడిసి మారుపేర్ల(కలంపేర్ల)తో వ్యాసాలు రాశారు. విమర్శ, ప్రతి విమర్శల్ని హుందాగా తీసుకునే రచయితలు నేడు ఎందరున్నారు?

నేటి విమర్శలో లౌక్యం రాజ్యమేలుతోంది. ఎవరు అవునన్నా కాదన్నా ఇది నిజం. అన్ని రకాల భావజాలాల వాళ్ళలో ఇది సమంగానే కన్పిస్తోంది. సాహిత్యరంగంలో అంటరానితనం భావన వేళ్ళూనుకుపోయింది. ఒక రకమైన ఆలోచనలున్న వాళ్ళు, మరో రకం వాళ్ళ రచనలు చూడనైనా చూడరు.

సర్దేశాయ్ తిరుమలరావు, రారా, చేరా, బూరా, బాలగోపాల్ వంటి నేటి యువ విమర్శకులకు మార్గదర్శకంలాంటి విమర్శకులు ఇప్పుడు ఎక్కడున్నారు? కెకెఆర్, డి.చంద్రశేఖర్ రెడ్డి, మేడిపల్లి రవికుమార్, పాపినేనిలాంటి వాళ్ళు అక్కడక్కడా ఉన్నా, చాలామంది భావజాలాల చట్రాల్లో ఇరుక్కున్నవాళ్ళే. తెలుగు విమర్శను ఇరుకు దారుల్లో నడుపుతున్న వాళ్ళే. అలాంటి వాళ్ళవల్ల స్వమోహాల సమూహాలు పెరగక ఏమవుతాయ్? ఉంటే లెఫ్టు లేదా రైటు. దీనివల్ల సాహిత్యరంగం బావుకునేది ఏముంటుంది? మళ్ళీ సమూహాలు తప్పా. రెండింటి సమన్వయం అవసరం లేదా? విమర్శకులు పరిమిత పరిధిలోనే ఎందుకు ఆలోచిస్తున్నారు? పాఠకుల అవగాహన్ను విస్తృతపరిచే విమర్శ నేడు ఎందుకు లేదు? చేరా-సంపత్కుమార, చేరా- నారా, చేరా-బూరా, చేరా-రంగనాయకమ్మ, రారా- అద్దేపల్లి, త్రిపురనేని-లక్ష్మీనరసయ్య వంటి విజ్ఞానాన్ని విస్తృతపరచే సంవాద(విమర్శ - ప్రతి)విమర్శ తెలుగులో ఇప్పుడు కన్పించడంలేదు ఎందుకనీ? సమన్వయ విమర్శ నేటి తెలుగు సాహిత్యానికి అత్యవసరం. విమర్శ విధానాల్ని పునః సమీక్షించాల్సిందే.

ఇవాళ రారా బతికి ఉంటే అనే ఊహా కల్పనలు అనవసరం గానీ, అలాంటి నిబద్ధ, నిష్పక్షపాత, మొహమాటాల్లేని విమర్శకుల అవసరం తెలుగు సాహిత్యరంగానికి అత్యవసరం. నేటి విమర్శకులందరికీ రారా లేఖలు కరదీపికలు. ఇప్పుడు తెలుగు విమర్శ పేరుతో సమీక్షలే వస్తున్నాయ్. నచ్చితే పొగడ్తలు, లేకుంటే తెగడ్తలు. ఆ నచ్చడాని క్కూడా చాలా రిజర్వేషన్లు. ఇలాంటి సమయంలో రారా రచనల్ని, ముఖ్యంగా లేఖల్ని ఓసారి చూడండి. రారాను అనుసరించడం కాదు. ఆ ముక్కుసూటితనం, నిజాయితీ ఎంతమందిలో ఉంది?

ఇప్పుడున్న పత్రికలన్నీ నిర్దేశిత పాఠకుల్ని **(Targeted readers)** దృష్టిలో ఉంచుకుని వస్తున్నవే. నాలాంటి యువ పాఠకుడికి రాజకీయపక్షపాత పత్రికలు తప్పా, సాహిత్య నిష్పక్షపాత పత్రికలు కన్పించడంలేదు. భావజాలాల్ని మోస్తున్న పత్రికలు తప్పా, భావ వైవిధ్యాల్ని చూపించే పత్రికల్లేవ్. ఈ రకంగా ప్రస్తుత పత్రికలన్నీ సాహిత్య 'మూస'పత్రికలే.

ఒక్కో కూటములకు ఒక్కో పత్రిక. అలా ఉండకూడదని కాదు. దాదాపు ఆ కూటముల్లో ఉన్న వాళ్ళ రచనలకే ఆ పత్రికల్లో చోటు. వాళ్ళ భావాలకు వ్యతిరేకంగా వచ్చిన వ్యాసాలకు ఆ పత్రికల్లో చోటుండదు. ఈ పత్రికలో సంప్రదాయ సాహిత్యం తప్ప వెయ్యం అని కొందరంటే, కొందరు ప్రగతిశీల రచనలు తప్ప వెయ్యం అంటున్నారు. ఇదేం విడ్డూరం. సంప్రదాయ పత్రికల పేరుతో వచ్చేవి ప్రగతిశీల భావాల్ని ఎట్లాగూ అచ్చెయ్యవు. మానెయ్యనీ. మరి, ప్రగతిశీల పత్రికల మాటేమిటి? అభివృద్ధి నిరోధక భావాలు ఉన్నాయని అచ్చెయ్యడం లేదు అంటున్నారు. అట్లాంటివి అచ్చేసి, వాటికి స్పందనగా వాటిలోని తప్పుల్ని ఎత్తి చూపుతూ విమర్శ ఎందుకు చెయలేకపోతున్నాయ్. నిజానికి ఇలా ఒక రచనని అచ్చేసి, వాటి లోపాల్ని చెప్పినపుడు, పాఠకులు రచయితల్ని సరిగ్గా అర్థం చేసుకోగలరు. రచయితలు కూడా ఒళ్ళుదగ్గర పెట్టుకుని రచనలు చేస్తారు.

తెలుగు విమర్శలో మార్క్సిస్టు భావాలతో విమర్శ బయల్దేరడం ఒక మంచి పరిణామం. విమర్శ

# మా పొరపాటే బిడ్డా

- కాట్రాజు లావణ్యసైదీశ్వర్
9603763848

బిడ్డా..
నీ లేత వేళ్ళకు
ఇనుప గోళ్ళను తొడగకపోవడం మా పొరపాటే..
నిన్ను అణుకువగా కాదు
ఆయుధంగా మార్చకపోవడం
మా పొరపాటే..



మనుషులు మృగాలుగా మారుతున్న
ఈ మైదానాల్లో పసిమానాలై వసివాడిపోతుంటే
ఉగ్గుపాలతోటే యుద్ధ మెలకువలు నేర్పకపోవడం
మా పొరపాటే..

పొదలమాటున నీపై
గునపాల పోటుకు అర్థంకాని
బాధేదో మెలిపెడుతుంటే
నీ ఆక్రందన వినని మొద్దునిద్రపోతున్న సమాజాన్ని
చర్నకోలా నీ చేతికిచ్చి చరిచి చరిచి
చీల్చిచెండాడమని అరచి చెప్పకపోవడం
మా పొరపాటే..

నువు పురిటి బిడ్డవైనా ...
కాటేసే కామందుడి అంగాన్ని
పదునుగోళ్ళతో పెరికి గుమిగూడిన వ్యవస్థపై
సవాలుగా విసరమని
చెప్పకపోవడం మా పొరపాటే..

ఇంతకాలం జరిగింది
పొరపాటే బిడ్డా..
ఇకముందు నువ్వు ఆడపిల్లవి కాకూడదూ
అపరకాళివి కావాలి..
నీపై చూపు సోకితేనే వాడికి
చావుకేక రుచి చూపించాలి
నిన్ను అలాగే పెంచుతాం..
నిన్ను నిన్నుగా కాపాడుకుంటాం..
మమ్మల నమ్ము బిడ్డా.. ♦

---

ప్రజాస్వామ్యీకరణ మొదలైంది. అప్పటి వరకూలేని వైరుధ్య భావాల పరస్పర ప్రకటన ఊపందుకుంది. అలాంటివాళ్ళు కూడా నేడు చాలా పరిమితుల్లో ఇరుక్కోవడం బాధాకరం. పాతబడిన భావాలతో పిడివాదానికి దిగితే, ప్రయోజనం శూన్యం. మేలు కంటే కీడే ఎక్కువ జరుగుతుంది. సమకాలీన అవసరాలకు అనుగుణంగా విమర్శలో సహేతుక మార్పులు చేసుకుంటూ ముందుకెళ్ళాల్సిన సమయం దగ్గర పడింది.మొహమాటాల్లేని విమర్శల ప్రస్థానానికి 'ప్రస్థాన'మే ఎందుకు మొదలుపెట్టకూడదు? వైరుధ్య భావాల చర్చల్లోంచి ప్రగతిశీలతను 'ప్రస్థానం' ఎందుకు ముందుకు తీసుకురాకూడదు? అందుకు తెలకపల్లి రవి వ్యాసం 'రగుల్కొనే రాక్షస బొగ్గు'లా పనికొస్తుందనుకుంటున్నా.

సాహిత్యరంగంలోని వాళ్ళు, వాళ్ళదారులు వాళ్ళు చూసుకుంటున్నారు. ఇలాంటి సమయంలోనే విమర్శ బెత్తంలా పనిచేయాల్సిందే. అందుకు ప్రగతిశీల వాదులంతా ముందుకు రావాలి. పరిమిత గుంపుల తక్షణ లాభాల వికృత క్రీడల్ని, ఆపాలంటే అంతే వేగంగా మాట - చేతకు పదును పెట్టాలి. చేతకానివాడి ప్రేలాపన కన్నా, సమర్థుడి మౌనం ఎక్కువ నష్టం చేస్తుంది.

నేటి విమర్శకుల్లో యువతరం ఎంత? ప్రశ్నిస్తున్న యవతరం ఏదీ? గుడ్డెద్దు చేలో పడ్డట్టు అనుకరిస్తున్న యువతరం ఇంకెంతకాలం? అసలు యువ విమర్శకుల గొంతు వినిపిస్తోందా, యువతకు సరైనదారిలో దిశానిర్దేశం ఏదీ? నికార్సైన యవతరాన్ని ప్రతి ప్రగతిశీలవాదీ ముందుకు తేవాల్సిందే. పాత భావాల బూజు పోవాల్సిందే. సహేతుక కారణాల్ని చెబితే, ఎంతటి మేధావైనా ఒప్పుకోవాల్సిందే లేదా తప్పించాల్సిందే. ఇవి జరగాలంటే మొదట విభిన్న భావాలు వినాలి కదా?

మాటలుకాదు, చేతలు కావాలి. సిద్ధాంతాలుకాదు, ఆచరణ కావాలి. మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను - ఆచరణ. ఆచరణ ముఖ్యం. స్వమోహాలు బద్ధలు కొడితేగానీ, సమూహాలు పోవు. కాబట్టి మోహం తీర్చే విమర్శ కావాల్సిందే, రావాల్సిందే. అందుకు 'ప్రస్థానం'పూనుకుంటుందనే ఆశతో నిజమైన, ఆచరణాత్మక ప్రగతిశీలురందరికీ సాదర స్వాగతం... ♦




# ఆధునిక మానవ జీవన చిత్రం

- మందరపు హైమవతి
9441062732

అనంతమైన వేదన నుంచి వచ్చేదే కవిత్వం. సిద్ధార్థ 'బొమ్మలబాయి'లో కవితలన్నీ దుఃఖవర్షంలో తడిసిన అక్షరాలు. వేదనల కొలిమిలో తప్తమైన పదాలు. బాధల అగ్నిలో కాలి నిగ్గు తేలిన వాక్యాలు.

ఈ సంపుటిలో ఎక్కువ కవితలు తెలంగాణా గురించి రాసినవే. గతకాలపు హింసతో కూడిన విధ్వంసక మూలాల లోతుల తవ్వులాట ముఖచిత్రమే ఈ బొమ్మల బాయి కవితాసంపుటి. దీనిలో తెలంగాణ యాస చారిత్రక నేపధ్యం, వర్తమాన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల వెదుకులాట కోసం పడే అంతర్లీన యాతన మనకు రూపుకడుతుంది.

పురాస్మృతుల వెంపర్లాటలోని దృశ్య చిత్రాలను అనుభవించి, పలవరించి కలత చెందిన క్షణాలను నెమరువేసికొంటున్న సందర్భాలు ఇక్కడ అక్షర రూపం దాల్చాయి.

ఆత్మాశ్రయ పురావస్తు ధ్వని అంతర్లీనంగా గూడుకట్టుకొని మనసు లోతుల్ని తడుముతుంది. వైయక్తికమైన ఈ జీవన సంఘర్షణే కాల్పనిక, సామాజిక దృక్పథాన్ని యాస బాసలో ప్రతిబింబిస్తుంది. ఈ తడి చూపుల అంతర్వేదనను కవిత్వంగా పరచి నడిపించిన తీరు వర్తమాన కాలాన్ని పట్టి చూపుతుంది.

ఆధునిక కాలంలో సాహిత్య ప్రక్రియల్లో వచనకవిత, పాట ప్రాముఖ్యం చెందినవి. వచనకవిత సాహిత్యంతో పరిచయం వున్నవారికి మాత్రమే అర్థం అవుతుంది. కాని పాట పాటక జనాలను గూడ పరవశింప చేస్తుంది. అందుకే సంగీత సాహిత్యాలను గురించి చెప్తూ "ఏకమాపాతమధురమ్ అన్యదాలోచనా మృతమ్" అన్నారు. విన్నవెంటనే అపరిమితమైన ఆనందాన్ని కలిగిస్తుంది పాట. అందుకే శ్రీశ్రీ తన మహా ప్రస్థానంలో 'చందస్సుల సర్ప పరిష్వంగాలు వదలి, వ్యాకరణాల సంకెళ్లు విడచి' అని అన్నా మహాప్రస్థానంలోని కవితలన్నీ ఛందస్సుతో కూడినవే. అందులో గేయాలన్నీ లయబద్ధమైనవే.

సిద్ధార్థ కవితా సంపుటిలో చాలా కవితలు గానయోగ్యమైనవి.

'జాజుకిటికీ" కవిత పరిశీలించండి.

**"ఉయ్యాలో ఉయ్యాలా / రేగు పొదలా చెల్కలు / పొడిపొడిగా వానలూ / సగం తడిసిన పాదాలూ / రక్తమోడిన కడియాలు / నన్నీ ఏడుపు మూలకు చేర్చి"** అంటారు. మరో కవిత "వానలూ సిప్తల వనాలు'లో

**"సినుకురాని కాలమాయె / సిమసీకటి బతుకులాయె/ రోకండ్లూ పగిలిపోయె/ ఒక పరాధీన రేఖకు / నిప్పు ముట్టించుకొని / ఢిల్లంభల్లం / ఢిల్లంభల్లం /" అని అంటారు. కురిసిన వానలన్ని ఏమయిపోయ్యాయి / సిప్తల కొమ్మల్లో కురిసి మురిసాయి / పసిరిక పాములు నాకి మురిపించాయి"** అని పాటలాగ సాగుతుంది.

తెలంగాణా రాష్ట్రపోరాట ఉద్యమంలో పాటదే పైచేయి. చాలామంది కవులు పాటను ఆయుధంగా చేసికొన్నారు. పూర్వ కవుల దగ్గరనుంచి, ఆధునిక కవుల వరకు తమ కవితారీతుల

గురించి తమ కావ్యాలలో చెప్పుకున్నారు. సిద్ధార్థ కూడా **'వాక్యమంటే చిందుబాగోతమయ్యా! దాని రక్తమారదు/పెను రక్తచాపం / దాని గొంతెప్పుడూ జియాగూడ కబేల/ గన్నేరు కాయల్ని తంగేడు మొగ్గల్ని డొక్కల్లో కుక్కుకుంటుంది / దాన్నే పాము కాటేసిందో / దాన్నే కొరకాలిప్పుడు / దూవదూవ... సైసుబిడ్డా.... దూవ... దమ్మమూర్తీ... ఒక్కసారైనా చూడు"** అంటారు.


**సిద్ధార్థ**

ప్రపంచీకరణ ప్రభావం వలన దేశంలో చాలా చోట్ల ప్రాంతీయభాషలు, వేషభాషలు అంతరించి పోయాయి. ఈ సందర్భంలో బాధపడుతూ కవి **"భాషంతా చెద పురుగు ' అనలిది అంతరించిపోతుంది / పెనుగాయమొక్కటే బతుకు"** అని భాషలు తమ ప్రాభవాన్ని కోల్పోవడాన్ని వర్ణించారు.

**'సీమ సింతకాయ రాత్రి'** కవితలో బాల్య జ్ఞాపకాలను నెమరేసుకొంటారు. తనను పెంచిన నాయనమ్మ గురించి, శివుని గుళ్ళోకి తీసుకువెళ్ళిన పొన్నమ్మ గురించి, రాతలు దిద్దించిన యాదక్క గురించి తలపోసుకుంటారు. వీరంతా లేతెండలోని గాలిని సవ్పరించడం నేర్పారని బరువెక్కిన జీవితం గురించి **"ఎంత బరువెక్కిందో జీవగణితం/సుతి తప్పిన కతలూ / శిలువెక్కుతున్న రాతలూ"** అని సంక్లిష్టమైన ఆధునిక జీవితాన్ని వర్ణిస్తారు.

ఏడ్చేవాడే ధైర్యం గలవాడనీ, తెగించే వాడే తెలివైనవాడని చెప్పిన పెద పెద్దమ్మా గుమ్‌డెల్లి రంగక్క గురించి తలపోసుకొంటూ **"కొత్తగా సచ్చిపోవడం / పాతగ పుట్టడం / మనకు గాక ఎవరికి తెలుసు / పజ్జొన్నల విత్తులోపల దాక్కున్న పొద్దులం మనం / పోరులం మనం / ఈ రాత్రి ఎండిపోని సీమసింతకాయ చెట్టు / ఇది / రాయని / కవిత్వమూ / మోయలేని శానతనమూ"** అని ఆనాటి అనుభూతులని తలచుకొంటారు.

మరో కవితలో **"నేనొక డిస్క్‌నైపోయాను / కంప్యూటర్ వేలిచివర చెద కురుపునై పోయాను / సేలబిలిటీని / ఫాస్ట్‌ఫుడ్ ఫర్నేస్‌లో / డిజిటల్ నిశ్శబ్దాన్ని బావురుమంటున్నాను"** అని ఆధునిక మానవుడు కంప్యూటర్‌కు బానిసవడాన్ని చిత్రీకరిస్తున్నారు. **"ఇద్దరిద్దరి నడుమ / భగ్గుమనే ద్వేషం ఇరువురి మధ్య సఖ్యత లేని తనం "** అని నగర జీవితంలో మానవుడు ఎవరితో సంబంధం లేకుండా ఒంటరి ద్వీపంలా జీవించడాన్ని చిత్రీకరించారు.

ఇపుడు సమాజం ఒక సంక్లిష్ట స్థితిలో ఉన్నది. పల్లెటూళ్ళో పంటలు పండక ఒకప్పటి అన్నదాతలే ఆత్మహత్యలు చేసికొంటున్నారు. ఉపాధి కోసం పల్లె ప్రజలు పట్టణాల బాటలు పడుతున్నారు. పల్లెటూళ్ళలో గాలి, వెలుతురు వచ్చే పెద్ద పెద్ద ఇళ్ళు, ఖాళీస్థలాలు, ఎటు చూసినా కనిపించే విశాలాకాశం. మనసును మైమరపించే పైరగాలి, ఇవేవీ నగరాల్లో కనిపించవు. నగరానికి వెళ్తే అన్నిటికీ కరువే. పైగా నెల వచ్చేటప్పటికి కట్టాల్సిన అద్దెలు, ఖర్చులు, వలస జీవులను భయపెడుతుంది.

మనిషి ఒక దిగులు పిట్ట ఐపోయాడు. అందుకే దిల్ బహార్‌పై ఒక దుఃఖపు పావురం వేగలేక కూలుతుంది. **"సన్నని సీసం పెంకులు గొంతులో గరగరమంటయ్ / సిటీ కదులుతుంటే / ఎటు తిరిగినా ఒక బరువుంటుంది / వొదిలిపోలేను / వుండనూలేను / వలసపోవడం ఎంతనరకం / నా గూడుకు నేనే కిరాయి కడుతున్నాను"** అని వలస జీవితాల్లోని దుఃఖాన్ని అక్షరీకరిస్తారు. ఉన్న వూరిని వదిలి పెట్టలేని మమకారం.

ఇప్పుడు జీవితం వ్యాపారమయమైపోయింది. అనుభూతులు లేవు, అనురాగాలు లేవు. కేవలం కరెన్సీ మీద కాంక్ష తప్ప మనుషులపై మమతలు, అభిమానాలు లేవు. ఒకరి కోసం కన్నీరు కార్చడం, ఒకరి ఆపదలో చేయూతనివ్వడం లేవు. అందుకే 'రాగివెన్నెల' కవితలో

**"మనమిప్పుడు లో వోల్టేజ్ బల్బుల కోసం / పహారా కాస్తున్నాం / కరెంటును పొదుపు చేయాలి / ఆకలిని పొదుపు చేయాలి / కన్నీళ్ళనీ కవిత్వాలనీ పొదుపు చేయాలి / ఎంతో కొంత వెనకేసుకోవాలి / అమ్మను బొమ్మను చేసయినా సరే / అంతట్నీ అమ్ముకోవాలి / అదే సుఖం... అదే వరం...** అదే జ్వరం అని చెప్తున్నారు. కనిపెంచిన తల్లిని కూడా కనికరం లేకుండా వృద్ధాశ్రమాల పాలుచేస్తున్నారు ఈనాటి కసాయి కొడుకులు. మనుషులు కేవలం మరబొమ్మలుగా డబ్బు యంత్రాలుగా మారిపోవడాన్ని ఈ కవితలో బొమ్మ కట్టించారు కవి.

జీవితం అమ్మకం కొనుగోళ్ళ వ్యాపారమైన సందర్భంలో ప్రాణప్రదమైన అమ్మను బొమ్మగా మార్చైనా, మన స్వార్థం మనం చూసుకోవాలి. అనుభూతుల్నీ, అనురాగాల్నీ

# కవిత

## జీవన వాహిని

- వైష్ణవి శ్రీ
8977237345

జీవితమంటే ...
పొద్దు తిరుగుడు పువ్వున అద్దిన పచ్చదనం
ప్రకృతి జాలువార్చే
శిశిర, వసంత రుతువుల కేళి
మోహపు స్పర్శల ఉక్కిరిబిక్కిరయ్యే
వెచ్చని ఊపిరి
గులాబి తోటలు విచ్చుకుని
విహారమాడే పరిమళం

జీవితమంటే ఒక్కొక్కప్పుడు ...
శరత్చంద్రుడి వెన్నెలలో
మత్తెక్కించే మరుమల్లె
చెలికాడి (చెలి) ఒడిలో సేదతీరే ఆహ్లాదం

అది ఇంకోసారి...
పసికూనల జోలపాట
లేలేత స్పర్శలను
పొదివి పట్టుకునే అమ్మ పొత్తిలి

మరోసారి...
వ్యధ నిండిన గుండె చప్పుడు



మసక బారిన మనిషితనాన్ని తుడిచి
స్పృశించే జీవన వాహిని

జీవితమంటే ...
జ్ఞాపకాల గాళ్ళ సందుల్లోంచి నడిచే
అనుభూతుల నడక
ఎర్రగా విచ్చిన
మందారపు గాయాల మధ్య నలిగే క్షణం
చాలా క్షణాలు బతుకు నుంచి మృత్యువులోకి
మృత్యువు నుంచి బతుకులోకి సాగే
అంతర్వాహిని
నాలుగు గోడల మధ్య ఒదిగే శైశవం

జీవితమంటే...
నిర్వేద నైరాశ్యాల మధ్యనో గెలుపు
హర్షాతి రేఖల మధ్యలో ఆడే ఊగిసలాట
పొత్తిళ్ళ నుండి మృత్యు కుహరం దాక
బతుకునీడ్చే మెలో డ్రామా!! ◆

---

అమ్ముకోవాలి ధనం సంపాదించాలి. అదే సుఖమని ఆధునిక మానవ జీవితంలోని నగ్న సత్యాలను ఆవిష్కరిస్తున్నారు. అందరూ కవిత్వానికి రకరకాల నిర్వచనాలిస్తే సిద్ధార్థ ***"కవిత్వమంటే వెనుకకు తిరిగి నడిచే కాంతి/ ఎండిన తాలాబ్‌ల నెర్రెల్లోని దక్షిణపు గాలి / యశోధరమ్మ గర్భ సంచి / వొల్లంగి పిట్ట"*** అని ఎండిపోయిన చెరువు నెర్రెల్లోంచి వీచే దక్షిణపుగాలి లాంటిది కవిత్వమని కొత్త నిర్వచనమిచ్చారు.

ఈ పుస్తకంలో పడవ శరీర, బాధాసర్పం, మేఘపు ముక్క మంచుగిన్నె, కన్నీటి చిగురు, ముళ్ళకన్ను, ఆకాశపుటాకు, నిప్పుగిన్నె, వయొలిన్ దేహం, తూనీగ కనుగుడ్డు, చీకల చిలుకలు, రక్తం కోకిల, మంటలగజ్జెలు, కొంగల గొలుసులు, రాగివెన్నెల వంటి రూపకాలు కొత్తగా అన్పిస్తాయి. నది నడుస్తున్న చప్పుడు, ప్రేమగల ఆకాశం తన శిరస్సుతో రాస్తున్న అంతరంగపు ఎదసవ్వడి లాంటి వాక్యాలు అంతరంగంలోని ఆర్ద్రతను తట్టిలేపుతాయి.

తెలంగాణ భాషతో, తెలంగాణా ఘోషతో ఈ పుస్తకం నిండా అనేక ప్రాంతీయ పదచిత్రాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. తెలంగాణా చిత్రకారుడు తోటవైకుంఠం చిత్రించిన చిత్రాల్లా రకరకాల రంగులతో ఈ అపురూప కవితా చిత్రాలు అందరి మనసులను ఆకట్టుకొంటాయి. సిద్ధార్థ కవిత్వం మూసపోసిన కవిత్వం కాదు. మనసు పాతాళ గంగ నుంచి పైపైకి ఉబికివచ్చిన కవితాగంగ. రక్తం నుంచి, సిరులునుంచి, ధమనులనుంచి ప్రవహించిన కవితలు. ◆




# ప్రగతిశీల వ్యక్తిత్వమున్న వేమన మన వేమన

- పిల్లా కుమారస్వామి
9490122229

తినగ తినగ వేము తియ్యగనుండు అని వేమన చెప్పినట్లు 'ప్రజాకవి వేమన' గురించి యన్. గోపి రాసిన గ్రంథాన్ని చదువుతున్న కొద్దీ ఆసక్తి పెరిగి ఇంకా తెలుసుకోవాలన్న తపన పెరిగిపోతుంది. వేమనపై యన్. గోపీ పరిశోధన అంత బాగా జరగడం వల్లనే పాఠకునికి అంత మక్కువ ఏర్పడుతుంది. 2017 ఏప్రిల్‌లో అనంతపురంలో జరిగిన వేమన సాహిత్యసమాలోచన రాష్ట్రసదస్సు సందర్భంగా ప్రజాశక్తి బుక్‌హౌస్ ఈ గ్రంథాన్ని పునర్ముద్రించింది.

వేమనపై గోపి కూలంకషంగా అధ్యయనం చేసినారు. ఆయన తన మనసును అందులో అర్పించడంతో వేమనపై అన్ని పార్శ్వాలు, లోతైన సమాచారం వెలుగులోకి వచ్చాయి. ఈ గ్రంథాన్ని ప్రతి ఒక్కరూ చదవాల్సిన అవసరముంది.

'వానలో తడవనివారు, వేమన పద్యాలు తెలియని తెలుగు వారులేరు' అన్నది ఒక నానుడి. వేమన పద్యాల గురించి అందరికీ తెలిసినా వేమన గురించి తెలిసింది చాలామందికి బహు తక్కువ.

వేమన గురించి మొట్టమొదట చెప్పిన వ్యక్తి ఫ్రెంచి మత గురువు దుబాయ్. ఈయన మద్రాసు రాష్ట్రంలో 1792 నుండి 1823వరకు నివసించినారు. ఆ సందర్భములో 'హిందువుల పండగలు సంప్రదాయాలు, అలవాట్లు' గ్రంథాన్ని ఆయన రాసినారు. ఆ గ్రంథంలో వేమన 17వ శతాబ్దం చివరిపాదంలో మృతి చెందాడని చెప్పుకోగా విన్నానని రాసినాడు. అది చదివిన బ్రౌన్ వేమన పద్యాలకోసం సేకరణ ప్రారంభించాడు. వందలకొద్ది కాగితపు ప్రతులు, తాళపత్రప్రతులు సేకరించి 3000పద్యాలను తేల్చినాడు బ్రౌన్. ఇందులో కందం 350 దాకా వున్నాయి. వీటిని రాళ్ళపల్లి ఒప్పుకోలేదు. వేమనవి కావేమోనని సందేహం. బ్రౌన్ తొలిసారిగా 1829లో 693పద్యాలను ప్రచురించారు.

వేమన పద్యాలలో ఆటవెలదులే కాక, కందం, తేటగీతి, సీసం, ఉత్పలమాల, ద్విపద మొదలైనవెన్నో ఉన్నాయని చెప్పినారు గోపి.

వేమన గురించి తెలుసుకోవాలంటే మనకున్న ప్రధాన ఆధారం ఆయన కవిత్వమే. చాలామంది కవుల్లాగా ఆయనది లిఖిత కవిత్వంకాదు. పోనీ ఆయన కవిత్వాన్ని పొగిడిన వాళ్ళుగాని, తెగిడిన వాళ్ళుగాని లేరు. ఆయన పద్యాలన్ని ప్రజల నోళ్ళలో నానినట్టివే. అందువల్లనే ఆయన ప్రజాకవి అయ్యాడన్నారు గోపి.

దుబాయ్ ప్రకారం 17వ శతాబ్దం చివరి పాదంలో అంటే 1675 తరువాత మరణించాడన్నమాట. అంటే 1650 ప్రాంతంలో వేమన జీవించివున్నాడు. వేమన పద్యాలలో తురకల గురించి వుంది కాబట్టి నాటికి మహమ్మదీయులు ఆనాటి సమాజంలో ఉండి ఉండాలి. ఒక పద్యం తురకల గురించి, మక్కా గురించిన ప్రస్తావన కూడా వుంది. దీనిని

బట్టి గోపి వేమన ను 1650 కాలం నాటి వాడుగా నిర్ధారించారు. సురవరం ప్రతాపరెడ్డి 1600–1752మధ్యలో వేమన ఉన్నట్లు భావించారు.

వేమన ఏ ప్రాంతం వాడని తెలుసుకునేందుకు క్రింది పద్యాన్ని విశ్లేషించారు. అయితే అందులో స్పష్టంగా లేదు.

"ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీధి / మూగచింతలపల్లె మొదటివీడు

అరసి చూడ బయలు అది ముక్తిశివుడయా"

ఈ పద్యం ఆధారంగా పలువురు వేమన ప్రాంతాన్ని నిర్ణయించడానికి ప్రయత్నం చేశారు. అందులో బండారు తమ్మయ్యగారిది అర్థవంతంగా ఉందన్నారు గోపి. వేమన పూర్వులది మొదట మూగచింతలపల్లె అని, ఆ తరువాత వేమనది కొండవీడని, ఆవూరిలో పడమటివీధిలో వారి కాపురమని బండారు తమ్మయ్య ఒక అర్థాన్ని తీసుకున్నారు. ఒంగోలులో మూగచింతలపల్లె ఉందని శేషాద్రిరమణ కవులు రాస్తే, కడపజిల్లాలో మూగచింతలపల్లె ఉందని రాళ్ళపల్లి అన్నారు. నెల్లూరు జిల్లా పొదిలిలో ఉందని అది అప్పట్లో కొండవీటిసీమలో ఉండి ఉండవచ్చని బండారుతమ్మయ్య భావించారు. చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలో తప్ప మూగచింతలపల్లె ఇంకెక్కడా లేదన్నారు ఆరుద్ర.

వేమన తన పద్యాలలో ఎక్కువగా తన కాలంనాటి మాండలికాలను అప్రయత్నంగా తన అభిరుచికి, ప్రజల అవగాహనకు అనుగుణంగా వాడినాడన్నాడు గోపి. 'ఓగు బాగెరుగని ఒట్టి మూఢతనంబు', మాటవిననియాలు మగనికిమరగాలు', వాడవదినెకేల వావివర్తనములు', 'పరగబొమ్మగుడ్డ పరికింపజూచిన కులములన్నియందు' ఇలా పద్యాలలో మాండలికాలను వాడినాడు. కూలినాలి, కష్టలోభి, వఱ్ఱెనోరు, పీనుగ, కల్లుముచ్చు, బందసంసారం, కొదవవిటుడు ఇలాంటి పదాలన్నీ రాయలసీమ మాండలికాలే.

'నేయిలేని తిండి నీయాన కసువది/ కూరలేని తిండి కుక్కతిండి' అన్న వేమన పద్యాన్ని పరిశీలించి ఈ ఆర్థిక వర్గం నుంచి వేమన వచ్చివుంటాడని గోపి భావించారు. కాకపోతే తనవర్గంతో ఐక్యంకాక అవధుల్లేని చైతన్యంతో అట్టడగు వారి న్యాయం కోసం వేమన పోరాడినట్లుగా గుర్తించినాడు గోపి. కమ్యూనిస్టుపార్టీ తన సభ్యులను డి క్లాస్ కావాలని చెబుతుంది తన వర్గ భావ జాలాన్ని పరిహరించుకొని క్రింది వర్గంతో ఐక్యం కావాలని అర్థం. అలా వేమన డి క్లాస్ అయ్యాడన్నారు గోపి.

వీరందరి వాదనల ఆధారంగా, వేమన వాడిన పదజాలం ఆధారంగా ఆయన రాయలసీమవాడనే నిర్ణయానికి వచ్చినారు పరిశోధక రచయిత గోపి.

వేమన గురించి ఎక్కువగా తెలియక పోవడం ఏ ఇతర సమకాలీన కవులూ ఆయన గురించి ఎక్కడా ప్రస్తావించక పోవడం వల్లనే. ముఖ్యంగా ఆనాటి కవులు వేమన పద్యాలను కవిత్వంగా భావించలేదు. వాళ్ళ కొలమానల్లో తూచారని పైగా అవి బ్రాహ్మణ భావజాలానికి వ్యతిరేకంగా వుండటం వల్ల కూడా అవి తిరస్కారానికి గురైనాయన్నారు గోపి. అయినప్పటికీ బ్రౌనుకు కుడిభుజంగా నిలబడి వేమన పద్యాలను పరిష్కరించిన వారిద్దరూ బ్రాహ్మణ పండితులే. వారు తిప్పాబొట్ల వెంకశివశాస్త్రి, అద్వైత బ్రహ్మయ్యశాస్త్రి. వారి సహృదయత లేకపోతే ఇది సాధ్యమయ్యే పనికాదంటారు గోపి. కేవలం డబ్బుకోసమే ఇదంతా చేశారని నమ్మలేమన్నారు.

ఏదిఏమైనా బ్రౌన్ 1824లో వేమన పద్యాలను ఇంగ్లీషులోకి అనువదించి ప్రచురించారు. ఆ తరువాత వేమన పద్యాలపై 1914 వరకు ఎవరూ దృష్టి పెట్టలేదన్నారు గోపి.

కొమర్రాజులక్ష్మణరావు, కట్టమంచి రామలింగారెడ్డి వేమన మీదికి తెలుగు వారి దృష్టి మరల్చారు. వంగూరి సుబ్బారావు, వేటూరి ప్రభాకర శాస్త్రి, బండారు తమ్మయ్య, శేషాద్రి రమణ కవులు, మొదలైనవారి కృషి వలన వేమన మీద పరిశోధనకు దారులు ఏర్పడినాయి. ఇందులో రాళ్ళపల్లి వారి కృషి ఆమోఘమైనది.

వేమన పద్యాల సారాన్ని, వివిధ పండితుల వాదనల్ని పరిశీలించిన గోపి, వేమన జీవిత ప్రస్థానాన్ని ఇలా ఊహించారు.

వేమన 17వ శతాబ్దంలో రాయలసీమలో ఒక కాపు కుటుంబంలో జన్మించారు. కాపులను గురించి అతని పద్యాలు, వ్యవసాయ జీవితంతో అతనికి గల పరిచయం, ఇవన్నీ ఆయన 'కాపు' అని తెలియజేస్తాయి. గ్రామంలో పెత్తనం చలాయించే అధికార వర్గంలోనివాడు కావడంవల్ల వేమనకు రాజసగుణం అలవడి వుంటుంది. మంచి మాటకారి. నాయకత్వ లక్షణాలుండి ఉంటాయి. అగ్రవర్ణాలు మొదలు అంటరానివారి దాకా వేమనతో తిరగని వారులేరు. అతని తత్వం కారణంగా కులవ్యవస్థను తీవ్రంగా ప్రతిఘటించినాడు. ఆ తరువాత కాలాల్లో కూడా వేమనలాగా వర్ణ వ్యవస్థను ప్రతిఘటించిన వారులేరు. చాలా మతాలవారితో కలిసితిరగడంవల్ల ఆయామతాలవారితో పరిచయం

కలిగివుంటుంది. అన్ని కులాలనూ విమర్శించడానికి ఆ జ్ఞానం తోడ్పడింది.

యుక్తవయస్సులో వేమన వ్యభిచారకూపంలో పడిపోయాడు. ఆనాటి బసివిరాండ్రు, దేవదాసి జీవితాల్లోకి ఆయన తొంగిచూడడం వల్ల అవన్నీ ఆయనపై ప్రభావం చూపినాయి. కుటుంబాలు విచ్ఛిన్నమై వేరు కాపురాలు పెట్టడం జరిగి వేమన నిస్పృహాయుడైనాడని తోస్తుంది. పెళ్ళాం మాటలు విని వేరు పడ్డవాళ్లను 'ఆలి మాటలు విని అన్నదమ్ములబాసి వేరు పడ్డవాడు వెర్రివాడు' అన్నది దీన్ని చూసే.

తన పాలికి వచ్చిన పొలంలో వ్యవసాయం చేసినాడు. ఆనాటి పేద రైతుల బాధలు, కాపుల అమాయకత్వం గమనించి ఉంటాడు. అప్పుల గురించి చెప్పినవి స్వీయానుభవాలై ఉండవచ్చు. వేమన భార్య అతని మాటవినక ఇంట్లోనేగాక బయటకూడా ఆయన పరువు తీసి వుంటుంది. సంసారంతో విసిగి పోయిన వేమన, సంసార కుటుంబం నుండి బయటపడి సమాజంలోని దుర్లక్షణాలను ఖండిస్తూ పద్యాలు చెప్తూవుండేవాడని గోపి భావించారు.

జాషువా 'వేమన కవీంద్రుడు' పేరుతో, తుమ్మల సీతారామమూర్తి 'వేమతారావళి'లో వేమనకు కవితా పట్టాభిషేకం చేశారన్నారు. వేమనను సాహిత్యకారులు విస్మరించినా సామాన్య జనం మాత్రం ప్రజలు తమ నాల్కల మీద నిలుపుకున్నామన్నారు.

విశాల ప్రపంచానికి పరిచయం చేసేందుకు కవి ఎవరంటే వేమన పేరే చెప్పాలని నార్ల అభిప్రాయపడ్డారు. వేమన పద్యాలు 'సలసల కాగేనీళ్ళు'గా, అవి వైదిక సామ్రాజ్యం నిర్మించుకున్న కోటలను కూల్చే ఆటంబాంబులుగా వర్ణించాడు అన్నాదురై. తిక్కన, వేమన, గురజాడలను తెలుగు కవిత్రయంగా పేర్కొన్న శ్రీశ్రీ వేమన గురించి చెపుతూ 'మూడు పాదాలలో మూడులోకాలకు ముళ్ళు కట్టిన వేమన మహాకవిగా గుర్తించనివాళ్ళు వెర్రివాళ్ళు' అని అన్నారు. "Vemana is a Poetry nature and natural Poet" అని కట్టమంచి పేర్కొన్నారన్నారు.

సామాజిక సంఘర్షణలోంచి వేమన కవితావస్తువు పుట్టిందన్నది వాస్తవం. మానవుల కష్టసుఖాలను, వాటికిగల కారణాలను గాఢమైన అభినివేశంతో చిత్రీకరించాడు వేమన. సామాజిక వ్యవస్థ మీదనే ఆయన గురంతా. ఇతర కవితా పీఠాలను ఎదుర్కోవాలన్న దృష్టి వేమనకు లేదన్నారు గోపి.

చాతుర్వర్ణ వ్యవస్థ మీద ఖండన, ఆర్థిక అసమానతల నిరాకరణ, అమానుషవిలువల మీద ధ్వజమెత్తడం- ఇవన్నీ తెలుగు సాహిత్యంలోనే మొదటి సారిగా వేమనకు కవితావస్తువులు. ఆనాటి భూస్వామిక పరిస్థితులు లాంటివే ఇప్పటికీ కొన్ని నిలిచి ఉండడం వల్లనే ఆ పద్యాలకు ఇప్పటికీ విలువ ఉందన్నారు. వేమనలో ఆత్మాశ్రయ ధోరణి లేదని గోపి పేర్కొన్నారు.

సమాజమనే మేడిపండు పొట్టవిప్పి పురుగుల్ని చూపించడం ప్రజాకవి లక్షణం. సమాజాన్ని పట్టించుకొని, సమాజంలోని సమస్యల గురించి ఆ సమస్యల్ని తన కవిత్వంలో వర్ణించడం ప్రజాకవి మొట్టమొదటి లక్షణం. వేమనలో ఈ లక్షణాలన్ని పుష్కలంగా ఉన్నాయన్నారు గోపి. అందువలనే ఆయనను ప్రజాకవిగా కీర్తించారు.

సమాజం పట్ల ఎంతో ప్రేమగలవారే ఆ పని చేయగలరు. వేమనకు సమాజం పట్ల ప్రేమేగాక ప్రతిచిన్న కదలికకు ప్రతిస్పందించే సున్నితమైన మనసు వుంది. సమాజాన్ని తన ఇల్లుగా భావించి ఒక దర్శనంతో చూసినాడని గోపి భావించారు. కవితాపీఠాలతో సంబంధం లేకుండా కేవలం సమాజాన్ని తన కవిత్వానికి ఆలంబనంగా ఏర్పరచు కొన్నాడన్నారు. వేమనది సంస్కరణ దృక్పథం. అతని నైతిక చక్రానికి ఇరుసు 'ప్రేమ' గా పేర్కొన్నారు గోపి.

అంతరాత్మ నిలువ నతడే పో బ్రహ్మము, 'నీవు నిన్నెరుంగ నీవె పో శివుడవు' లాంటి పద్యాల ద్వారా వేమన అద్వైతాన్నీ అవలబించాడన్నారు రాళ్ళపల్లి. అద్వైతులు వేదాలను అంగీకరించరు. పైగా 'వేద విద్యలెల్ల వేశ్యల వంటివి' అని ఖండితంగా చెప్పినాడు వేమన.

బండారు తమ్మయ్య వేమనను వీరశైవుడన్నారు. కాకపోతే భ్రష్టులైన లింగధారులను తన పద్యాలలో తిట్టాడు కాబట్టి ఆయన వీరశైవుడు కాకపోవచ్చనడానికి ఆస్కారముందంటారు గోపి.

'వేదసారమంత వేమన ఎరుగును' అని చాటిన వేమన సంపూర్ణంగా భౌతికవాది. వేదాలలో వున్నది కూడా నిజంగా భౌతికవాదమే. వేదాలను విశ్లేషిస్తూ రంగనాయకమ్మ ఇటీవల 'ఏంచెప్తాయి వేదాలు' లో వేదాలు ఎలాంటి సాంఘికవిలువలు నేర్పలేదన్నారామె. చార్వాకులలో అసిత కేశకంబళుడు ప్రథముడు. ఇలాంటి చార్వాకుల ప్రభావం కూడా ఆయనపై ఉండొచ్చని గోపి అభిప్రాయపడ్డారు. ఆరుద్ర చెప్పినట్లు వేమన లోకాయతులకు చెందవచ్చని ఊహించారు గోపి.

కాని పనులు చేసి కడుపునింపుకునే అగ్రవర్గాలవారిని ఆదిలో జైనులు, బౌద్ధులు, చార్వాకులూ, లోకాయతులూ ఖండించారు. వీళ్ళను నాస్తికులని వైదికులు ప్రచారం చేసినారు. చార్వాకులు తిండికీ దేహపోషణకు ప్రాధాన్యం ఇస్తారని 'అప్పుచేసిపప్పుకూడు తినడమే' వీరి పద్ధతని 'ఋణం కృత్వాఘృతం పిబేత్' అనే సూత్రాన్ని ప్రచారం చేసినారు. వీరశైవులు లాగా లోకాయతులు కూడా వేదాలను నిరాకరించారు. కులభేదాలను నిరాకరించారు. పైగా దేహపోషణ వేమనలో లేనేలేదు. కాబట్టి వేమన లోకాయతుడు కాదన్నారు గోపి.

'చంపదగిన యట్టి శత్రువు తన చేతి / చిక్కినేని కీడు సేయరాదు / పొసగమేలు చేసి పొమ్మనుటే చాలు', ' శాంతబుద్ధి నుండ సమకూరును సుఖము', మనసు విరిగినేని మరియంట నేర్చునా' లాంటి పద్యాలు ఆయన కోమల హృదయాన్ని మానవత్వపు విలువలను ఎలుగెత్తిచాటాయి. వేమన ఏమి చెప్పినా అన్నింటిలోనూ సహజంగా కనిపించేది నిప్పులాంటి నిజాయితీ. కావున సూనృతమే ఆయన మతమని గోపి నిర్ధారించారు. అంతేగాక వేమనను మానవతావాదిగా కీర్తించాడు గోపి.

వేమన ప్రతిపద్యంలోనూ అంతర్లీనమై సాగిన సద్గుణాలు చిత్తశుద్ధి, సాహసం. సాహసమే ఆయన వ్యక్తిత్వంలోని సౌందర్యం. అంతేగాక రోగగ్రస్త సమాజాన్ని సంస్కరించ పూనుకొన్నాడు. ప్రజలను నిష్కామంగా ప్రేమించగలిగినవాడే దానిని సన్మార్గంలో పెట్టాలనుకొంటాడు. బుద్ధుడు కూడా ఈ పనిని చేసినాడు. వేమనను మరో బుద్ధునిగా మనం భావించవచ్చు. మానవ జాతి మొత్తంలో స్వతంత్ర వ్యక్తిగా మనిషి ఉండలేక పోవడాన్ని గుర్తించిన వేమన 'కులము హెచ్చు తగ్గు గొడవలు పనిలేదు' అని అన్నాడు. 'కులము కన్న మిగుల గుణమే ప్రకాశంబు' అన్నాడు. అస్పృశ్యుల పక్షాన నిలిచి సమాజాన్ని ప్రశ్నించాడు. 'మాలనానినేల మరిమరి నిందింప/ ఒడలనున్న మాంస మొకటి గాదె / వానిలోన వెలుగువాని కులంబేది" అంటూ ధర్మాగ్రహం వ్యక్తం చేశాడు వేమన.

మేనరికం ఎక్కువగా వున్న వివాహాలను గురించి వేమన చెప్పినాడు. అరవలలో ఈ ఆచారం లేదని వేమనకు తెలుసు. దీనిని బట్టి తమిళ ప్రాంతాలను కూడా వేమన తిరిగినట్లు అర్థమవుతోందన్నారు. "మేనమామ బిడ్డ మెరసి పెండ్లామాయె / అరవలందు చెల్లెలాయెనదియు / వలసిన పుణ్యంబు వలదన్న దోషంబు'' అనే పద్యం ద్వారా ఈ విషయాన్ని గుర్తించవచ్చంటారు.

కుటుంబ వ్యవస్థ పగుళ్ళు బారటం, వేశ్యాలోలత్వం అధికం కావటం, కుటుంబ జీవనానికి ప్రమాదంగా మారడంతో వేమన దానిని ఖండించాడన్నారు గోపి.

చాకలి మైలపోవడానికి బట్టలుతికే విధానాన్ని తీసుకొని 'బుద్ధిచెప్పువాడు గుద్దితేనేమయా?" అన్నాడు. గ్రామపెద్దల తీర్పు మందిని బట్టి ఉండేది 'దీనిని పదుగురాడు మాట పాటియైధర చెల్లు' అని చెప్పాడన్నారు గోపి.

ఈనాటి డేరా బాబాల్లాగా చేసే అరాచకాలను ఆ రోజుల్లో గురువులనే పేరుతో కొందరు సాగించేవారు. "తలలు బోడులైన తలపులు బోడులా", 'లింగధారి కన్న దొంగలు లేరురా' అన్న పద్యాలు ఆనాటి దొంగ గురువుల గురించేనని గోపీ వ్యాఖ్యానించారు. "కుక్కదిన్నవాడు గురిలింగజంగంబు/ పంది దిన్నవాడు పరమయోగి / ఏనుగు దిన్నవాడు ఎంత సుజ్ఞానిరా" అని వాళ్ళపై విరుచుకుపడినట్లు గోపి చాలా వివరంగా రాశారు తన గ్రంథంలో.

మహ్మదీయమతం రాయలసీమలో వేళ్ళూనుకుంటున్న సందర్భంలో హిందూమతంలో వున్న లోపాలు అర్థమై వాటిని తాత్వికులు నిశితంగా విమర్శించినట్లు గోపి గుర్తించారు. అందులో వీరబ్రహ్మం, వేమన ముఖ్యులన్నారు. అయితే వేమన పద్యాలలో ముస్లిం ప్రసక్తితో రెండు మూడు పద్యాలు మాత్రమే వున్నాయి. కాని వారి పదజాలం మాత్రం బాగానే ప్రవేశించిందని రచయిత గుర్తించారు.

అనేక మూఢాచారాలను ఖండిస్తూ 'మును ముహూర్తముంచ ముండెట్లు మోసెరా?" 'పియ్యోతినెడు కాకి పితరుడెట్లాయెరా' అంటూ అనేక పద్యాలు చెప్పినాడన్నారు. పాత జీవితం సంసారులకు తగదన్నారు. అలాచేయడం 'పంటచేను విడిచి పరిగె ఏరినట్లు' ఉందన్నాడు.

ధనంతోపాటు మానవత్వం అవసరమన్నాడు. లేనివాడిని ఆదుకోమన్నాడు. శ్రమించేవాడికే ఫలం అన్నది వేమన కోరుకున్నాడు. 'శ్రమములోన బుట్టు సర్వంబుతానౌను' అని అన్నాడు. 'పసిడిగల్గువాని బానిసకొడుకులు' అంటూ ధనస్వామ్యానికి దాసోహం కారాదన్నాడు. పేదరికాన్ని, పేదలను గుర్తించినాడు. 'గోచిపాతకంటే కొంచెంబుమరిలేదు', 'పేదపేద పెనగొనియుండును' అని అన్నాడు. 'కలిమిలేని కాలంబు కలుగునా?' అని భవిష్యత్తు లోకి తొంగిచూసినాడు.

## కూ లీలు నానీలు

- టి. సాంబశివరావు
7993329440



కారేజ్ ఓపెన్ చేసారు
ఇక కాకులకు
లంచ్ టైం

వైజ్ఞానికంగా
వస్తున్నాయి "బహుమానాలు"
నైతికంగా
పోతున్నాయ్" మానాలు

అధికారులు
రాజకీయాల
అక్రమార్జన కోసం
పుట్టిన దాయాదులు !

నా దేశం
'అన్నపూర్ణ'
రత్నగర్భ - బిరుదు
కొందరికి తిండి దొరకదు

బాలగోపాల్
మానవహక్కులు
మేథోవనరు
మానవీయ పవరు !

సినీతెరకు
చైతన్య దీప్తి
ఎర్ర చిత్రాలకు స్ఫూర్తి
శ్రీ నారాయణ మూర్తి !

---

'భూమినాదియన్న భూమి ఫక్కున నవ్వు' అంటూ భూబకాసురులను ఆనాడే తిట్టాడు వేమన. ఇలా వేమన నిశితంగా ఖండించిన వాటిని వివరంగా చెప్పారు గోపి.

ఎంతో ఉన్నత వ్యక్తిత్వం గలిగిన వేమన స్త్రీని చిన్నచూపు చూడటం వాస్తవమేనన్నారు గోపి. స్త్రీ గౌరవం వేమన నిర్లక్ష్యానికి గురికావడం ఆయన ప్రగతిశీల వ్యక్తిత్వంలో ఇది వెనుకంజేనంటారు. అయితే వేమనను సాటిమనిషిగా అర్థంచేసుకుంటే ఈ ఇబ్బందులుండవని చెపుతారు గోపి. ఈ కారణంగా ఆయన ప్రదర్శించిన చైతన్యం విస్మరించరాదన్నారు. అయితే అంత ప్రగతిశీల భావాలున్న వేమన ఇలా చెప్పివుంటాడా? అని సందేహం కలుగకమానదు. బహుశా వేమన లాగా ఎవ్వరైనా రాసి వాటిల్లో ఎవరైనా కలిపేసినారేమో! నిజాల్ని నిగ్గు తేలిస్తేనే ఇది అర్థమయ్యేది.

వేమన కవిత్వంలో ఆనాటి సమాజం అనేకరకాలుగా తొణికిసలాడుతుంది. విజయనగర రాజుల ప్రాభవం పోయి పతనమవుతున్న దశ అది. వారి ఏలుబడి అంతా పాలెగాళ్ళమీద ఆధారపడివుంది. పాలెగాళ్ళు స్వతంత్రులయ్యారు. వీరు ప్రజలను యథేచ్ఛగా దోచుకున్నారు.

'పెక్కుజనులజంపి పేదల వధియించి / డొక్కకొరకు ఊళ్ళు దొంగిలించి

ఎక్కడికని బోవనెరిగి యముడు జంపు' అనే పద్యం దీనికి సాక్ష్యమన్నారు గోపి.

తుచ్ఛులు అధికారం లోకి వచ్చిన సందర్భాలనుచూసిన వేమన 'అల్పబుద్ధి వాని కధి కారమిచ్చిన /దొడ్డవారినెల్లదొలగ గొట్టు' అన్న పద్యంలో వివరిస్తాడు. 'రాచమూక నమ్మరాదురన్న పాముతోటి పొందు పదివేలకైనను' అని కూడా చెప్పాడన్నారు.

'రాజుల్ మత్తుల్ ధూర్తుల్ వారి సేవలు నరకప్రాయంబు' అని ధూర్జటి కూడా రాజాశ్రయాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు తన శ్రీకాళహస్తీశ్వర మహత్యం'లో.

ఆనాడు ఇలాంటి ధనవంతులను, తుచ్ఛులను ఆశ్రయించి తమ కవిత్వాన్ని ఎంత తక్కువకైనా అమ్మే దరిద్రపుగొట్టు కవులను చీదరించుకున్నాడు.

"తోట కూరకైన దొగ్గలికైనను / తవిటి కూరకైన తవిటికైన

కావ్యములను చెప్పుగండ్యాలు ఘనమైరి" అంటూ వారిని ఈసడిస్తూ చెప్పినాడన్నారు.

పాళెగాళ్ళ భూముల్ని తమకు ఇష్టం వచ్చిన వారికి కౌలుకిచ్చేవారు. తిరిగి లాగేసుకునే వారు. రైతుల నుండి పన్నులను పిండి వసూలు చేసేవారు. ఆ మొత్తాన్ని ప్రభుత్వ ఖజానాకు పూర్తిగా జమచేసేవారు కారు. రైతులు తమ భూములనమ్మి పన్ను చెల్లించి వూరువిడిచి వలస పోయేవారు. మరోచోటకు పోయినా ఇదే దుస్థితి. దీన్నే 'భూమి కొత్తయైన భోక్తలు కొత్తలా' అన్నాడు వేమన.

ఆ రోజుల్లో రుణ కోరలో పడినవారి జీవితం వెట్టిచాకిరీతోనే ముగిసి పోయేది. ఈ రుణం తరతరాలుగా సాగి బానిస బ్రతుకులీడ్చేవారు. 'వడ్డీ కిచ్చేవాని వాకిటి బడుదురు' అనే పద్యం దీనిని తెలియజేస్తుందంటారు గోపి.

ఇలా వేమన పద్యాల ద్వారా లోకరీతులను, కుటుంబ సంబంధ బాంధవ్యాలను, కులాంతరాలను, సామాజిక నీతిని, ఆత్మ జ్ఞానాన్ని, అసలుసిసలైన భక్తితత్వాన్ని , ఆధ్యాత్మికతను, మనోబుద్ధి అహంకారాలను, స్త్రీసంబంధ విషయాలను, వ్యక్తిత్వ వికాసాన్ని ఇలా చాలా భావాంశాలను సేకరించుకోవచ్చని యన్. గోపి తన గ్రంథంలో నిరూపించారు.

# ఉత్తేజం నింపిన భీమవరం జనకవనం



వర్తమాన సామాజిక చిత్రాన్ని భీమవరం జనకవనం కళ్ళకు కట్టింది. సమకాలీన జీవిత సమస్యలను వైవిధ్యభరితంగా తమ కవితల్లో గానం చేశారు కవులు. నేటి వ్యవస్థలో అమలుచేయబడుతున్న సామాజిక, ఆర్థిక విధానాల కారణంగా నలిగిపోతున్న ప్రజల గొంతును పట్టించింది భీమవరం జనకవనం. సిపిఎం 25వ మహాసభలను పురస్కరించుకుని భీమవరంలోని క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో ఫిబ్రవరి 4న జరిగిన జనకవనం ఆద్యంతం ఉత్తేజభరితంగా జరిగింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 10 జిల్లాల నుండి హాజరై కవులు తమ స్వీయ కవితలను వినిపించారు. తెలుగునాట ప్రసిద్ధులైన రచయితల నుండి ఔత్సాహిక రచయితల వరకు ఈ జనకవనానికి హాజరై కవితా గానాన్ని ఆస్వాదించారు.

ఆధునిక అభివృద్ధి ఫలాలు సామాన్య ప్రజల వరకూ చేరకుండా అడ్డుపడుతున్న పెట్టుబడిదారీ విధానాల నిజస్వరూపాన్ని కవులు తమ కవితల్లో చిత్రించారు. ఒకవైపు అత్యంత సాంకేతిక అభివృద్ధి కనపడుతున్నా అస్తవ్యస్త ఆర్థిక విధానాలతో దుర్భర దారిద్ర్యాన్ని సృష్టిస్తున్న వైనాన్ని ప్రశ్నించారు. ఒకపక్క సంపద కేంద్రీకరణ మరోవైపు నిత్యావసరాలు తీర్చలేని పరిస్థితులను తమ కవితల్లో శక్తివంతంగా చాటారు. దేశంలో దీర్ఘకాలంగా అమలుచేయబడుతున్న ప్రజా వ్యతిరేక విధానాల కారణంగా క్షీణిస్తున్న మానవ విలువల పట్ల వేదన చెందడం కవితల్లో కనిపిస్తుంది.

రోజంతా జరిగిన జనకవనంలో తొలిభాగంలో ప్రారంభ సభ జరిగింది. సాహితీస్రవంతి గౌరవ అధ్యక్షులు, ప్రముఖ రాజకీయ, సామాజిక విశ్లేషకులు తెలకపల్లి రవి జనకవనం ప్రారంభోపన్యాసం చేశారు. ప్రజాకళల ద్వారా ఉద్యమాలకు ఊపిరిపోసిన చరిత్ర కవులకు ఉందని, మతతత్వం, మార్కెట్‌శక్తులు బుసకొడుతున్న తరుణంలో కవులు, రచయితలు, కళాకారులపై బృహత్తర బాధ్యత ఉందని ఆయన అన్నారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న శాసనమండలి సభ్యులు వి. బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ కవిత్వం వ్యక్తిగతం కాదని సామాజికపరం అంటూ ప్రజా కవిత్వం విస్తృతంగా రావలసిన అవసరం ఉందన్నారు. సిపిఎం పార్టీ రాష్ట్రకమిటీ సభ్యులు మంతెన సీతారాం మాట్లాడుతూ సాహిత్య, సాంస్కృతిక రంగాలలో ప్రగతిశీల భావజాల వ్యాప్తి జరగాలని, మూఢత్వాన్ని, అంధ విశ్వాసాలను తిరిగి ప్రతిష్టించడానికి మతోన్మాద శక్తులు పనిచేస్తున్నాయని వాటి పట్ల అప్రమత్తంగా ఉండాలని కవులకు విజ్ఞప్తిచేశారు. ఆంధ్రప్రదేశ్ పండితపరిషత్ రాష్ట్ర అధ్యక్షులు గిరిరాజ్ మాట్లాడుతూ జనకవనం వంటివి తెలుగు భాషా ఉన్నతికి తోడ్పడతాయని అన్నారు. ప్రారంభ సభకు అధ్యక్షత వహించిన సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు వొరప్రసాద్ మాట్లాడుతూ సామాజిక చైతన్యాన్ని పెంచే దిశగా రచనలు చేయడానికి జనకవనాలు స్ఫూర్తినిస్తాయని, ప్రజా కవుల్లో ఉత్తేజం నింపడానికి ఇటువంటి కార్యక్రమాలు తోడ్పడతాయని అన్నారు.

అనంతరం మూడు భాగాలుగా సాయంత్రం వరకూ జనకవనం జరిగింది. తొలిభాగంలో ప్రముఖ కవులు శిఖామణి, ప్రసాదమూర్తి, దాట్ల దేవదానం రాజు ఆత్మీయ సందేశాలను ఇచ్చారు. శాంతిశ్రీ, నూనెల శ్రీనివాసరావు, నాగాస్త్ర, మార్ని జానకిరాంలు జనకవనాన్ని నిర్వహించారు. భోజనానంతరం జరిగిన విభాగంలో ఎస్.ఆర్. పృథ్వీ, అద్దేపల్లి ప్రభు, గనారా, బొల్లోజు బాబా, సత్యాజీ, రెడ్డప్ప ధవేజిలు ఆత్మీయ సందేశాలు ఇచ్చారు. చింతాడ రామారావు, చైతన్య ప్రసాద్,

చంద్రికారాణిలు జనకవనం నిర్వహించారు. చివరి విభాగంలో ప్రధాన ఆదినారాయణ, వి. శ్రీరామమూర్తి, సయ్యద్ సలార్, ర్యాలి శ్రీనివాసరావు, కడిమెళ్ళ వరప్రసాద్‌లు ఆత్మీయ ప్రసంగాలు చేశారు. ఎ.వి. రమణారావు, డి.ఆర్.కె. నాయుడు జనకవనం నిర్వహించారు.

ఈ జనకవనంలో చదివిన కవితలతో కవితా సంకలనం వెలువరిస్తున్నట్లు మహాసభల ఆహ్వానసంఘం తరపున మంతెన సీతారాం సభలో ప్రకటించారు. కవులు కవితా పఠనం అనంతరం నిర్వాహకులకు తమ కవితలను అందజేశారు. వాటిలో నుండి కొన్ని కవితా చరణాలు....

కాలంలో గురితప్పిన మనిషి / తనను తాను పోగొట్టుకున్న ఏకాకితనం / జన సముద్రం మధ్య ద్వీపం లాంటి ఒంటరి ప్రాణం/ జీవితపు ఖాళీల్లోకి చొరబడుతున్న నిశ్శబ్ద సునామీ/ ఎలియనేషన్ ఆధునిక అర్థశాస్త్ర ఆవిష్కరణ

**– డా॥ చల్లా రవికుమార్**



ఇది ఉసురు తీస్తున్న శిశిరం/ వసంతాన్ని మేల్కొలిపే ఉద్యమానికి ఇది సమయం/ రాలిపడుతున్న కలలన్నీ తిరిగి చిగిర్చి / పచ్చని పిడికిళ్ళెత్తిన పూలు పూయాలి

**– పి. గోపీనాథ్**

'అవసరాలను విలాసాలు కూనీ చేసినప్పుడల్లా /ఫ్యాక్టరీలు శిలాఫలకాలపై/ పిట్టల్లా వాలైనా ఎర్రపక్షులు ప్రతిఘటిస్తాయి.'

**– సిద్ధార్థ కట్టా**

నీది పశువుల రాజ్యం /మనుషులకు స్థానం లేదక్కడ / మానవత్వం కాదు నీది /మనువత్వం **– బ్రౌన్**

జీవితం ఎలా ఉంది అని అడుగుతానా / కళ్ళు రెండూ సముద్రాలే అవుతాయి. / దేహం మొత్తం ఒణికి పోతూ / గుండె లోంచి ఏవో మెరుపుల శబ్దం / ఏదో దహనపు వాసన... / చిన్నాభిన్నమయి పోయిన కలలు / నిరవధికంగా కురుస్తూనే ఉంటాయి **– శిఖా ఆకాష్**

కొడిగట్టిన దీపంలా రక్తసంబంధాలు/ మనిషి జీవితంలో ఇదో విషాదఘట్టం **– రాజాబాబు కంచర్ల**

అక్షరమే కదాని తొక్కిపారేయకు/ మంత్రించి వదిలిన గడ్డిపరకలా / బ్రహ్మాస్త్రమై దహిస్తుంది / నిప్పుల కొలిమిలో కాలుతున్న పేగుకణం / నెత్తుటి స్వప్నాన్ని శ్వాసిస్తుంది

**– మార్ని జానకిరామ్ చౌదరి**

శ్రమలో స్వేదం ఎంత సత్యమో / పోరుబాటలో విజయం అంతే నిజం/ భూమికి మనిషికీ బంధాన్ని ఏమార్చుతూ / మట్టిగా మార్చేవారిపై అదే పోరుమార్గం **– శాంతిశ్రీ**

మనిషిని అణచి అణచి అణగదొక్కితే / అణిగి మణిగిన గుప్త శక్తే / కట్లు తెంచుకు ఉబికి లేస్తే / నీటిధారే లావా ఏరై / పోరుబాటై పోరుతుంది / మరో స్వాతంత్ర్యం ఉదయిస్తుంది / స్వేచ్ఛాగీతం పాడుతుంది **– వి. యోగానందం నాయుడు**

కాసులు చేసే మాయకూ.. కాలం చేసే మాయకూ.../ కర్షకుడు హాలం మీద ఆశలు అడుగంటి ఆత్మహత్యలు చేసుకుంటుంటే / రాబోయే రోజుల్లో రైతంటే ఎవరనే పదానికి అర్థం ఏ నిఘంటువులో వెతకాలో? **– యామినీ దేవి కోడే**

ఊరిచివరి చెట్టు, ఆ ప్రక్కనుండే స్మశానం/ రేపు వ్రేలాడే రైతుకోసం బావురుమంటున్నై/ ఇది, నా గణతంత్ర దేశం పుస్తకంపై / నిత్యం దర్శనమిచ్చే.../ నిత్యనూతన ముఖచిత్రం.

**– కొత్తపల్లి మణిత్రినాథరాజు**

పొగుపడుతున్న మహా సంపద ముందు / తెగిపడిన బతుకు తల కోసం/ తొక్కిసలాటలో దేవులాడుతున్నాడు / నిర్వాసితుడు.

**– అద్దేపల్లి ప్రభు**

రాష్ట్రం చీలి నాలుగేళ్ళయినా / రాజధాని నిర్మాణానికి నాల్గు రాళ్ళు పడలే! **– గడల శివప్రసాద్**

ఉద్యమకారులు సమాజమనే కర్మాగారాన నిత్యకార్మికులు/ సమాజ సంక్షేమ సాగుబడి క్షేత్రాన నిరంతర కర్షకులు / అవినీతి రుగ్మత సోకిన సమాజ వ్యవస్థలను / నిరసనలు పోరాటాలతో/ స్వస్థత పరచే సామాజిక వైద్యులు.

**– దుప్పాడ రామకృష్ణ నాయుడు**

అల్లంత దూరంలో / అలరించిన దృశ్యం/ చరవాణిలో ఇమిడి/ అరచేతిలో ఒదిగిపోయింది/ విజ్ఞాన ప్రగతికి అబ్బురపడేంతలోనే / విశృంఖల విన్యాసాలకు తెరతీసింది / విజ్ఞానం, వినోదం, వికాసాలను క్రమ్మివేసి/ అవధుల్లేని అశ్లీలతను వడ్డిస్తోంది. **– ఎ.వి. రమణారావు**

ఎరుపెక్కిన తూరుపు దిక్కున / నీలి మేఘాల మెరుపుల్నుంచి/ ప్రజ్వరిల్లే చైతన్యం సాక్షిగా/ ప్రతి ఒక్కరూ ఒక్కో అగ్నికణమై/ పెల్లుబుకుతున్నారు ప్రజావెల్లువై!

**– బెండాళం కృష్ణారావు**

## ఆకు పచ్చని నేస్తం

- పాలువ శ్రీనివాస్
8985343469



వెలుగు వాకిలి తెరుచుకుంది
అప్పటికే రెండు పాద ముద్రలు
వీధి వీధిలో
అడుగులోతు దిగబడుతున్నాయి

అడుగు అడుగులో
అనంతమైన ఆత్మవిశ్వాసం
ఆశలను ప్రతి ఇంటి
గుమ్మానికి వేలాడదీస్తూ
చూపులను పిలుపుల వైపు
తరుముతుంటుంది

ప్రతి రోజు ఉదయించే
తాజా ఆశలను గంపనింపుకుని
ఒక ఆకు పచ్చని నేస్తమై

ప్రతి ఇంటి తలుపునీ
పలకరిస్తూ పయనిస్తుంటుంది

నదులై పారుతున్న కర్మ జలాన్ని
కొంగు అంచుల్లోన దాచేస్తూ
బతుకు పోరాటంలో
బడుగు జీవనాన్ని
వీధి దారులకు పరిచయం చేస్తూ
నినదిస్తూనే ఉంటుంది

ఆమె నడుస్తున్న ఒక జీవన శకటం
గ్రహ శకలాల వేటలో
తనువంతా మానని గాయాలై

మంట పెడుతున్నా
చెదరని ఆత్మ విశ్వాసం ఆమెది

ఆమె శ్రమైక జీవన సౌందర్య వనంలో
వికసించిన ఒక తారా కుసుమం
విరబూయడం తెలియని
పసి మొగ్గలకు ఒక స్ఫూర్తి స్ఫోరకం ♦

## మంచితనం

- రవి కుమార్ ఆల్తి
96189 37315

మంచితనమంటే
తప్పించుకు తిరగడం కాదు
పనిగట్టుకుని పట్టించుకోవడం

మంచితనమంటే
మౌనం వహించడం కాదు
మానవత్వపు గొంతు పెంచడం

మంచితనమంటే
బాగుందని భ్రమపడడం కాదు
నిజాన్ని నిక్కచ్చిగా తెలుసుకోవడం

మంచితనమంటే
మెలకువగా రాజీపడడం కాదు
నిద్రలోనూ నిజంతోనే నడవడం

మంచితనమంటే
సత్తువ లేక సర్దుకుపోవడం కాదు
నిజాయితీ కోసం ఓపిక తెచ్చుకోవడం

మంచితనమంటే
శత్రువులు లేకపోవడం కాదు
న్యాయానికి మిత్రుడుగా మారడం



♦

అక్షరాన్ని ఆయుధం చేసుకున్నవాడికి అలుపుండదు/ మోసేదేదైనా జన చైతన్యం కోసం/ జనోద్ధరణ కోసం/ ఉదయించే సూర్యుడిలా ప్రకాశాన్ని వెదజల్లడమే తెలుసు వారికి

- వైష్ణవిశ్రీ

అమరావతిలో అంబేద్కర్ విగ్రహం/ గరగపర్రులో అంబేద్కర్ విగ్రహం/ .../ అది ఓటుబ్యాంకు విగ్రహం/ ఇది ఆత్మగౌరవ విగ్రహం.

- శ్రీ నాగాస్త్ర

ఏమౌతుంది? /ఏమౌతుందో తెలియదు /ఏవో భావోద్వేగాల మంటలు / దేశం అట్టుడికిపోతోంది / స్వేచ్ఛా స్వరం విస్తుబోతోంది.

- నూనెల శ్రీనివాసరావు

మొత్తం 75 మంది తమ స్వీయ కవితలను ఈ జనకవనంలో చదివారు. ఇవి కొందరి కవితల్లోని కొద్ది చరణాలు మాత్రమే. ఈ జనకవనం స్ఫూర్తితో కవులు మరిన్ని మంచి కవితలను రాస్తారని ఆశిద్దాం. ఇంకా ఈ కార్యక్రమంలో కూనపరాజు కుమార్, బి.వి.వి. ప్రసాద్, రామశాస్త్రి, కలిదిండి వర్మ, రాపాక రాజీవ్ తదితరులు పాల్గొన్నారు. మహాసభల ఆహ్వాన సంఘం నిర్వహణలో జనకవనం విజయవంతంగా ముగిసింది. ♦

## మనిషి నా భాష కవిత్వం

**కిల్లాడ సత్యనారాయణ**

వెల :75/- పేజీలు: 116

ప్రతులకు : 9452682999




ఒక మిక్కుటమైన భావుకత, ఒక ఆలోచనాత్మకత, అంతరించిపోతున్న విలువలపట్ల ఒక వేదన, అయినా మొక్కవోని పురోగామితత్వం వంటివి ఈ కవితల్లో చీరకు అంచులా ప్రకాశిస్తున్నాయి.

**- డా॥ ఎన్. గోపి**

## దేవుడు తప్పిపోయాడు కవిత్వం

**విల్సన్‌రావు కొమ్మవరపు**

వెల : 120/- పేజీలు: 204

ప్రతులకు : 8985435515




విల్సన్‌రావు కవిత్వంలో ఒక ఆకర్షణ వుంది. బహు పొందికగా వున్న మనిషిని చూసినట్టు వుంటుంది. క్రమక్రమంగా అతని అనుభవాన్ని విస్తీర్ణం చేసుకుంటున్నాడు. తన చుట్టూ వున్న వృత్తాన్ని దాటాలని ప్రయత్నం చేస్తున్నాడు- స్థిరంగా, ధైర్యంగా, కవిత్వం ద్వారా- తన్ను తాను educate చేసుకుంటున్నాడు. ఒక అపూర్వ జ్ఞానాన్ని అందుకుంటానికి, అందించటానికి ప్రయత్నం చేస్తున్నాడనిపిస్తుంది.

**- కె. శివారెడ్డి**

## సీమేన్ కథలు

**అద్దేపల్లి ప్రభు**

వెల : 100/- పేజీలు: 158

ప్రతులకు: 9848930203




అద్దేపల్లి ప్రభు 'ఊరు గోదారి' చాలా మంచి కథ. గోదావరి ఒడ్డునే వుండేవాళ్ళకు సొంతగడ్డ అనే మమకారంతో కథ మళ్ళీ మళ్ళీ చదవాలనిపించేలా ఉంది. సన్నివేశాలు మనసుకెంతో ఆనందాన్ని కలిగించాయి.

**- డా. మానేపల్లి**

## ఆమె మ్యూజింగ్స్

**నరేష్ నున్నా**

వెల : 120/- పేజీలు: 158

ప్రతులకు : 9849009776



నరేష్‌లోని ప్రత్యేకత యేమిటంటే, తన ప్రపంచాన్నే ఆవిష్కరిస్తాడు. తన పరిధిలోనే తిరుగుతాడు భూమిలాగే. దానిలోనే సత్యం, శివం, సుందరం. అణువులోనే బ్రహ్మాండాన్ని చూపుతాడు. అంతా వ్యక్తిగతం, అదే విశాల విశ్వం. కూపస్థ మండూకం కాదు, కూపస్థ విశ్వం.

**- రాణి శివశంకర శర్మ**

## నాన్న కుర్చీ కవిత్వం

**మధునాపంతుల సత్యనారాయణ మూర్తి**

వెల : 100/- పేజీలు: 81

ప్రతులకు: 9704186544




వాడు/ ఖాళీ చెయ్యనన్నాడు/ చేనంటే... మట్టి/ మట్టంటే... భూమి / భూమంటే... జీవితం/ జీవితం అంటే బ్రతుకు/ బ్రతుకెవడు ఖాళీ చేస్తాడు?/ భూమి సరిహద్దులు.../ తెలియటం కాదు... చేనంటే / జీవితం తెలియటం.

**- మధునాపంతుల సత్యనారాయణ మూర్తి**

## ఎనిమిదో రంగు కవిత్వం

**అనిల్ డ్యాని**

వెల : 100/- పేజీలు: 80

ప్రతులకు : 9392971359




విశాల సామాజిక చట్రంలో నిలబడి కవిత్వాన్ని పవిత్రతల్ని తుడిచేసే చీపురుగా, చీకటిని తరిమే ట్యూబ్లైట్‌లో నిలుపు తున్నాడు. అందుకే ఇతను రాసిన కవిత్వం విలువైనది, ప్రయోజనకరమైనది. పసివాడితనంతో కూడుకున్న ఈ మానసిక ఉత్పత్తి పాఠకుల మానసిక అవసరాలను పరిపూర్తి చేయగలిగిన స్థాయిది.

**- జీ. లక్ష్మీనరసయ్య**

# 'కటికపూలు' పుస్తకావిష్కరణ




ఫేస్‌బుక్ వేదికగా సంచలనాత్మక కథనాలుగా ఇండస్ మార్టిన్ రాసిన 'కటికపూలు' పుస్తకాన్ని ఫిబ్రవరి 8న విజయవాడలోని ఎం.బి.విజ్ఞాన కేంద్రంలో దళిత్ శోషన్ మంచ్ కన్వీనర్ వి. శ్రీనివాసరావు ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఏ రాష్ట్రానికీ మాతృభాషగా లేని సంస్కృత, హిందీ భాషలను దేశ ప్రజలపై రుద్దేందుకు ఆర్‌ఎస్‌ఎస్ తదితర మతోన్మాద శక్తులు ప్రయత్నిస్తుండడం అప్రజాస్వామికమన్నారు. భాషను బలవంతంగా రుద్దే ప్రయత్నం చాలా ప్రమాదకరమన్నారు. ఈ సభకు అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ మాట్లాడుతూ కటికపూలు కథలు సోషల్ మీడియా ద్వారా ఇప్పటికే ప్రాచుర్యం పొందాయని, మార్టిన్ పదునైన వాక్యాలతో తన భావాలను శక్తివంతంగా వ్యక్తీకరించారన్నారు. కవి డాక్టర్ కోయి కోటేశ్వరరావు మాట్లాడుతూ అస్తిత్వ ఉద్యమాల స్ఫూర్తితో అనుభవించిన విషయాలను కొత్త రచయితలు రాస్తున్నారని తెలిపారు. మార్కెట్ సంస్కృతి, మనువాద సంస్కృతి సమాజంపై రుద్దబడుతున్నాయని చెప్పారు. ప్రపంచ తెలుగు మహాసభలు పెట్టేవారు గ్రామాల్లో శ్రమచేసే వారి భాషను ఒడిసిపట్టాలని కోరారు. భాషపై చర్చ జరగాల్సిన అవసరం ఉందన్నారు. కష్టజీవులు మాట్లాడుకునే భాషను తన కథలలోకి తీసుకురావడం ద్వారా ఆ యాసను మార్టిన్ సజీవం చేశారని అన్నారు. అంబేద్కర్, జ్యోతిరావుపూలే అధ్యయన కేంద్రం నిర్వాహకులు డాక్టర్ ఎం.ఎఫ్.గోపినాథ్ మాట్లాడుతూ సోమరిపోతుల సంస్కృతి గొప్పదా? శ్రమజీవుల సంస్కృతి గొప్పదా? అని సమాజం ఆలోచించాల్సిన అవసరం ఉందన్నారు. ఆరేడు శతాబ్దాలలో భాష సంఘర్షణకు సంబంధించి పరిశోధనలు జరగలేదన్నారు. ప్రముఖ కవి ఖాదర్‌మొహిద్దీన్ మాట్లాడుతూ తెలుగు సాహిత్యానికి కటికపూలు రచన తాజాదనం తీసుకువచ్చిందన్నారు. నాగార్జున విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ చల్లపల్లి స్వరూపరాణి మాట్లాడుతూ దళిత సాహిత్యంలో ఉన్న కొన్ని ఖాళీలను కటికపూలు పుస్తకం భర్తీ చేసిందన్నారు. అసహ్యించుకునే పదాలను కూడా ఆత్మగౌరవంగా ప్రకటించటం సాహిత్యంలో ఒక అలంకరణగా ఉందన్నారు. అగ్నిమాపక శాఖ డైరెక్టర్ జనరల్ కిల్లాడ సత్యనారాయణ మాట్లాడుతూ దళితుల్లో అభివృద్ధి చెందిన వారు కిందస్థాయిలో వారిని పట్టించుకోకపోవటంతో దళితుల్లోనే మరోవర్గం ఉద్భవిస్తోందని చెప్పారు. కుల నిర్మూలన కోసం పటిష్టమైన ఉద్యమాలు చేయాల్సిన అవసరం ఉందన్నారు. రచయిత ఇండస్ మార్టిన్ మాట్లాడుతూ దళితుల ఆత్మగౌరవాన్ని గుర్తించాలని చెప్పేందుకు ఈ రచన చేశానని చెప్పారు. ఫేస్‌బుక్ మిత్రుల సహాయంతో ఈ ప్రయత్నం చేశానని, దీన్ని కొనసాగిస్తానని అన్నారు. ఫేస్‌బుక్‌లో పోస్టులుపెట్టిన ప్రతిసారీ కొన్ని శక్తుల నుంచి బెదిరింపులు వచ్చాయన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె.సత్యరంజన్, జి.నారాయణ, కవి గుర్రం సీతారామ్, ఆర్టిస్ట్ అలెగ్జాండర్ తదితరులు పాల్గొన్నారు. ఈ పుస్తకావిష్కరణ సభకు హాజరైన సభికులందరికీ పుస్తకాన్ని అందించి ఆవిష్కరణ కార్యక్రమాన్ని నిర్వహించడం అందర్నీ ఆకర్షించింది. ♦

## కొలకలూరి
## సాహిత్య పురస్కారాలు - 2018

కొలకలూరి విశ్రాంతమ్మ నాటక పురస్కారానికి అంకం లింగమూర్తి ('అమ్మ - నాన్న' నాటికల సంపుటి రూ. 10,000) శ్రీ జీడిగుంట రామచంద్రమూర్తి ('మూడు నాటికలు' నాటికల సంపుటి రూ. 5,000) ఎంపికయ్యారని ఆచార్య కొలకలూరి మధుజ్యోతి, ఆచార్య కొలకలూరి సుమకిరణ్ ఒక సంయుక్త ప్రకటనలో తెలిపారు. ఈ ఎంపికకు ఆచార్యులు : ఆచార్య మధురాంతకం నరేంద్ర, ఆచార్య యన్. మునిరత్నమ్మ, డా. వి. ఆర్. రాసాని న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారని తెలిపారు. కొలకలూరి భాగీరథి కవితా పురస్కారానికి ఈతకోట సుబ్బారావు ('కాకిముద్ద', కవితా సంపుటి, రూ. 10,000), అడిగోపుల వెంకటరత్నం ('ముందడుగు', కవితా సంపుటి, రూ. 5,000) ఎంపికయినట్లు తెలిపారు. ఈ ఎంపికకు ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, ఆచార్య జి. దామోదర నాయుడు, ఆచార్య మేడిపల్లి రవికుమార్ న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారని ఆ ప్రకటనలో తెలిపారు.



సాహితీస్రవంతి ఆధ్వర్యంలో 25 మంది సాహిత్యకారుల రచనలపై అనంతపురంలోని కెఎన్ఆర్ బాలికల జూనియర్ కళాశాలలో ఫిబ్రవరి 18న ఒకరోజు సమీక్షా సదస్సు జరిగింది. ఈ సభకు కటకం కృష్ణవేణి అధ్యక్షత వహించారు. రాచపాళెం చంద్రశేఖర రెడ్డి ముఖ్య అతిథిగా వచ్చి ప్రసంగించారు. జిల్లా జాయింట్ కలెక్టర్ రమామణి ప్రధాన అతిథిగా పాల్గొన్నారు. సాహితీస్రవంతి అనంతపురం జిల్లా గౌరవ అధ్యక్షులు కుమారస్వామి కార్యక్రమాన్ని సమన్వయం చేశారు. ఈ కార్యక్రమంలో హిదయతుల్లా, మల్లెల నరసింహమూర్తి, ఉద్ధండం చంద్రశేఖర్, జెట్టి జైరాం, అశ్వర్థనారాయణ, సడ్లపల్లి చిదంబర రెడ్డి, రాధేయ, నందవరం కేశవరెడ్డి, జూపల్లి ప్రేంచంద్, జీవన్, ప్రగతి, యల్.ఆర్. వెంకటరమణ, మిద్దె మమురళీకృష్ణ, రియాజుద్దీన్ తదితరలు పాల్గొన్నారు.

## స్పందన

డియర్ ఎడిటర్ గారూ!

నమస్సులు. మన 'సాహిత్య ప్రస్థానం' ప్రతినెల అలరిస్తున్నది. ఫిబ్రవరి 2018 సంచికలో 'అద్దేపల్లి ప్రభు' గారి కథ అలరించింది. 'ఓల్గా' గారి ఇంటర్వ్యూ ఆసక్తికరంగా ఉంది. చల్లపల్లి స్వరూపరాణి గారి ప్రస్థానం అమోఘం. అన్ని శీర్షికలూ అలరించాయి. అభినందనలు.

- టి. సాంబశివరావు విజయవాడ


**FORM IV**

(Rule 8)

UNDER PRESS AND REGISTRATION OF BOOKS ACT, 1867
STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS
ABOUT MONTHLY -SHAITYA PRASTHANAM

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Vijayawada |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | V. Krishnaiah |
| 1 (a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | : | - |
| Address | : | H.No. 27-30-4, MB Vignana kendram, Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002 |
| 4. Publisher's Name | : | V. Krishnaiah |
| 1 (a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | : | - |
| Address | : | H.No. 27-30-4, MB Vignana kendram, Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002 |
| 5. Editor's Name | : | T. RAVI |
| Nationality | : | INDIAN |
| 1(a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | : | - |
| Address | : | H.No. 27-30-4, MB Vignana kendram, Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002 |
| 6. Name and addresses of owner | : | V. Krishnaiah |
| 1(a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | : | - |
| Address | : | H.No. 27-30-4, MB Vignana kendram, Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002 |

**I, V. KRISHNAIAH, here by declare that the particulars given above are true to the best of my knowledge and belief.**

Sd/
V. KRISHNAIAH
Publisher

Date: 01.03.2018


Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor, T. Ravi**

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




పేజీలు 160 రూ 120/-




పేజీలు 128 రూ 100/-




పేజీలు 296 రూ 200/-



పేజీలు 144 రూ 100/-




పేజీలు 160 రూ 110/-




పేజీలు 144 రూ 100/-




పేజీలు 536 రూ 350/-




పేజీలు 128 రూ 100/-




పేజీలు 152 రూ 100/-




పేజీలు 160 రూ 100/-

ప్రజాశక్తి బుక్‌హౌస్
27-1-54, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ - 2, ఫోన్ : 0866 - 2577533
బ్రాంచీలు : విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి, గుంటూరు, కాకినాడ,ఏలూరు,
విజయనగరం, ఒంగోలు, నెల్లూరు, కర్నూలు, అనంతపురం

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 02.03.2018 ▪ Date of Publication: 27.02.2018

PRSVM02F190





శ్రీ నారా చంద్రబాబునాయుడు
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వర్యులు



శ్రీ గంటా శ్రీనివాసరావు
రాష్ట్ర మానవ వనరుల
అభివృద్ధి శాఖా మంత్రి

# కస్తూర్బా గాంధీ బాలికా విద్యాలయాల్లో రుతుస్రావ పరిశుభ్రత మీద అవగాహన

- 6-10వ తరగతి దాక ఇంగ్లీషు మీడియం
- ఉచిత విద్య, దుస్తులు, వసతి, భోజనం
- సహజ పథకంలో భాగంగా నెలనెలా ఉచిత శానిటరీ నాప్కిన్లు
- పూర్తిగా మహిళలతో నిర్వహణ
- కంప్యూటర్ విద్య, ప్రొజెక్టర్‌తో పాఠాలు
- కళలు, చేతి వృత్తులు, ఆటలు
- ఆత్మరక్షణ విద్యలోశిక్షణ
- భద్రత, ఆన్‌లైన్ పర్యవేక్షణ
- పోటీ పరీక్షల కోసం ప్రత్యేక శిక్షణ

★ కస్తూర్బా గాంధీ బాలికా విద్యాలయాలు - ఆడపిల్లల పాలిట వరాలు




సర్వశిక్షా అభియాన్,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.

68

If Undelivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor
Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2AL90 |
| పుస్తకం పేరు | వ్యాసాంగం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Gaytri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |